

ఎల్లోరా గుహలలో కైలాస ఆలయం

ఫొటో: వై. సావిత్రి.



# సాటిలేని శ్రేష్ఠతకు అద్భుతమైన పనితనమునకు

## రెండు దివ్యమైన



# నేషనల్ ఎకో మోడలులు!

ఇవిగో, మీరు రేడియో ప్రసారములను విని ఆనందించుటకు చక్కగా పనిచేసే, అత్యంత శ్రేష్ఠమైన రెండు నేషనల్-ఎకో మోడలులు! అవి 'మాన్‌సూనైజ్' చేయబడినవి మరియు వాటితో ఒక సంవత్సరము గ్యారంటీ యివ్వబడుతుంది. మీ దగ్గరలోనున్న నేషనల్ ఎకో వ్యాపారిని వాటిని పెట్టమని నేడే వినండి!



**మోడలు 717:**
యు-717: 8 విధములుగా పనిచేసే 6 వాల్వులు, 8 బ్యాండులు. బి-717: 6 విధములుగా పనిచేసే 4 వాల్వులు, 3 బ్యాండులు. డ్రై బ్యాటరీ సెట్. అందమైన క్యాబినెట్.

రు. 270·00

ఎక్సైజ్ డ్యూటీతో సహా:
పన్నులు అదనము

మా అధికారము పొందిన నేషనల్-ఎకో డీలరుల వద్దనే కొనండి.

**మోడలు ఎ-744:**
8 విధములుగా పనిచేసే 6 వాల్వులు, 4 బ్యాండులు. పియానో-కీ బ్యాండ్ సెలెక్షన్. అందమైన క్యాబినెట్.

రు. 481·40

ఎక్సైజ్ డ్యూటీతో సహా;
పన్నులు అదనము



నేషనల్-ఎకో రేడియోలు శ్రేష్ఠమైనవి

అవి   చేయబడినవి

**జెనరల్ రేడియో & అప్లయన్సెస్ లిమిటెడ్**

బొంబాయి • కలకత్తా • పాట్నా • మద్రాసు • బెంగుళూరు • ఢిల్లీ • సికిందరాబాదు

మీ యింట్లో
నొప్పి అనే మాట
లేకుండా చేయుటకు

# సారిడన్ వాడండి















మీ కుటుంబములో ఎవరికి ఎప్పుడైనా తలనొప్పి, ఒళ్లనొప్పి, పంటినొప్పి జ్వరముగా ఉండుట, మామూలు అస్వస్థతలు మొదలగు వాటితో బాధపడుతూ ఉంటే వారికి సారిడన్ ఇవ్వండి. దానితో వారికి త్వరితముగా, నిరపాయముగా, నిశ్చయముగా స్వస్థత కలుగుతుంది. సారిడన్ పేద దేరుస్తుంది మరియు సహోత్సాహమును కూడ చేకూరుస్తుంది! ఒక సారిడన్ బిళ్ల పెద్దవారికి పూర్తి మోతాదు. పిల్లలకు ½ నుండి ¼ బిళ్ల చాలును.




'ఒకే బిళ్ల చాలును
(ఒక బిళ్ల ఖరీదు 13 న.పై. మాత్రమే

(రోష్ తయారు) ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్లాస్ లిమిటెడ్

JWT VT 2097

# ఉత్తరాలు

## సందేహం

5—7—61 సంచిక ముఖచిత్రం అర్థం సరిగా బోధపడలేదు. కనుక దాని అర్థం ఏమిటి చెప్పండి....చెప్పండి....చెప్పండి .... చెప్పండి.

టి. ఈశ్వరచంద్ర విద్యాసాగరు ( సీతాఫల్‌మండి )

## అవమానమా?

సొప్పిసెట్టి వెంకటేశ్వర్లుతో ఇంటర్వ్యూ లాంటి వ్యాసాలు ప్రచురించడం ఆంధ్ర సచిత్ర వారపత్రికకే అవమానమా! శభాష్! .... ఓ కంకిపాటి ఫ్రెండ్స్ అసోసియేషన్ సభ్యుల్లారా! .... తోటి మానవుల కష్టసుఖాలు తెలుసుకోవడం అవమానమా! ఆ కష్టజీవుల జీవిత గమనాలు పత్రిక మన కందించడం అన్యాయమా! .... తీరిక చేసుకొని మీ అసోసియేషన్ అంతా ఒక్కసారి కలిసికొని ఆలోచించుకోండి.

కె. శోభారావ్ (మద్రాసు)

* * *

కంకిపాడు ఫ్రెండ్స్ అసోసియేషన్‌వారు 'రిక్షావాలా'' వ్యాసం ప్రచురించుట పత్రికకే అవమానం అని వ్రాయుట శోచనీయం. కొంత మంది శ్రీమంతులకు కష్టజీవుల కష్టనష్టములు ప్రచురించుట గిట్టదు. వాటిని ప్రజానీకమునకు తెలియపరచు "పత్రిక" కా అవమానం?

వి. ఎల్. నరసింహారావు (ఆవడి)

* * *

## 'రేఖా' చిత్రకథ

రేఖాచిత్రకథ 'బంగారం సింగారం' చాలా బాగుంటోంది. కాని అదే చిత్రకథలో ఉన్న, ఆపిడ కలు కూడా పట్టమ్మను—కూలిగార్ని—లేపోతే దూకేస్తాను రాకెట్‌మీంచి' అన్న సంభాషణ అర్థం కావటంలేదు.

వి. వాగేశ్వరశాస్త్రి (కారుమూరు)

* * *

## దేవిక బొమ్మలు

ఈమధ్య ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రచురిస్తున్న దేవికగారి బొమ్మలు చూడటానికి ఆకర్షణీయంగా వున్నాయి

పెనుగంటి రామారావు ( రాజమండ్రి )

* * *

## కొత్త శీర్షిక

ఈ వారంనుండి 'మనమూ—మన రాష్ట్రం' శీర్షిక ప్రారంభించడం పత్రికకు మరింత శోభ కూర్చునని నమ్ముతున్నాము. ఇటువంటి విజ్ఞానయుతమైన శీర్షికలు ప్రవేశ పెడుతున్నందుకు మీకు ధన్యవాదాలు.

కాజ సత్యనారాయణమూర్తి ( కాకినాడ )

* * *

## ఢిల్లీ లేఖ

12—7—61 సంచిక "ఢిల్లీ" లేఖలో

## తెలుగు పత్రికలన్నిటికన్న 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' సర్క్యులేషన్ అధికమైనది

"శ్రీ కృష్ణ" గారు గోసంరక్షణ విషయంలో అలా వ్రాయడం ఏమంత సమంజసంగా లేదు. పుణ్య భూమి, కర్మభూమి అయిన పవిత్ర భారతదేశంలో





# ఉత్తరాలు

పుట్టిన ప్రతి హిందువుకి గోసంరక్షణ ప్రధాన కర్తవ్యం. జాతికి మానబిందువులైన, పతాక రక్షణ, స్త్రీరక్షణ, గోరక్షణ, ధర్మరక్షణ వాని కర్తవ్యం. "గోపూజా ధురంధరులు పాలు, వెన్న వినియోగాన్ని ఆ హోటల్లో నిషేధించమని అడుగ వచ్చు" అని వ్రాశారు. గోపూజా ధురంధరు లెప్పుడూ అనుచితమైన కోరిక కోరరు. పూర్వం అలా జరుగలేదు. అసలీ సందేహం ఎలా వెలి బుచ్చారో ఆశ్చర్యంగా ఉంది. అదే గోవధ పాకిస్తాన్‌లో జరిగితే మనం నెత్తినోరు కొట్టుకున్నా లాభంలేదు. బహుశా కేరళలో దేవాలయాలు ధ్వంసం చేసినప్పుడు బాధపడని హిందువులకు ఈ గోవధవల్ల కూడా ఏమీ బాధపడరని శ్రీకృష్ణగారు భావించారేమో!

రఘు (గూడూరు)

* * *

## ఒక సలహా

చిత్రసమీక్షలో తరచు డబ్బింగు పిక్చర్సు గురించి ప్రచురిస్తున్నారు. అలాకాక దయచేసి తెలుగుసినిమాలకే ప్రాముఖ్యం ఇచ్చి మమ్ము లను మరింత ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాము.

పి. వై. మణి (శ్రీకాకుళం)

* * *

## భూప్రదక్షిణం

ఇప్పుడు 7—30 అయింది. మా ఇంటికి పోస్టాఫీసు రెండు ఫర్లాంగులుంది. నేను అక్కడికి చేరేసరికి 7—45 అవుతుంది. ఈ ఉత్తరం రాసే సరికి 8—00 అవుతుంది. అంటే ఈ 'ఉత్తరం' సరిగా 8—00కి వానులో స్టేషనుకు చేరి మెయిలు నందుకుంటుంది. సోమవారం 10—00 గంట లకు మీ ఆఫీసు చేరుకుంటుంది. ఇది ఎందుకిలా రాస్తున్నానంటే '80 రోజులలో భూప్రదక్షిణం' చదివిన తరువాత నాకూ ఫిలియాస్‌ఫాగ్‌లాగే అవుదా మనిపిస్తోంది. మరి నేనూ అతనిలాగే సత్ఫలితాన్ని ఆశించవచ్చుకదూ?

వి. వి. రమణారావు (విశాఖపట్నం)

* * *

ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితము
1908

★

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

★

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంపుటము 53
సంచిక 46

26-7-61
బుధవారం

ప్లవసం॥ ఆషాఢ శుద్ధత్రయోదశి

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి,
మదరాసు-1.

# విషయానుక్రమణిక

ముఖచిత్రం: అమీత

## కథలు



## వ్యాసాలు



## సీరియల్ కథలు



## బాలసాహితి



## శీర్షికలు



## వచ్చేవారం

ముఖచిత్రం: 'ఎప్పుడూ - ఇంతే.'
'తెలుగు వెలుగు' పోటీ ఫలితం

వరదల వల్ల
రాజాజీ పర్యటన
వాయిదా
ఇటీవల సంఘటనలు
తాము చేస్తున్న
పనేమిటి మొరార్జీ భాయ్?
శాంతి
మూవ్, కృష్ణమేనలు దోషులని అనను!
మూవ్, కృష్ణమేనలు దోషులని వినను!
మూవ్ కృష్ణమేనల దోషం కనను!
ఆయుధాల పంపకం
చైనా రష్యాల మధ్య అభిప్రాయ భేదాలు
ఉన్నాయని
శ్రీ ఘోష్ ఎరుగరు!

శ్రీకృష్ణ

# సచివాలయ సిబ్బందికి అదనపు పని భత్యం: ఓట్ల సంపాదనకు మరికొన్ని నూతన పథకాలు

న్యూఢిల్లీ మళ్ళీ ఆవిరిస్నానాల రోజులు వచ్చాయి. ఈ వాతావరణం అక్టోబరు మాసాంతం దాకా ఉంటుంది. వెనక బ్రిటిష్‌వారు వేసవి నివాసాలకు పోవటాన్ని నిరసించినవారే ఈరోజున తామే ప్రప్రథములుగా కొండప్రాంతాలకు తరలిపోవటం అసంభవంగా కన్పించవచ్చు. నిజానికి కొండ ప్రాంతాలకు వేసవియాత్రలను పునరుద్ధరించటం జరిగింది.

వేసవికాలంలో జరిగే సమావేశాల్లో ఎక్కువ భాగం కొండప్రాంతాలలోనే జరిగాయి. శ్రీనగర్‌లో ఒక పెద్ద 'జాంబూరీ' (పిల్లల ఆటలు) జరగబోతోంది. అదృష్టం పట్టిన ప్రతివాడికి హఠాత్తుగా న్యూఢిల్లీ వాతావరణం ఇంక ఏమాత్రం భరించరానిదిగా తోస్తుంది. బీదవాడికి ఆ ఢిల్లీయే (నివాసమే) తనకు అందరాని ఆశయంగా కన్పిస్తుంది. ఒకప్రక్క జనసమ్మర్దమైన కొండప్రాంతాలు, ఇంకోప్రక్కన ప్రజా సంకులమైన మురికిపేటలు — ఇవే భారతదేశం సాధిస్తున్న సామ్యవాదానికి నిదర్శనాలు. ధనం రాకడ పోకడలను గూర్చి విచారణసల్పేందుకుగాను ప్రధానమంత్రి నియమించిన సంఘం ఇంత వరకు ఒక్కపర్యాయమైనా సమావేశంకాలేదన్నది తెలుసుకోటం అవసరం.

* * *

సచివాలయం సామర్థ్యాన్ని దెబ్బతీసేటట్లుగా ఒకపద్ధతిని, అంటే ఓట్లసంపాదన కీలక విధానాన్ని ప్రవేశపెట్టటం జరిగింది. ఈ పద్ధతిని మొదటగా కేంద్ర వేతనసంఘం సిఫార్సు చేసింది. ఈ పద్ధతిప్రకారం కేంద్ర సచివాలయంలోని కొన్ని తరగతుల ప్రభుత్వోద్యోగులకు అదనపుపనికి ధనం ఇస్తారు. ప్రభుత్వం ఉత్తరువు పూర్తిపాఠం ఇలా ఉంది:

"ఈ ఉత్తరువు అనువర్తించే ప్రతి ఉద్యోగి మామూలుకన్న అదనంగా కొంతకాలం పనిచేయాల్సి ఉంటుంది. అలాంటి వ్యక్తి తానుచేసిన అదనపు పనికి ప్రతి గంటకు 1,2 పట్టికలలో ఇచ్చిన ప్రతిఫలం పొందుతాడు:

ప్రభుత్వోద్యోగికి ఇలా అదనపుపనికి ధనం ముట్టజెప్తున్నప్పుడు ఆ ఉద్యోగికి ఇతర సౌకర్యాలు, అలవెన్సులు ఏవీ ఇచ్చేందుకు వీల్లేదు. దారి ఖర్చులు, పనిచేసిన రోజుకు బదులు ఇంకొకరోజు సెలవులాంటి సౌకర్యాలు కల్గించేందుకు వీల్లేదన్నమాట.

అదనపుపని చేసేందుకు ప్రభుత్వోద్యోగిని ఆయన ఇంటినుంచి రప్పించినప్పుడు, అనుమతిగల అధికారి అలాంటి ఉద్యోగికి అదనపుపని అలవెన్సుతోబాటు దారిఖర్చులు కూడ ఇవ్వవచ్చు.

వివరణ 1 : మామూలు పనికాలంతో కలిపి ఏకబిగువున పనిచేసినప్పుడు మాత్రమే, ప్రభుత్వోద్యోగి సెలవుకానిరోజులలో చేసే 45 నిమిషాల అదనపుపనికి ఎట్టి అలవెన్సు చెల్లించబడదు. ఉద్యోగిని ఇంటినుంచి రప్పించి పనికి రప్పించినప్పుడు, అట్టి అదనపు పని కాలం మొత్తానికి అంటే ఉచితంగా చేయాల్సిన మొదటి 45 నిమిషాల అదనపు కాలంతో కలిపి, అదనపు పని అలవెన్సు చెల్లించాల్సి ఉంటుంది.

వివరణ 2 : మొదటి పట్టికకు సంబంధించినంతవరకు అదనపు పనికాలం మొదట 45 నిమిషాల అనంతరం అరగంట వరకు ఒక అరగంటగాను, తరువాత అరగంటదాకా జరిగే కాలాన్ని ఇంకో అరగంటగాను లెక్కవేయటం జరుగుతుంది. అంటే ఒక వ్యక్తి మొదటి 45 నిమిషాలు కాక 2 గం. 10 నిమిషాలు అదనంగా పని చేసినప్పుడు 2½ గంటల అదనపు పనికి అలవెన్సు ఇస్తారు.

వివరణ 3 : రెండవ పట్టిక (బి) విషయంలో కూడా కాలాన్ని అరగంటల క్రిందనే లెక్కించి అలవెన్సు ఇస్తారు. అంటే మామూలు పనికి అదనంగా 2 గం. 10 నిముషాలు పనిచేసిన వ్యక్తికి 2 గంటలకు అదనపు పని అలవెన్సు ఇస్తారు.

వివరణ 4 : ఉద్యోగికి అదనపు పని అలవెన్సు ఇచ్చేటప్పుడు భిన్నాన్ని దగ్గర 5 నయాపైసలకు సవరించి లెక్కిస్తారు. మూడు నయాపైసలు అంతకుపై భిన్నాలను దగ్గరి 5 న. పై. లకు లెక్కిస్తారు. మూడు నయాపైసలకు తక్కువైతే లెక్కలోకి తీసుకోరు.

సర్టిఫికెట్లు : ప్రతి ప్రభుత్వోద్యోగి అదనపు పని చేసినట్లు ఉన్నతాధికారి సంతకంతో ధరఖాస్తును బిల్లుతో కలిపి పంపినప్పుడే అదనపు పని అలవెన్సు మంజూరు చేయటం జరుగుతుంది.

రిజిస్టరు : ప్రతి ప్రభుత్వ కార్యాలయంలోను అదనపు పని రిజిస్టరు ఒకటి ఉంటుంది. ఉన్నతాధికారి సంతకంతో వచ్చిన అదనపు పని అలవెన్సు

( 62వ పేజీ చూడండి. )

### ప్రతి అదనపు గంట పనికి చెల్లించదగిన భత్యం 1 వ పట్టిక

| వేతనాల క్రమం రూపాయలు | మొదటి 45 నిమిషాల అదనపు పనికి | తర్వాత రెండు గంటల అదనపు పనికి | ఆ తరువాత రెండు గంటల అదనపు పనికి | ఆపైన చేసే అదనపు పనికి |
|---|---|---|---|---|
| | | మామూలు పనిరోజులలో | | |
| 50 పైన 100 లోపు | లేదు | 0.45 | 0.55 | 0.65 |
| 100 పైన 150 లోపు | లేదు | 0.75 | 0.95 | 1.10 |
| 150 పైన 200 లోపు | లేదు | 1.05 | 1.30 | 1.55 |
| 200 పైన 250 లోపు | లేదు | 1.40 | 1.75 | 2.10 |
| 250 పైన 300 లోపు | లేదు | 1.76 | 2.10 | 2.55 |
| 300 పైన 350 లోపు | లేదు | 2.00 | 2.50 | 3.00 |
| 350 పైన 400 లోపు | లేదు | 2.30 | 2.85 | 3.45 |
| 400 పైన 450 లోపు | లేదు | 2.60 | 3.25 | 3.90 |
| 450 పైన 500 లోపు | లేదు | 2.90 | 3.60 | 4.35 |
| 500 పైన 550 లోపు | లేదు | 3.25 | 4.05 | 4:85 |
| 550 పైన 600 లోపు | లేదు | 3.55 | 4.45 | 5.30 |
| 600 పైన 650 లోపు | లేదు | 3.85 | 4.80 | 5.75 |

శరీరాన్ని అపాదమస్తకమూ జలదరింపజేసే పీడకలగని ఉలిక్కిపడి మేలుకున్నాడు కాళిదాసు. అతడు కళ్ళు నులుముకుని లేచి బల్లమీదవున్న దీపాన్ని పెద్దదిగాచేసి వాకిటి తలుపు తీశాడు. క్రూరమైన చల్లని గాలి విసురుగా లోపలికి వచ్చింది. అర్ధ రాత్రి దాటి వుంటుంది. వంగపండు రంగులోవున్న చంద్రబింబం అస్తమించబోతు న్నది. నక్షత్రాలు 'మినుకు మినుకుమ'ని మెరు స్తున్నాయి. చంద్రబింబం ప్రక్కన ఒక నక్ష త్రమూ, క్రింద మరో నక్షత్రమూ ఉజ్జ్వలంగా వెలుగుతున్నాయి.

ఉత్తరంవైపు వరండాలో పడుకుని యిద్దరు పిల్లలు నిద్రపోతున్నారు. వారిద్దరూ ప్రతి రాత్రీ చదువుకునేందుకు అక్కడికి వస్తారు. కాళిదాసు రాత్రి నిద్ర వచ్చేదాకా వారికి పాఠాలు చెబుతాడు. తర్వాత వాళ్ళిద్దరూ నెమ్మదిగా చదువుకుంటూ ఏ పన్నెండు గంటల వరకో మేలుకుని తర్వాత తమకు తెలియకుండానే నిద్రాదేవత ఒడిలోకి జారిపోతారు. పరీక్షలను గురించిన భయంతో మళ్ళీ తెల్లవారు జామునే లేచి తూగుతూ జోగుతూ తెల్లవారే దాకా చదువుతారు.

కాళిదాసుకు ప్రతిరోజూ తెల్లవారు జామున మూడు నాలుగు గంటల మధ్య మెలుకువ వస్తుంది. అప్పుడు ఉత్తరం వైపు వంచలోకి వెళ్ళి వాళ్ళిద్దరినీ లేపుతాడు. వాళ్ళు లేచికూర్చుని దుప్పట్లు కప్పుకుని చదువుకోవటం ప్రారంభించగానే తాను వెళ్ళి మళ్ళీ నడుం వాలుస్తాడు. అప్పుడు నిద్ర పడితే మళ్ళీ తెల్లగా తెల్లవారిన తర్వాత పని మనిషి వచ్చి కేకవేసేవరకూ మెలకువరాదు.

కాళిదాసు ఉత్తరంవైపు వరండాలోకి వెళ్ళాడు. పుస్తకాన్ని గుండెలమీద పెట్టుకుని పడుకుని వున్నాడు మురళి. అతడు పదహారేళ్ళవాడు. సన్నగా వుంటాడు. కళ్ళలో తెలివి తేటలు ఉట్టిపడుతూ వుంటాయి. అతని తండ్రి ఏదో ఆఫీసులో పనిచేస్తూవుండేవాడు. ఆయన ఎన్నడూ కనీసం తలనొప్పితోనైనా బాధపడి యెరగడు. అంత ఆరోగ్యవంతుడికీ హఠాత్తుగా చావు ముంచుకుని వచ్చింది. ఒకనాటి సాయంకాలం 'నాకు తల నొప్పిగా వుంది' అంటూ యింటికి వచ్చాడు. ఆనాటి అర్ధరాత్రికే మృత్యువు ఆ చిలకను ఎగర వేసుకుని పోయింది. అప్పటికి అయిదోఫారం చదువుతూ ప్రపంచమంటే యేమిటో, జీవితమంటే యేమిటో తెలియని మురళినీ, చల్లని నిద్రగన్నేరు చెట్టు నీడలో విశ్రాంతి తీసుకుంటున్న దానిలా భర్త నీడలో తన బరువులనూ బాధ్యతలనూ మరచి హాయిగా కాలం గడుపుతున్న భార్యనూ దిక్కులేని వాళ్ళనుచేసి వెళ్ళిపోయాడాయన. అప్పటినుంచి ఆమె, భర్త మిగిల్చిన కొద్ది మొత్తాన్నీ, పిత్రార్జితమైన కొద్ది భూమిమీద వచ్చే ఫలసాయాన్నీ ఆధారంగా చేసుకుని రోజులు వెళ్ళబుచ్చుతున్నది.

రెండోవాడు గోడవైపు తిరిగి పడుకుని గురక పెడుతున్నాడు. ఇంగ్లీషుపుస్తకం వాడి చేతి క్రింద పడి వున్నది. వాడి పేరు రూబెన్. క్రైస్త వుల పిల్లవాడు. మురళి యీడువాడే. కాళిదాసుకు వాణ్ణి చూస్తూవుంటే ఆశ్చర్యంగా వుంటుంది.

మురళి యీడువాడే. కాళిదాసుకు వాణ్ణి చూస్తూ వుంటే ఆశ్చర్యంగా వుంటుంది. తన యిన్నేళ్ళ అనుభవంలోనూ యింత జ్ఞాన తృష్ణవున్న విద్యార్థి యెవడూ తటస్థపడలేదు. వాడి ప్రవృత్తి చాలా చిత్రమైనది. సాధ్యమైనంత తక్కువగా మాట్లాడు తాడు. సాధ్యమైనంత యెక్కువగా వింటాడు. వాడి తండ్రి నలభై యేళ్ళవాడు. కష్టజీవి. కొలిమి ముందు చెమటోడ్చి పని చేస్తాడు. క్లుప్తంగా మాట్లాడుతాడు. ఎంత కష్టపడినా వచ్చే ఆదాయం బొటా బొటీగా సరిపోవటం తప్ప మిగలటం అంటూ ఎన్నడూ లేకపోయినా కొడుకును చదివించాలనే పట్టుదలతో మరింతగా కష్టపడేవాడు.

కాళిదాసు వాళ్ళిద్దరినీ లేపి "చదువుకుంటారా? రాత్రి పడుకోబోయేముందు 'ఇవాళ మరింత పెంద రాళే లేపమ'ని చెప్పారుగా?" అన్నాడు. రూబెన్ లేచి కళ్ళు నులుముకుని దుప్పటిని చెవుల చుట్టూ కప్పుకుంటూ "అయ్యో! చదువుకోకపోతే ఎలా మేస్టారూ! పరీక్ష పేపర్లు ఈసారి మరీ కఠినంగా వున్నట్టూ ఏం రాయడానికీ తోచక మురళి వెక్కి వెక్కి యేడుస్తున్నట్టూ ఇప్పుడు కల కూడా వచ్చింది" అన్నాడు. కాళిదాసుకు నవ్వు వచ్చింది. మురళి దీపం పెద్దదిచేసి పుస్తకం తెరుస్తూ, "ఇది నమ్మకండి మేస్టారూ! వాడికి తనే యేడ్చి నట్టు కల వచ్చి వుంటుంది. చెప్పుకుంటే సిగ్గు చేటని నా పేరు చెబుతున్నాడు" అన్నాడు.

కాళిదాసు నవ్వుతూ లోపలికివెళ్ళి గడియ వేసు కుని పక్కమీద నడుంవాల్చి దీపం తగ్గించబోతూ బల్లమీదవున్న గడియారం వంక చూశాడు. మూడు గంటలు దాటింది. అతడు దీపం తగ్గించి దుప్పటి గుండెల దాకా కప్పుకుని కళ్ళు మూసుకున్నాడు.

చుట్టుపక్కల అంతా నిశ్శబ్దంగావుంది. బల్ల మీద ఉన్న గడియారం చేస్తున్న ధ్వని అనిరవ వాతావరణంలో స్పష్టంగా వినిపిస్తున్నది. ప్రక్క వరండాలో వాళ్ళిద్దరూ నిశ్శబ్దంగా చదువుకుంటు న్నట్టున్నారు. వారి మాటలు కూడా వినిపించటం లేదు.

దాదాపు ఒక పావు గంట గడిచివుంటుంది. ఇంతలో హఠాత్తుగా వాకిలి తలుపుమీద చప్పుడూ, పిలు పులూ వినిపించి కాళిదాసు ఉలికిపడి లేచాడు. అతడు వెంటనే బల్లమీదవున్న దీపాన్ని పెద్దదిగాచేసి "ఏమిటోయ్ గోల?" అంటూ త్వర త్వరగావెళ్ళి తలుపు తీశాడు.

బయట మురళీ, రూబెనూ నిలబడి వున్నారు. రూబెన్ చేతిలో లాంతరువుంది. వారెందుకో కంగారుపడుతున్నారు. కాళిదాసు చిరాకుతో "ఏమి టోయ్! మాట్లాడరేం?" అన్నాడు. మురళి తడ బడుతూ "మేస్టారూ! ఆ వైపు వరండాలో పాపాయి" అన్నాడు. కాళిదాసుకేమీ అర్థం కాలేదు. రూబెన్ వంక చూశాడు. అతను "అవును మేస్టారూ! మీరేరండి చూద్దురుగాని......" అన్నాడు.

కాళిదాసు నివ్వెరపోయి మారు మాట లేకుండా వారి వెంట నడిచాడు. దీపం చూపిస్తూ రూబెన్ ముందు నడుస్తున్నాడు. మురళీ, కాళిదాసూ నెమ్మ దిగా, చెవులు రిక్కించుకుని వింటూ ఆ విశాల మైన వరండాలో నడిచి వెనక వైపుకు వెళ్ళారు. రూబెన్ దీపం పైకెత్తి "అదుగో ఆ మూల....." అన్నాడు.

కాళిదాసు కళ్ళు తిరిగి పడబోయి తమాయించు కున్నాడు. ఆ మూల వెచ్చని గుడ్డల మధ్య నిజం గానే ఒక చిన్నపిల్లవాడు పడుకుని హాయిగా నిద్ర పోతున్నాడు. వాడు భూమిమీదపడి పదిరోజులైనా గడిచి వుంటాయో లేదో అనుమానమే. ఇంకా నెత్తురు గుడ్డులా వున్నాడు.

కాళిదాసు కిదేమీ అర్థం కాలేదు. అంతా కలలా వుంది. కళ్ళు నులుముకుని చూసినా ఆ పసి పిల్లవాడూ, వాడి మీదికి వంగి పరిశీలిస్తున్న తన విద్యార్థులూ కనిపిస్తూనే వున్నారు. దీన్ని నమ్మక పోవటం ఎలా?

వాళ్ళిద్దరూ కాళిదాసువంక తిరిగారు. రూబెన్ "మేస్టారూ! ఈ పిల్లవాణ్ణి ఇక్కడ ఎవరు పడుకోబెట్టివుంటారు?" అన్నాడు. కాళిదాసుకు అంతా అయోమయంగా వుంది. అతనేమీ సమా ధానం చెప్పలేదు. మళ్ళీ ఒకసారి పిల్లవాడివంక చూశాడు. దీపపువెలుగులో ఆ అమాయకప్రాణి వెచ్చగా నిశ్చింతగా నిద్రిస్తున్నది. ఆ పసివాడు బుల్లి చేతులు ముడుచుకుని వున్నాడు.

కాళిదాసు కిప్పటికి యిదంతా నిజమేననీ, కల కాదనీ నమ్మకం కలిగింది. ఇక మిగిలిన ప్రశ్న ఒక్కటే. ఈ పసిగుడ్డును ఇక్కడ ఎవరు వదిలి వెళ్ళివుంటారు? ఎందుకు?

(52-వ పేజీ చూడండి)



శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్యగారి వయసు 23 సంవత్సరాలు. ఒంగోలులోను, విజయవాడలోను, విద్యాభ్యాసం చేశారు. ప్రస్తుతం విజయవాడ లయోలా కాలేజీ తెలుగు శాఖలో పనిచేస్తున్నారు. 'భయం', 'పేరయ్యబావి', 'భ్రష్టయోగి' మొదలైన వీరి కథలు 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక'లో పడిన సంగతి పాఠకులకు విదితమే.




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

26-7-1961 బుధవారము మొదలు
1-8-1961 మంగళవారము వరకు

**మేషం :**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ సమయంలో ధనయోగం బాగుంటుంది. వ్యవహారవిషయాలలో మీరు అనుకున్న విధంగా ఆయా సమయాలలో పనులు జరుగుతూ ఉంటవి. ప్రయాణం చేయువలసి వస్తుంది. మీ ఆలోచనలు సులభంగా తెమలటం వల్ల విశ్రాంతి లభిస్తుంది. మొదట్లో కలహాలు వచ్చేటట్లు కనిపించినా దైవబలంవల్ల సకాలంలో మీ మాటను నెగ్గించుకుని గౌరవం పొందగలుగుతారు. శుభకార్యాలలో పాల్గొనవలసి వస్తుంది. అధికారులతో సంప్రదించే ప్రయత్నాలు నెరవేరటం కష్టం. వృత్తిలో మీ శ్రమ చక్కగా ఫలించి తగినంత ఆదాయం పొందగలుగుతారు. ముందుగా మనుష్యుల స్వభావం తెలుసుకొనకుండా స్నేహం చేయటంవల్ల అపవాదులు రాగల అవకాశాలున్నవి. జాగ్రత్త. 27, 28 లలో అశాంతి, నిరుపయోగమైన ఖర్చులు.

*  *  *

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)

ఇతరుల తొందరవల్ల మంచి చెడ్డలు తెలుసుకోకుండా శ్రమకరమైన పనులలో చిక్కుకొనవలసి వస్తుంది. దేహసౌఖ్యం అంతగా ఉండదు. ఆదాయం పెరిగినా అందుకు తగిన ఉపయోగము, మనశ్శాంతి పొందలేకపోతారు. పదిమందికి సంబంధించిన పనులలో మీ స్థానము, విలువ పెరుగుతవి. కుటుంబంలో శుభకార్యాలు నెరవేరుతవి. తలవని తలంపుగా నిష్ఠుర ప్రసంగాలు వస్తవి. సాధ్యమైనంతవరకు మాట మిగలకుండా చూచుకొనండి. మీ మాటను, మీ పనులను వ్యతిరేకించేవారు ఉంటారు. అయితే చివరకు మీ అభిప్రాయమే ఖాయ మవుతుంది. ఎదురు చూస్తున్న వార్తలు సంతృప్తికరమైన ధోరణిలో ఉండవు. స్వభావం మంచిదికాదని తెలిసి కూడా అటువంటి వారితోనే చేరవలసిన అవసరం కలుగవచ్చు. 29, 30 లలో కార్య విఘ్నము, శిరోబాధ, ఆడంబరం నిమిత్తం ఖర్చులు.

*  *  *

**గ్రహస్థితి**

వృషభ మిధునాలలో శుక్రుడు, మిధున కటకాలలో బుధుడు, కర్కాటకంలో సూర్యుడు, సింహంలో కుజ రాహువులు, మకరంలో గురు శనులు, కుంభంలో కేతువు, ధనుర్మకరకుంభ మీనాలలో చంద్రుడు.

**మిధునం :**

(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ప్రతివిషయంలోను ధైర్యంతో ప్రవేశిస్తారు. అడుగడుగునా ఆటంకాలు వస్తూ ఉంటవి. కాని బుద్ధిబలంతో కార్యం సాధించుకొంటారు. ఈ సమయంలో ఖర్చును గురించి వెనుకకు తగ్గరాదని అనుకున్నా అవకాశం లేకుండా పోతుంది. ఇతరుల వ్యవహార పరిష్కారాలు మొదలయిన సందర్భాలలో నేర్పుతో వ్యవహరించగలుగుతారు. తూర్పు దిక్కు నుంచి లాభవార్తలు తెలుస్తవి. అత్యుష్ణంవల్ల అనారోగ్యసూచనలు కనుపిస్తవి. వారం రెండవభాగంలో గౌరవము, ధనలాభము బాగుంటవి. మీ శక్తిని, అవకాశాన్ని చూచుకుని స్నేహితుల సలహాలను వినియోగించుకొనటం అవసరం. విలువగల వస్తువులు కొంటారు. 31, 1 తేదులలో పుణ్యకార్యాలు, బంధు దర్శనం.

*  *  *

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)

ఎవరు ఏమి చెప్పినా బదులు చెప్పకుండా మంచితనం కాపాడుకొనవలసిన సమయం. అకస్మాత్తుగా దేహబాధలు కనుపిస్తవి. మీకు సంబంధించినవారే మీయందు అసూయభావంతో ప్రవర్తిస్తారు. బంధుమిత్రులకు ధనసహాయం చేయవలసి వస్తుంది. కోర్టుకచేరీలలో శ్రమ, ఖర్చులు అధికంగా ఉంటవి. ప్రయాణాలలో సాధారణమైన ఫలితం మాత్రమే లభిస్తుంది. మంచిమాట చెప్పినా ప్రస్తుతం ఎదురు తిరగగల సమయం. ఇంతకుముందుచేసిన పనులు ఈ సమయంలో ఫలిస్తవి. అధికారులవల్ల అనుకూలత ఉంటుంది. అయితే మనస్సుకు నిలకడ కనుపించదు. రకరకాల యోచనలు చేస్తూ ఉంటారు. ఇతరులతో కలిసి క్రొత్త పనులు ఆరంభించటం మంచిది కాదు. 26, 27 తేదులలో కలహ ప్రసంగాలు, ధనలాభం, వృత్తిలో శ్రమ అధికం.

*  *  *

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

గ్రహస్థితి చాలావరకు అనుకూలంగా ఉన్న సమయం. సంఘంలో మంచిపేరు సంపాదించుకుంటారు. వృత్తిలో మీరు చేసిన ప్రతిపని సులభంగా అనుకూలిస్తుంది. మీక్రింద పనిచేసేవారితో కలహాలు వస్తవి. ఇంతకుముందు తెమలకుండా ఉన్న ఆలోచనలు ఒక దారికి వస్తవి. ఖర్చుతో కూడిన పనులు పైన వేసుకోవలసి వస్తుంది. కుటుంబంలోని వారి ఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండండి. ధనాదాయం బాగుంటుంది. పనులవత్తిడి అధికం కావచ్చు. మీ నిత్య కార్యక్రమాలలో తరచు ఆటంకాలు వస్తూ ఉంటవి. వారాంతంలో ఆత్మీయులతో అభిప్రాయ భేదాలు వస్తవి. సకాలంలో నిద్ర ఆహారములు అమరకపోవటంవల్ల సౌఖ్యం లోపిస్తుంది. 28, 29 లలో విస్తున్నము, త్రిప్పటలో కూడిన పనులు.

### కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

దైవబలం కలిసివచ్చే కాలం. మీ ఆలోచన కాని, ప్రయత్నం కాని, నిమిత్తమాత్రం. అనుకున్న దానికంటే విశేషంగా ఫలితం పొందగలుగుతారు. పుణ్యకాలక్షేపాలు, పెద్దమనుష్యులతో పరిచయం మొదలయినవి లభిస్తవి. ప్రయాణాలు, వ్యవహారాలకు సంబంధించిన పనులు ప్రస్తుతం నిలుపుకోవలసి రావచ్చు. క్రొత్త వారితో మైత్రి లభిస్తుంది. మీమీద చాడీలు కల్పించి చెప్పేవా రుంటారు. కాని, అందువల్ల మీకు కలిగే అపకారం ఏమీ ఉండదు. ఒక సమయంలో మనస్సు తొందరపడినా క్రియలో నిబ్బరంగా ఉండగలుగుతారు గనుక అందరిలోను మంచిపేరు సంపాదించుకో గలుగుతారు. కుటుంబ సౌఖ్యం లభిస్తుంది. సంఘకార్యాలలో మీ బాధ్యత పెరుగుతుంది. గౌరవం కూడా లభిస్తుంది. 30, 31 తేదులలో వినోద కార్యక్రమాలు, శుభ వార్తలు, లెక్కలకు సంబంధించిన పనులలో పొరబాట్లు.

* * *

### తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

మీ అంతస్తు రోజురోజుకు పెరగగల సమయం. అయితే మొదట్లో ధైర్యం తోచదు. తీరా కార్యరంగంలో ప్రవేశిస్తే గాని మార్గం తోచదు. మీ ఆలోచనలు ఎదుటివారికి చక్కగా అనుకూలిస్తవి. బంధువర్గంలో వచ్చిన కలతలు మీ మనస్సును కొంతవరకు చికాకు పరుస్తవి. జీర్ణకోశాలకు సంబంధించిన అవయవాలలో బాధలు వస్తవి. పెద్దమనుష్యులు మీ పరిచయం, సలహాల నిమిత్తం వస్తారు. వచ్చేడబ్బు వస్తూవుంటే ప్రవాహంగా ఖర్చు అవుతూ ఉంటుంది. అయితే తలుచుకున్న దైవకార్యాలు నిరాటంకంగా చేయగలుగుతారు. కుటుంబంలోని వారితో వాగ్యుద్ధాలు రావచ్చుననే భావంతో జాగ్రత్తగా ఉండండి. ప్రయాణాలు జరుగవు. 27, 28 లలో మిత్ర కలహం, కష్టవార్తలు, సంఘకార్యాలు.

* * *

### వృశ్చికం :

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

పైన పెట్టుకున్న బరువును క్రమంగా దించుకుని హాయిగా ఉండగల అవకాశం లభిస్తుంది. కలహాలు వాటంతట అవే సమసిపోతవి. వృత్తిలో ఎదటివారికి మీయొక్క అవసరము, విలువ తెలుస్తవి. ధనాదాయం అనేక రకాలుగా వృద్ధి కాతగిన సూచన లున్నవి. కారణం లేకుండా ఆందోళనకు గురి అవుతూ ఉంటారు. కోర్టు కచ్చేరీలలో అనుకూలమైన సమయం. అయితే కీర్తి ప్రతిష్ఠలకు ఆశించకుండా ఫలితం సాధించుకొనటానికి ప్రయత్నించండి. కుటుంబంలోనివారి అనారోగ్య కారణాలవల్ల ఖర్చులు పెరుగుతవి. ఇతరుల మాటలను నమ్ముకుని అత్యాశలకు పోవద్దు. 29, 30 అకస్మాత్తుగా దేహబాధలు, అపవాదులు.

* * *

### ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)**

మీకు మీరే ధైర్యాన్ని చెప్పుకుని ముందు జరుగవలసిన కార్యక్రమాలకు దిగటం అవసరం. శత్రుబాధ, వృత్తిలో పోటీ క్రమంగా తగ్గుతుంది. ఒకానొక సమయంలో సందేహం తోచినా మొత్తం మీద మీ మాటకు అడ్డులేకుండా ముందుకు పోగలుగుతారు. ప్రయాణాలలో శ్రమను సహించవలసి వస్తుంది. ఫలితం మాత్రం బాగుంటుంది. పుణ్యకార్యాలు సులభంగా అనుకూలించవు. రాజకీయాలలో మీ ప్రతిభ బాగుంటుంది. విలువగల వస్తువులు కొనటానికి అవకాశం లభిస్తుంది. మీ స్నేహితులనుగురించి ఎవరు ఏమి చెప్పినా తొందరపడి కలహాలకు దిగవద్దు. వారాంతంలో శుభవార్తలు తెలుస్తవి. 31, 1 తేదులలో అకస్మాద్ధనలాభం, వాహన భయం. శుభవార్తలు.

* * *

### మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ఎంత తాపత్రయ పడినా ఉపయోగం సాధారణం. మీ మంచితనాన్ని వినియోగించుకుని అవతలివారు మీమీద పెత్తనం చెలాయించగల సమయం. వ్యవహారరంగంలో రాజీమార్గం అనుసరించటం మంచిది. ఇతరులవద్ద నుంచి రావలసిన ధనం కొంతవరకు వస్తుంది. పిల్లల ఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండండి. క్రొత్త మనుష్యులవల్ల మీకు కార్యసిద్ధి, ధనలాభము ఉంటవి. మీ క్రింద పనిచేసేవారివల్ల జరిగిన పొరపాట్లు కష్టనష్టాలకు దారితీయవచ్చు. ఇతరుల బాధ్యతలను పైన వేసుకొని తిరగతగిన సమయం కాదు. ఈ సమయంలో ఎవరు ఏమి చెప్పినా విని వదిలివేయటం అవసరం. 26, 27 లలో ఖర్చులు అధికం. త్రిప్పట, కష్టవార్తలు.

* * *

### కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

ఒక్కొక్కపనీ ఓర్పుతో వెనుక ముందులు తెలుసుకుని విలువబట్టి రంగంలో దిగవలసిన సమయం. సాహసం చేయటంవల్ల చిక్కుపడవలసి వస్తుంది. తొందరపడి చేతిలో ఉన్న డబ్బును వినియోగించటం మంచిదికాదు. ఏ సందర్భంలో ఎప్పుడు కలహాలు వస్తవోనని ఎదురు చూడవలసిన సమయం. సంఘకార్యాలలో మిమ్ములను ప్రోత్సాహపరచి, సహాయం చేసేవారు చల్లగా తప్పుకుంటారు. వాహనాలు ఉపయోగించటం, యంత్రాలకు సంబంధించిన పనులలో జాగ్రత్తగా ఉండండి. ఇంతకుముందు మీరు ఆరంభించిన పనులు, ఇతరులకు చేసిన వాగ్దానాలు ఈ సమయంలో మీ శక్తిని పరీక్షిస్తవి. శుభకార్య ప్రయత్నాలు అనుకూలించవు. 27, 28 లలో ఆశ్చర్యకరమైన వార్తలు, వృధా ఖర్చులు, గౌరవం.

* * *

### ఈవారము ధరలు

బంగారు ధర ఈ వారంలో విశేషంగా పెరగదు. వారాంతంలో మందీ రావచ్చు. వెండి ధర ఆరంభంలో మందీ వచ్చి 29 నుంచి కొద్ది తేజీ వస్తుంది. వేరుశనగపప్పు ధర మందీ వచ్చే సూచన లున్నవి. నూనె ధర మామూలుగా ఉంటుంది. నూవుల ధర అకస్మాత్తుగా పెరగవచ్చు. చింతపండుధర తగ్గుతుంది. వెన్న, నెయ్యి పిటి ధరలలో మందీ వస్తుంది. మిర్చికి గిరాకీ తగ్గుతుంది. నూలు ధరలలో బాగా తేజీ వచ్చే అవకాశా లున్నవి. ప్రత్తిధర గతవారం మాదిరిగా ఉంటుంది.

### మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

మీ మాటను ఎక్కిరానీయకుండా చేయటానికి ప్రయత్నించేవా రుంటారు. దైవికంగా ఈ సమయంలో మీ వృత్తివ్యాపారాలలో అభివృద్ధికరమైన మార్పులు వస్తవి. పదిమందిలో మీ శక్తిసామర్థ్యాలు ఉపయోగించుకుని మంచి పేరు సంపాదించుకోగలుగుతారు. గతవారం కన్నా దేహసౌఖ్యం బాగుంటుంది. ఒక సమయంలో మీకు దూరంగా ఉందామనుకున్నవారే ప్రస్తుతం మీకు అండగా నిలుస్తారు. మీకు సంబంధించిన మనుష్యులు ఎవరు ఏ పొరపాటు చేసినా బాధ్యత మీ మీద పడే సమయం. జాగ్రత్తగా ఉండటం మంచిది. ఇతరులకు వ్రాసే ఉత్తరప్రత్యుత్తరాలలో ఎదటివారికి విసుగు, కోపము రాకుండా చూచుకొనండి. 30, 31 లలో గౌరవప్రాప్తి, శుభ పుణ్యకార్యాలు, మిత్రులవద్దనుంచి లాభవార్త. ★

---

ఇంటి యజమానితో ఒకడు: "ఏమండీ! మీఇంట్లో దోమలూ, ఈగలూ నాట్యం చేస్తున్నయ్యండీ".

ఇంటియజమాని :- మీరిచ్చే అద్దెకు దోమలూ, ఈగలూ కాక సినిమాతారలు వచ్చి నాట్యం చేస్తారనుకుంటున్నారా?

నేతి శివసుబ్రహ్మణ్యము (బందరు)

---

# హరివంశము

## సాందీపనిపర్వం - 21

ఏ దినమున శ్రీ కృష్ణదేవుడు పాగ్రజుడై అవిముక్తమున ప్రవేశించెనో ఆ కడచని దినమంతయు నవిముక్తము పూర్వము ఎట్టులున్నదో, అప్పుడును అట్లె యున్నది. మరి ఆ ఒక్క రాత్రిలో అన్ని విచిత్రములు, అన్ని అద్భుతములు జరుగ్నవని ఎవ్వరు అనుకొనినారు ? తెల్లవారి జనము లేచి చూచుకొనగా కాశిక కాశికవలె లేదు. వైకుంఠము వలె ఉన్నది. వీధులు విశదములుచేయబడి, కస్తూరి కళ్లాపులు చల్లబడి, ముత్యములపొడిలో విదూరజమును కలిపి ఇంద్రధనస్సులను పోని వర్ణములతో రంగవల్లులు తీర్చబడి, పరమ రమ్యముగా నున్నవి. ఎచ్చట చూచినను తోరణములు; ఎచ్చట చూచినను రంభాస్తంభములతో అలంకరణములు ; ఎచ్చట చూచినను విష్ణుదేవుని పురా అవతార కధానకములతోడి చిత్రములు. ఆ వీధులను సమ్మార్జనము చేసినది ఎవరు? ఆ ముగ్గులిడినది ఎవరు ? ఆ అలంకరణములు చేసినది ఎవరు ? మహానందునకు ఇది అంతయు ఆశ్చర్యముగా నున్నది. మరి మహానందునకు ఆశ్చర్యము కల్గిన దనగా, కాశిలో సర్వులకును ఆ ఆశ్చర్యము తలమునుకలైనదని అర్థము. ఎందువలన ననగా, వానికి ఏమియు పట్టదు. భార్యయు, బిడ్డలును ఉన్నారుగాని, వారిని ఆయన ఒక్కదినమున గూడ సరిగా పట్టించుకొన్నది లేదు. మరి సాందీపనియే వారి కుటుంబమును ఆదుకొనక పోయినచో నేమి అయ్యేడిదో, కాశీ విశ్వేశ్వరునకే తెలియవలయును. సాందీపని మహానందుని "జడుడా !" అని సంబోధించును. మహానందుడు నవ్వును. "సాందీపని ! నేను జడుడను. నీవు చైతన్యము యొక్క అచ్చమైన రూపమవు" అనును. ఇట్టి మాటలు సాందీపనికుమారుడు ప్రభాసతీర్థమున అంభోగాహమునకు పోయి అంతర్థానము కాకముందు జరిగెడివి. అతరువాత సాందీపని యింట సంతోషము లేదు. సాందీపనియంతవాడుగూడ పుత్రదుఃఖమునకు తట్టుకొనలేక పోయెను. మహానందునకు ఇదియే విచిత్రమనిపించెను. ఏకచుళకాహంకార నిశ్శేషశోషిత సర్వపాదోధియయుక్కడు అగస్త్యుడు. మరి సాందీపనియో ? ఏకచుళుకాహంకారనిశ్శేష శోషిత సర్వవిద్యాంబునిధి వయుక్కడు. ఇట్టివానికి ఈ దుఃఖమేమి ? సాందీపని తీర్థయాత్రలకు పోయెను. సాందీపని భార్య దీక్షితాయణి దుఃఖమును తాను చూడలేకపోయెను. సాందీపని తీర్థయాత్రలు ముగించుకొని ఆశ్రమమునకు తిరిగి వచ్చెను. అప్పుడును ఆ దంపతుల దుఃఖమును తీరినట్లు లేదు. అశ్వద్థమునందు అగ్నినిపోలె సాందీపనియందు దుఃఖము గర్భితమై అజ్ఞాతమై ఉండెను. దీక్షితాయణియు ఆ భర్తను చూచి, ఆ భర్త శిష్యులనుచూచి పుత్రవియోగము నందలి దుఃఖము కొంతకు కొంతగా ప్రమింగెను. ఇది దుఃఖము పోయినట్లా ! మహానందునకును దుఃఖము కల్గినది. తాను దరిద్రుడు ! చదువుకొనినవాడో ! చదువుకొననివాడో ! తనకును, సాందీపనికిని సాపత్యమెక్కడ ! తనకు భార్య యున్నది. బిడ్డలు ఉన్నారు ! తనబిడ్డలలో ఒక్కబిడ్డ పోయిన తనకు ఇంత దుఃఖము కల్గునా ! ఏమో అనుకొన్నాడు మహానందుడు. తన ఒక్కబిడ్డ పోయి, సాందీపనిబిడ్డ బ్రతుకరాదా ! అప్పుడు సాందీపనికి దుఃఖము లేకపోయి యుండును. మహానందునకు అతనిలో అతనికే నవ్వువచ్చినది. సాందీపని బిడ్డకు కాలము తీరినది. నా బిడ్డలకు, నా దరిద్రమునకు కాలము తీరలేదు. మరి నాకు దుఃఖము ఎట్లు కల్గును ? సాందీపని దుఃఖమును చూడగా తనకును దుఃఖము కల్గినది. ఆయనను తాను ఓదార్ప పోయినాడు. ఆ ఓదార్పుట ఎట్టులున్నది. "అయ్యా ! సాందీపని ! ఇటు చూడు. మనుష్యుడు పుట్టినాడు. అనగా మరణమును కొని తెచ్చుకున్నాడు. అసలు పుట్టుకలేని పద్ధతియేమో దానిని తెచ్చుకొనవలయును గాని, పుట్టిన తరువాత, ఒకడు మరణించెనని ఏడ్చుటయే తగదు. మరి నీవు వేత్తవు. కులపతివి. ఈ శిష్యులను చూడు. ఈ ఆశ్రమమును చూడు. నీ దుఃఖముతోడి దుఃఖము ఈ శిష్యులకు, ఈ ఆశ్రమమునకుకూడ తెచ్చిపెట్టుచున్నావు. నేను గంగకు పోయెదను. గంగయందు గూడ నీకువలె దుఃఖమే నాకు కన్పించును. గంగయే దుఃఖభాజితయయిన, ఇక కాశిలో దుఃఖము కల్గనిది ఎవరికి ! దేని కోసము నీవు విచారించరాదో, దానికోసము విచారము చేయుచున్నావు". ఇట్టులున్నది. మహానందుని మాటలు శ్రవోరంధ్రగతములు కాగా సాందీపనికి ఆశ్చర్యమును కల్గినది; అవహేళనమును పొడమినది. ఆయన అనినాడు : "జడుడా ! ప్రజ్ఞావాదములు పల్కుచున్నావురా ! ఏమి అన్నావు. పుత్రు డన్నచో ఎవరు ? శ్రుతి ఏమన్నది. ఆత్మావై పుత్రనామాసి అన్నది. మరి నేను పుత్రుని రూపములో మరణించగా ఎట్టులుండునురా ! జడుడా !". మహానందుడు ఫుల్లున నవ్వినాడు. "ఓయి ! సాందీపని ! నీవు ఎవ్వరవు. సాక్షాత్తు సత్తువు. సాక్షాత్తు చిత్తువు. సాక్షాత్తు ఆనందమవు. మరి నీకు ఈ దుఃఖము ఏమి ! దుఃఖము అనధికారులకు. మరి నీవు అధికారివి. విద్యలు నీయందు ఉన్నట్లు ఎచ్చటనున్నవి. నీయందు పుష్పించినట్లు ఎచ్చట పుష్పించినవి. అట్టి నీకు దుఃఖమేమి !" అన్నాడు. సాందీపని కన్నులు తెరచినట్లు మహానందుని చూచినాడు. "జడుడా ! కాదు. మహానందుడా ! నీ నామము అన్వర్థమురా!"అన్నాడు. ఆతర్వాతనే తీర్థయాత్రలకు పోయినాడు. అప్పుడును సాందీపని ఇంటిలో దుఃఖము తరిగినది లేదు. దీక్షితాయణి అనుదినము దుఃఖించుచున్నది. ఆమెకు లేకలేక ఆ బిడ్డ కల్గెను. మరి వాడు సామాన్యమైన బిడ్డడా ! రత్నపు మొలక. వానిని తాను చిన్నతనము నుండియు ఎత్తుకొని మోసెను. వానికి తాను అక్షరాభ్యాసముచేసిన దినము ఇప్పటికిని తనకు గుర్తు ఉన్నది. దీక్షితాయణి వచ్చి "మహానంద ! నీవు విచిత్రమైన వాడవురా ! ఆయన యేమో నిన్ను జడుడా అనును. మరి ఆ జడత్వము నీలో నాకు ఎచ్చటను కన్పించుటలేదు. నీవు బుద్ధిమంతుడవు. చదువుకున్న వాడవు. పరమ నిర్వ్యాపారివి. నిన్ను చూచినదో నాకు ఇదే ఆశ్చర్యము. నీవు ఇట్టు లేల యుందువు. నా బిడ్డకు అక్షరాభ్యాసము చేయి. నీకు, నీ కుటుంబమునకు అనుదినమును స్వయంపాకము ఇప్పింతును" అన్నది. అప్పుడు మహానందునకు నవ్వే వచ్చినది. "దీక్షితాయణి ! నా కుటుంబమునకును, నాకును ఏమి సంబంధము. నేను దానిని అడిగి పెండ్లిచేసుకొనలేదు. అది మా మేనమామ కూతురు. నేను జడుడనుకదా ! పెండ్లి వద్దన్నాను. మా మేనమామ వూరుకొన

(58-వ పేజీ చూడండి)

హరిత శివాశర్మ

... కేంద్ర గ్రంథాలయం అదనపు భవనానికి ముఖ్యమంత్రి శ్రీ డి. సంజీవయ్య ఈమధ్య ప్రారంభోత్సవం జరిపారు.

## మనమూ-మనరాష్ట్రం

# శ్రీ సంజీవరెడ్డికి రాష్ట్రనాయకత్వమా?

శ్రీ సంజీవరెడ్డి రాష్ట్రానికి తిరిగి నాయకత్వం వహించాలంటూ ఈమధ్యన ఇద్దరు పెద్దలు తమ కోర్కెలను బాహాటంగా వ్యక్తం చేశారు. వారిలో ఒకరు ఆర్థికమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి. ఈయన ఏలూరు సభలో ప్రసంగిస్తూ, ఆంధ్రరాష్ట్రం వచ్చినప్పుడు శ్రీ సంజీవరెడ్డి ప్రకాశంగారి కాళ్లమీద పడి ముఖ్యమంత్రిపదవికి వారిని ఒప్పించినట్లుగా, ఇప్పుడు అందరం సంజీవరెడ్డిని ప్రాధేయపడి నాయకత్వం స్వీకరించాల్సిందిగా అర్థించాలన్నారు. రెండవవారు శ్రీ మంతెన వెంకటరాజు. ఇటీవల రామాయంపేట బహిరంగ సభలో మాట్లాడుతూ, "సంజీవరెడ్డి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు దీక్షతో ఎన్నో కార్యక్రమాలు సాధించారు. తెలంగాణాకు ఎంతో ఖర్చుపెట్టి మేలొనగూర్చారు. మరో ఎనిమిది నెలల్లో కాంగ్రెస్ అధ్యక్షపదవి తీరిపోయినప్పుడు, శ్రీ సంజీవరెడ్డి రాష్ట్రానికి నాయకత్వం వహించి సలహా, సహకారాలు ఇవ్వాలని" తమ కోర్కెగా విన్నవించారు. కాంగ్రెస్ అధ్యక్షుని ఆంధ్ర, తెలంగాణా పర్యటన సందర్భంలో ఆయన పాల్గొన్న సభలలోనే ఈ ప్రస్తావన రావడంబట్టి వారి (శ్రీ సంజీవరెడ్డి) ఆంతర్యం గ్రహించే, ఈ కోర్కెలను వెల్లడించడం జరిగిందా అని అనుమానించిన వాళ్ళు లేకపోలేదు. పదిమంది అడిగితేగాని పలకనన్నట్లు, బ్రహ్మానందరెడ్డి, రాజాగార్ల అభ్యర్థ [illegible]

రెడ్డి బెట్టుగా యింతవరకు బైటపెట్టలేదు.

రాష్ట్ర నాయకత్వం అంటే, ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షపదవి కాదు. భారత కాంగ్రెస్ అధ్యక్షుని పదవికే పూర్వం ఉండే గౌరవప్రపత్తులు లేనప్పుడు, తిరిగి రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షులుగా రావడంగాని, వచ్చి వారు ఏదైనా సాధించగలగడంగాని అసంభవం కాబట్టి పై ఉభయుల అభ్యర్థనలలో అంతరార్థం శ్రీ సంజీవరెడ్డి మళ్లీ ముఖ్యమంత్రి పదవి చేపట్టాలనేగాని మరొకటి కాదు. శ్రీ మంతెన వెంకటరాజు, తను అలా అనలేదని, వారి సలహా సహకారాలు మాత్రమే కావాలంటున్నానని ఒక వివరణ యిచ్చారు. సలహా, సహకారా లివ్వడానికి, రాష్ట్ర నాయకత్వం చేపట్టనవసరంలేదు. నిజానికి భారత కాంగ్రెస్ అధ్యక్షులుగానే వారి సలహాలు ఎక్కువ చెల్లుబాటవుతాయి. కనక శ్రీ రాజుగారి వివరణ సరైనదిగా కన్పించడంలేదు.

ఇంతకూ అఖిలభారతస్థాయికి వెళ్లిన శ్రీ సంజీవరెడ్డి తిరిగి రాష్ట్రనాయకత్వం చేపట్టవలసిన అత్యవసర పరిస్థితి ఏమిటో ఈ పెద్ద లిరువురూ విశదం చేయలేదు. శ్రీ రెడ్డి ముఖ్యమంత్రిపదవి వదలిపోయిన తరువాత, రాష్ట్రం పూర్తిగా దెబ్బ తినిపోయిందనా? రెండవ ప్రణాళిక జయప్రదంగా అమలైంది; కేటాయించినదానికన్నా ఎక్కువే ఖర్చుపెట్టారు. మూడవ ప్రణాళిక అమలుకూడా మొదలైంది. పరిపాలన మునుపటి [illegible]

...ప్పినా, ఎంతటి బలీయమైన ఒత్తిళ్లకు గురైనా మంత్రివర్గం ధైర్యంగా ఎదుర్కొని నిలబడింది. సంజీవరెడ్డినాయకత్వం లేని లోపం ఎక్కడా కనిపించలేదు. అదీగాక ఒక వ్యక్తి ఎంతటి సమర్థుడైనా, అతను లేకపోతే, అంతా తలక్రిందైపోయే పరిస్థితిగాని, తలక్రిందవుతుందన్న ఆందోళనకుగాని ఏమాత్రం అవకాశం ఉండరాదు. నిజానికి నెహ్రూ తరువాత దేశం ఏమవుతుందోనన్న భయం అందరికీ ఉన్నా, 'నా అనంతరం ఏమిటన్న ఆలోచన అనవసరం; ఫలానావాడు నా వారసు డనటం తగదు' అని స్పష్టంగా చెప్పారు. అలాగే ఒక వ్యక్తి సర్వదా ఒక పదవిలో పాదుకొని ఉండా లనడం, లేదా ఫలానావారు ఆయనకు వారసుడు కావాలనడం సరైన ఆలోచన కాదు. రాష్ట్రంలో అనుభవం గడించి సమర్థులనిపించు కొన్న నాయకులు అఖిలభారతస్థాయికి వెళ్లడం చాల అవసరం. అందువల్ల దేశం మొత్తానికి వారివల్ల ప్రయోజనం కలగడమేగాక రాష్ట్రాలలో కొత్తవారు నాయకులుగా పైకిరావడానికి వీలేర్పడుతుంది. అంతేగాని పైకివెళ్లినవారే మళ్లీ క్రిందికి వచ్చి, నాయకత్వం చేపట్టడం కొత్తవారికి, యువకులకు అవకాశం లేకుండా చేయడమే అవుతుంది.

రాష్ట్రాలలో మేటినాయకు లనిపించుకున్నవారిదివరలో అనేకులు అఖిలభారత స్థాయికి వెళ్లారు. ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉంటూ పండిత పంత్ తన అనంతరం రాష్ట్రకాంగ్రెస్ వాదులలో తగాదాలు తప్పవని తెలిసికూడా నెహ్రూ పిలుపునందుకొని, తన ప్రతిభాసంపత్తిని మొత్తం దేశక్షేమానికి వినియోగించడానికి కేంద్ర [illegible]

# మనమూ మనదేహస్థితీ

డా॥ గాలి బాలసుందరరావు

## నత్తి నివారణ సాధనములు

గతవారం నత్తివారికి సహాయం చేయదలచుకొన్నవారు గమనించవలసిన విషయములు చర్చించాను. చిన్న పిల్లలలో అంకురించిన నత్తి నివారించడం తేలిక. ఎందుకంటే వారిలో మన స్థితి కుదుటబడనిది. పెద్దవారిలో ఏర్పడిన నత్తి కేవలం నోటికి సంబంధించిన లోపంకాదు. అది యావద్దైహిక మానసిక స్వరూపాలకు సంబంధించినలోపం. అందువల్ల దీని నివారణ కష్టసాధ్యము. నత్తి అనివార్యమైనదికాదు. కాని అందరిలోనూ, సులభంగా, నిశ్చయంగా నివారించగలిగిందీ కాదు. కాని కాలక్రమాన ఇది పూర్తిగా నివారించదగిన దేమోననే ఆశమాత్రం కలుగుతున్నది.

చిన్నపిల్లలలో నత్తిని స్కూలుమేష్టర్లు చాలవరకు నివారించడానికి వీలుంటుంది. ఇంట్లో వారికీ వీలుంటుంది. కాని అందుకు కొంత పరిజ్ఞానమూ, ఇష్టమూ, ఓపిక అన్నిటికన్నా ముఖ్యంగా వ్యవధీ కావాలి.

ముందుగా శారీరిక లోపము లేవయినావుంటే వాటిని నివారించాలి.

నత్తి యేర్పడుతున్న, లేక ఏర్పడిన పిల్లలు సిగ్గుతో మాట్లాడడమే మానేసి ఒక మూల కూర్చుంటారు. వారిని ఎంత మాట్లాడడానికి వీలుంటే అంత మాట్లాడేటట్లు చేయాలి. ఇందువల్ల ఆ బిడ్డకూ ఇతర బిడ్డలకూ సన్నిహిత సంబంధం యేర్పడుతుంది. భయము తగ్గుతుంది. కాని యీ పద్ధతి అందరికీ మంచిదికాదు. భయపడేవారిని ప్రోత్సహించి భయంతీరేవరకు నలుగురిలో మాట్లాడమనీ, చదవమనీ బలవంతం చేయరాదు. ముందు వారి ఆపేక్షని, ఆంతర్యాన్నీ చూరగొనాలి.

తరవాత నత్తి బిడ్డకు, ఎప్పటికప్పుడు తను అభివృద్ధి చెందుతున్నాననేభావమూ, సంతోషమూ కలిగించేటట్లుగా వాగ్రోగ నివారణ కార్యక్రమం సాగించాలి. ప్రపంచభాష లన్నింటిలోనూ ఉచ్చరింపబడే శబ్దములు 600 కుపైగా వున్నవి. కాని ఏదో ఒక భాషలో 50, 60 కన్నా ఉచ్చరించవలసిన శబ్దములు ఉండవు. శిశువులు మాటలాడడం ప్రారంభించినప్పటినుండీ ఎన్నోరకాల శబ్దములు చేస్తూ వుంటారు. క్రమంగా తమకు కావలసిన శబ్దములను ఉచ్చరించడం నేర్చుకుని, మిగతా శబ్దములను మరచిపోతారు. ఇల్లా జరగక, కొన్ని అనవసర శబ్దములు మిగిలిపోయినందున పిల్లలలో నత్తి రావచ్చునని కొందరు నిపుణులు భావిస్తున్నారు. కొన్ని శబ్దములు క్రమంగా ఉచ్చరించడం కష్టం. "అడుగో హంతకుడు"" అంటావిక. ఉద్రేకంతో "హడుగో అంతుకుడు అనవచ్చును. ఇది అతిశయోక్తి కాదు. ఇల్లా ఒక సినిమా షూటింగులో తెల్లవార్లూ జరిగింది. అన్నకొద్దీ అదే వచ్చింది. మర్నాడు ఆ ఆర్టిస్టు తాపీగావున్నప్పుడు అనగలిగింది. అందుచేత వాగ్పరిశ్రమ చేయించేటప్పుడు ఏయే శబ్దములమీద నత్తి ఎక్కువగావుందో, వేటిమీద తక్కువగావుందో గమనించి తక్కువశ్రమతో నివారించదగిన లోపాలే ముందు నివారించి బిడ్డకు విజయోత్సాహం కలిగించాలి. ఇందుకు టేప్‌రికార్డుమీద మొదటిలో వారి మాటలు, చికిత్స తరవాత మాటలు రికార్డుచేసి వారికి వినిపించడానికి వీలుంటే చాలా ఉత్తమం. నేను అసమర్థుణ్ణనేభావన, ఒకరి విషయంలో భయం, పెద్దలతో కలిగేక కదల్చడం కష్టం. చిన్న బిడ్డల్లో అల్లాకాదు. వారిని మరిపించడం తేలిక. బిడ్డకు తన లోపములు తనకు తెలియకుండా ఇతరులను అనుకరిస్తూ, సరిగా ఉచ్చరించడానికి మంచి పద్ధతి బృందగానము బృందపఠనము" నత్తి పిల్లలను నలుగురితో కలిపి ఒకే పాఠ్యభాగం పదే పదే అందరిచేత చదివించడం మంచిది. ఇందువల్ల బిడ్డకు నోరు తిరుగుతుంది. భయం పోతుంది. పెద్దవాళ్ళననుసరించి బిడ్డలు మాట్లాడ్డం నేర్చుకున్నట్లే ప్రక్కవారుచేసే శబ్దాన్ని విని యీ నత్తిపిల్లలూ నేర్చుకుంటారు. అయితే నత్తి పిల్లలు, చెవిటివారైనప్పుడు ఈ పద్ధతివల్ల ప్రయోజనం వుండదు. చెవుడున్నవారిలో నత్తి నివారించడం, వారికి మాటలు నేర్పడం అసాధ్యం. వారి దృష్టిమూలంగానూ స్పర్శమూలంగానూ విషయజ్ఞానం కల్పించవలసిందే.

నత్తివారు తరుచు ఊపిరి మధ్యలో మాట్లాడతారు. ఊపిరితిత్తులలో ఎంతగాలి పూరింపబడితే శబ్దోచ్చారణ అంత బాగా వస్తుంది. అందువల్ల మాట అనడానికిముందు ఊపిరి పీల్చేటట్లు చేయాలి. మాట అన్న తరవాత మళ్ళీ పూర్తిగా ఊపిరి పీల్చేటట్లుచేసి మళ్ళీ మాట అనిపించాలి. మాటలు అనకుండానే వారికి దీర్ఘోచ్ఛ్వాస నిశ్వాసపరిశ్రమ రోజూ అయిదు నిముషములనుండి పది నిముషములదాకా చేయించడం అవసరం. ఊపిరి పీల్చడం ఒకకళ. చక్కగా ఊపిరి పీల్చే పెద్దవారే డాక్టరు ఊపిరి పీల్చమనేటప్పటికి ఉచ్ఛ్వాసం పొడిగించడం — నిశ్వాసం తగ్గించడం ఊపిరి బిగబట్టడం అతినెమ్మదిగా పీల్చడం యిటువంటివన్నీ చేస్తారు. ఇక పిల్లలసంగతి చెప్పక్కర్లేదు. ఈ పరిశ్రమ నత్తి వున్న పెద్దవారు కూడా చేయడం అవసరం. ఊపిరివిడుస్తూ ఒకటి రెండు, మూడు, నాలుగు అంటూ ఊపిరి విడుస్తుంటే నత్తి లేకుండా మాట్లాడడానికి వీలుంటుంది. ఆ తర్వాత ఊపిరి లోపలికి తీసుకుంటూ కూడా ఈ అంకెలను అంటూ వుండడం అభ్యాసం చేయించాలి. ఇది బాగా వచ్చినతరవాత ఇతర శబ్దములను, పదములనూ ఉచ్ఛ్వాస నిశ్వాస సమయములలో ఉచ్చరింపజేయాలి. ముందు ఒకదీర్ఘ నిశ్వాసం తీసుకునేట్లు చేసి నెమ్మదిగా అనిపించాలి. ఇల్లా చేయిస్తున్నప్పుడు, కోపగించరాదు. నవ్వరాదు. భయపెట్టరాదు. అల్లా చేసే వారి ముందర యీ పరిశ్రమలు చేయించరాదు.

నత్తి పిల్లలకు ఇష్టమైనవి, ఆనందకరములైనవీ అయిన కథలుచెప్పి అవి వారిచేత చెప్పించడానికి ప్రయత్నించాలి. ఆ కథలు వారికి వినోదాన్నీ ఆనందాన్ని కలిగించేవిగా వుండడం అత్యవసరం. దేనిని పిల్లలు మెచ్చుకుని, ఆనందిస్తారో ఆ పనిని తాముగా చేయడానికి, తాముగా చేయగల ప్రయత్నమంతా చేయడం వారి మనస్తత్వానికి పునాది. ఈ కథలు నిర్ణయించడంలో "ఆ కథ నేను ఆవిధంగా ఎన్నడూ చెప్పలేను" అనే అధైర్యం కలిగే స్థాయిలో వాగ్రోగ నిపుణుడు ప్రయత్నించరాదు. నత్తివారి మాటలు గమనించి, ఏ మాటలు స్వల్ప లోపములతో ఉచ్చరింపబడుతున్నవో ఏ లోపములు స్వల్ప ప్రయత్నంతో శీఘ్రకాలంలో నివారింపదగినవో గమనించి ఆ మాటలు ఉపయోగిస్తూ, కథలు చెప్పి చెప్పించాలి. సరిగా చెప్పినవారికి మెప్పూ, బహుమానం యిచ్చి ప్రోత్సహించాలి.

ఒంటరిగా నత్తివారిచేత, తమ నత్తిని గురించీ, అందువల్ల వారుపడే బాధను గురించీ మాట్లాడింపజేసి ఆ లోపంవల్ల వారు మానసిక క్షతికీ శాశ్వతమైన ఆత్మవిధ్వంసకరమైన భీతికీ, ఆత్మనిందకూ, ఆత్మ విశ్వాస నాశనానికీ గురి కాకుండా తమలోపం సవరించడానికి వీలున్నది. అందుకు తమ ఉత్సాహము, సహకారము అవసరం అని విశ్వసింపజేయాలి. ఇతర లోపాల కన్నా ఇది ఘోరమయిన లోపంకాదనీ, ఎన్నో లోపాలున్నవారు ఎన్నో ఘనకార్యాలు ఆత్మవిశ్వాసంతో సాధించారనీ నచ్చజెప్పి వారిలో స్వవిషయంలో న్యూన్యభావము ఏర్పడివుంటే అది తొలగించి జీవితంమీద ఉత్సాహం యేర్పరచాలి. ఒక మాట్లాడడం విషయంలోనేకాక, ఆటలు, పాటలు, చిన్నచిన్న పరిశ్రమలు, చిత్రలేఖనం ఇటువంటివన్నీ నత్తివారికి ముఖ్యంగా నేర్పించడానికి ప్రయత్నించాలి. ఏదో ఒకవిషయంలో ఘనవిజయం సాధించడంకన్నా, ఆత్మవిశ్వాసం, జీవితేచ్ఛ కలుగడానికి మంచి సాధనం వేరేలేదు. ప్రకృతిలో ఒక లోపాన్ని సవ

(52-వ పేజీ చూడండి)

# కథ కాని కథ

## జ్ఞాపకం ఉండదని....

### (మొదటి బహుమతి రు. 10 లు)

మా యింట్లో ఆఫీసు క్యాలెండరు ఒకటుంది. మా నాన్నగారు పెద్దవారు గనుక రోజూ కాగితం చించడం మరిచిపోతూండేవారు. ఒకరోజున నాన్న గారు మా చిన్నతమ్ముణ్ణి పిలచి "ఒరే చిన్నా! నీవు ప్రతిరోజూ లేవగానే ఈ క్యాలెండరు పై కాగితము చింపుతూ ఉండాలి." అని చెప్పారు. వాడు సరేనని ఒప్పుకున్నాడు. మర్నాడు నాన్నగారు లేచి చూచేసరికి చాలా కాగితాలు చింపబడి ఉన్నాయి. రోజూ ఒక్కొక్క కాగితం చింపమంటే ఒక్కసారే యిన్ని కాగితాలు చింపేవేరా" అని అడిగారు తమ్ముణ్ణి. "అదికాదండి నాకు ప్రతిరోజూ జ్ఞాపక ముండదేమోనని ఆపని ఒకసారే చేశానండి" అని ఏడుపుమొగం పెట్టి సమాధానం యిచ్చాడు. అది విన్న మా నాన్నగారికి నవ్వాగిందికాదు. నేనూ నవ్వలేక చచ్చాను.

ఈదర అప్పారావు ( ఆచంట )

* * *

## 'మా అబ్బాయికీ వచ్చింది'

### (రెండవ బహుమతి రు. 5 లు)

మా హైస్కూలులో పరీక్షలకు ముందు డ్రామాలు వేశాము. డ్రామా లయిన తరువాత అందరికీ బహుమతులు యిస్తున్నారు. అందరూ వారివారి తల్లి తండ్రులను కూడా పిల్చుకు వచ్చారు. స్త్రీ లందరూ ఒకప్రక్క కూర్చు న్నారు. డ్రామాలో వేసినవారందరికీ బహు మతులు యివ్వటం ప్రారంభించారు. 'అదిగో! మా అమ్మాయికి ప్రథమ బహుమతి వచ్చింది' అని మా ప్రక్కనావిడ అన్నది. నేను కూడా పోయి నా బహుమతి తెచ్చుకొన్నాను.

మా అమ్మగారు మా అమ్మాయికి కూడా బహు మతి వచ్చినది' అన్నారు.

ఇలా అందరూ "అదిగో మా అమ్మాయికి వచ్చింది, అదిగో మా అమ్మాయి వచ్చిందని అంటున్నారు. ఇంతలో ఒకావిడ మా అబ్బాయికి ప్రథమ బహుమతి వచ్చింది' అన్నది. మేము ఎవరా అని చూస్తే ఆవిడ చూపెట్టిన అబ్బాయి మా పెద్ద అన్నయ్య. నేను, మా అమ్మ ఒక్కసారి నవ్వేము. ఆవిడ తెల్లబోతూ అక్కడ నుండి లేచి వెళ్ళిపోయింది.

ఆర్. వసంతకుమారి (మద్రాసు)

## తండ్రి అలవాటు

### (రెండవ బహుమతి రు. 5 లు)

"అయ్యో! వెంకట్రమణ .... ఆవు" అనే కేకలు విని దిగ్గున వీధిలోకి వచ్చాను. సుమారు నలభై ఏండ్ల వయస్సున్న ఒకతను సైకిలుపై కేకలు వేస్తూ వస్తున్నాడు. నాకేమీ అర్థంకాక వీధిలో నిలబడి చూస్తున్నాను. ఇంతలో మా ప్రక్కయింటి అబ్బాయి నవ్వుతూ పరిగెడివచ్చి సైకిలుపై నుండి అతనిని దింపాడు. నా కేమీ అర్థంకాక ఆ అబ్బాయిని పిలిచి ఏమి జరిగింది అన్నాను. అందుకు ఆ అబ్బాయి ఇట్లా చెప్పాడు: మా నాన్నగారికి స్కూలుకు పోయేటప్పుడు వచ్చేటప్పుడు ఎలక్ట్రిక్ స్తంభమును పట్టుకొని సైకిలు దిగటం అలవాటు. ఆదినం స్తంభమువద్ద ఆవు నిలబడి ఉంది. అందువల్ల "అయ్యో! వెంకట్రమణ ఆవు" అని నన్ను పిలిచారు. నేను రాకున్న ఎన్నిమార్లు పిలిచేవారో అని నవ్వుతూ చెప్పాడు. అది విని నేను నవ్వుతూ ఇంట్లోకి వెళ్ళాను.

ఎస్. వి. జయలక్ష్మి ( మదనపల్లి )

* * *

## 'ఏరాజు గాడిదరా'

### (రెండవ బహుమతి రు. 5 లు)

అవి మేము స్కూలుఫైనలు చదువుకునే రోజులు. మా స్కూల్లో నలుగురు రాజుల కుర్రవాళ్ళుండేవారు. వారిలో ఒకడు ఎప్పుడూ నవలలు చదువుతూ ఉండేవాడు. ప్రఖ్యాత కవులు వ్రాసిన నవలలు, గ్రంథాలు క్లాసుకు తెచ్చి, అంద రికీ యిచ్చేవాడు. అత డారోజున "బాపూజీ జీవిత చరిత్ర" ను తీసుకొచ్చి, ఒక స్నేహితుని కిచ్చాడు. ఆ పీరియడ్ తీసుకునే మాష్టారికి నవ లలు, గ్రంథాలు చదవడం యిష్టం! ఆయన క్లాసుకు రాగానే ఒక కుర్రవాడు ఆ పుస్తకాన్ని మాష్టారికి చూపించాడు. అప్పు డాయన ఆ కుర్ర వాణ్ణి, 'ఈ పుస్తకం ఎవరిదిరా ?' అని ప్రశ్నిం చాడు. అప్పు డతడు, 'మన రాజుగాడిదండి' అని జవాబిచ్చాడు.

మా మాష్టారు "ఏ రాజుగాడిదరా' అని ప్రశ్నిం చారు. క్లాసులోవాళ్లమంతా గొల్లున నవ్వాము. ఆ పుస్తకం తెచ్చిన రాజు తెల్లబోయాడు.

వై. వెంకటేశ్వరరావు ( భీమవరం )

* * *

## అబ్బాయి ఎవరు?

### (రెండవ బహుమతి రు. 5 లు)

నేను సెకండ్‌ఫారం చదివే రోజుల్లో మా గ్రామం నుండి హైదరాబాద్‌లోఉన్న మా మామయ్యను చూచి రావడానికి వెళ్ళాను. మామామయ్య సనత్‌నగర్ కాలనిలో ఉంటున్నాడు. ఆ కాలని ఇండ్లు అన్ని ఒకే పద్ధతిలో నిర్మించి ఉన్నాయి. ఇంటి నెంబరు తెలిస్తే తప్ప ఇల్లు కనుగొనడం సాధ్యంకాదు. నేను ఎలాగో ఇల్లు చేరాను. మా అత్తయ్యగారు బాబూ అలా ఆడుకొనిరా, తర్వాత అన్నం వడ్డిస్తా నంది. నేను అలా ఆడుకొని వచ్చేసరికి 'అన్నం వడ్డించాను' అని వంటింట్లోంచి కేక విని తినడానికి ఉపక్రమించాను. ఇంతలో ఒక బుర్రమీసాలాయన వచ్చి, 'అబ్బాయి ఎవరే ?' అన్నాడు 'ఏది ? ఎక్కడ, ఎవరు ?' అంటూ వంటింట్లోంచి వచ్చిన ముసలావిడను చూచి ఆశ్చర్యపోయాను. జరిగిన సంఘటన విని వారు కడుపుబ్బ నవ్వారు. తర్వాత మా ఇంటికొచ్చి చెప్పితే మా మామ, అత్త, పగలబడి నవ్వి 'మరో సారి అలా పోకేం!' అని హెచ్చరించారు.

వి. రామరెడ్డి (గగ్గలపల్లి)

* * *

## అన్నయ్య జవాబు

### (రెండవ బహుమతి రు. 5 లు)

మేము (గత) శివరాత్రికి మా అమ్మమ్మ గారి వూరెళ్ళాము. అప్పటికే మా అన్నయ్య స్నేహితులతో కలిసి అక్కడకు వచ్చాడు. మేమంతా కలిసి దేవుడిని చూచి వచ్చాము. తెల్ల వారిం తరువాత మా అన్నయ్య మా అమ్మమ్మతో తగవు పెట్టుకోవడంవల్ల ప్రతి పనిలో చిరాకు కనబరుస్తున్నాడు. పొద్దున్నే మే మందరము బజా రుకు బయల్దేరాము. మా అమ్మమ్మ అన్నయ్యతో ఎక్కడికిరా వెళ్తున్నారు' అని అడిగింది. చిరాకులో ఉన్న అన్నయ్య ఏట్లోకి అని అన్నాడు.

ఐతే ఒక బిందెడు మంచినీళ్ళు తీసుకురా' అంది. (ఆ గ్రామానికి దగ్గరే ఏరుంది.) మా అన్నయ్య ధోరణి కనిపెట్టిన మేము ఘొల్లున నవ్వాం.

పి. వాగేశ్వర్రావు, (గొకివేపల్లి)

★

"అబ్బబ్బ! కాలికి కాస్త దెబ్బతగులితే — యిహ కాలమే తీరిపోయింది అన్నట్లుగా యెవరైనా ప్రవర్తిస్తారా మంజూ! ఏమిటా పిచ్చితనం! ఇంకో వారంరోజుల్లో యెప్పటిలా తిరుగుతావని డాక్టర్ చెప్పలేదూ?" దెబ్బ తగిలినకాలుకి కట్టిన కట్టుని పదేపదే చూసుకుంటూ— ఇహ కుంటిదా న్నయిపోతా నేమోనని బెంగపడుతున్న భార్యవంక చూస్తూ అన్నాడు శేఖర్. కిటికీదగ్గరగా ఉన్న మంచంమీద గోడకి చేరగిలవేసిన గుండ్రటి దిండుని ఆనుకుని కూర్చున్న మంజు మొహంలో మహారాజ్యాల్ని కోల్పోయిన మహారాణి తాలూకు దీనత్వం కన్పిస్తోంది.

"ఏం ఫర్వాలేదు. కత్తిపీటగాబట్టి కాస్త సెప్టిక్ అయింది. దానికంత భయం దేనికి?" మంజు కూర్చున్న మంచానికి ప్రక్కగా ఉన్న డ్రెస్సింగ్ టేబిల్ముందు నిలబడి అద్దంలో చూసుకుంటూ టై గట్టుకుంటూ అన్నాడు.

"మీ రలాగే అంటారు. మీకేం తెలుస్తుంది నా బాధ! ఈ పదిరోజులనుంచి కాలు క్రింద పెట్టకుండా ఈ మంచంమీద కూర్చుని నేను చూస్తున్న నరకం మీ కే కొంచెం అర్థం అయినా మీరలా అనరు. అయినా నేనేమైపోతే మీకేం? మీ క్లబ్లకి, మీటింగ్స్కి ఏం లోపం రావటం లేదుగా!" ఎర్రబడ్డ ముఖంతో, మొదుచుకున్న పెదవులతో భర్తవైపు చూడకుండానే అంది మంజు.

"అదుగో! నువ్వు వెళ్ళమంటేనేగా తయారవుతూంది నేను. సర్లె పోన్లే. నీకంత కష్టంగా ఉంటే అసలు వెళ్ళనేవెళ్ళను. ఏదో క్లబ్ వార్షికోత్సవం దగ్గరకు వస్తోందికాబట్టి దాని కమిటీసభ్యుల్లో ముఖ్యుణ్ణి కాబట్టి. లేకపోతే వెడ్తానా? పోన్లే...." కట్టుకుంటున్న టై మధ్యలో ఆపి విప్పేసి శేఖర్ వచ్చి మంజు ప్రక్కన కూర్చున్నాడు.

"ఏ మక్కర్లేదు. వెళ్ళండి. అయినా ఒక రోజా రెండురోజులా? మీరు వెళ్ళండి. మరీ ఎందుకో దిగులనిపిస్తోంది. మీరు ప్రక్కన ఉన్నంతవరకూ ఏం గుర్తురాదుగాని, మీరు కాస్త కనుమరుగైతే ఈ గాయం ఇంతింతయ్యి ఓ పెద్ద రాక్షసిలా నన్ను భయపెడ్తోంది. నువ్వు కుంటిదానివి సుమా! ఇంక జన్మలో నువ్వు మామూలుగా నడవలేవని వెక్కిరిస్తుంది. అదే—

# వెలిసిన విలువలు

## యద్దనపూడి సులోచనారాణి



**ఊహా ప్రపంచానికి అలవాటు పడిన మంజు, శేఖరం నుంచి ఏమి ఆశించింది ? ఆమె కోరిక ఎలా తీరింది?**

మీరు ప్రక్కనుంటే భయంవెయ్యదు. కొంచెం ధైర్యంగా ఉంటుంది. నేనెలాటి పరిస్థితుల్లో ఉన్నా, అందంగా ఉన్నా లేకపోయినా, ఆరోగ్యం పాడయినా, అంగవైకల్యం ఉన్నా నన్ను ప్రేమించి ఆదరించగల వ్యక్తి ఒకరు నాకున్నారు అనిపిస్తుంది. అంతే ! అందుకే ఎప్పుడూ మిమ్మల్ని ఎక్కడికీ వెళ్లనివ్వకుండా చెయ్యాలనిపించేది. అంతేకాని — లేకపోతే, ఇది వరకెప్పుడైనా నేను ఇలా చేశానా ? ఏరోజు నన్నా మొహం ముడుచుకున్నానా ? అది మీకు తెలియదా? మీరు గ్రహించలేరా అసలు విషయం ?" సిగ్గుతో బాధతో ఎర్రవడిన మొహాన్ని అరచేతుల్లో దాచుకొంటూ అంది మంజు.

క్షణంసేపు పరిశీలనగా భార్యవంక చూసిన శేఖరం మరికొంచం దగ్గరగా జరిగి మంజు తలమీద చెయివేసి జుట్టు నిమురుతూ "నాకు తెలుసు మంజూ ! ప్రతి చిన్నవిషయాన్ని విపరీతంగా తీసుకుని అనుభూతిపొందే నీ మనసు ఎలా గిలగిలలాడుతోందో నేను ఊహించుకోగలను. నన్ను వెళ్లద్దనటంలో నీ ఉద్దేశ్యం నా కర్థమవుతోంది. కాని యేంచెయ్యాలి చెప్పు. ఒక్క

(43-వ పేజీ చూడండి)



కె. అనసూయాదేవి

# జీతంలేని పరిచారిక

"షేవ్" చేసుకోవాలి సామాను తెచ్చిపెట్టవే అంటూ పీఠంవేసుకు కూర్చున్నారు అప్పటికే మూడుసార్లు కాఫీ, ఐదు సిగరెట్లు ఆరగించిన బావ. వారికి ఆఫీసుకు వెళ్లడానికి ఆలస్యమవుతుందేమోననే ఆవేదనతో సతమతమవుతూ హడావుడిగా వంటచేస్తున్న అక్క మనసులో ఏమనుకుందోగాని షేవ్ సామాను తెచ్చి పెట్టింది. షేవ్ చేసుకోవడం అయింది. ముఖం కడుక్కోడానికి వెనక దొడ్లోకి వెళ్లి సబ్బు తెమ్మని కేకలు. ముఖం కడుక్కుంటూనే తుడుచుకోడానికి తుండు తెమ్మని ఆజ్ఞ. అదయిన తరువాత "షేవ్" చేసుకున్న సామాను కడిగి దాచమని అధికారం. ఇన్ని పనులూ చేస్తూనే ఉంది అక్క. తిరిగి స్నానానికి వెళుతూ సబ్బు, తుండు తెమ్మన్నారు. అవి పట్టుకెళ్లి యివ్వబోతుంటే పాపం! అప్పుడు గుర్తుకొచ్చింది కాబోలు పళ్లు తోమలేదని బ్రష్, పేస్ట్ తెచ్చిపెట్టవే అన్నారు. అంటే ఆయనకు "బెడ్‌కాఫీ" యే మూడుసార్లన్నమాట, స్నానంచేసి వయ్యాప్పైన మందాన స్నో, పౌడరు ముఖానికి కోటా కొట్టుకొని భోజనంకు కూర్చున్నారు. ముద్ద సరిగా తినకుండానే కళ్లెర్రజేసి కస్సుమంటూ లేచారు. అసలు విషయం ఆవేళ కూరలో కొంచెం కారం ఎక్కువయిందట. దానికోసం ఆఫీసుకు వెళ్లేవరకు తిడుతూనే వున్నారు. తిరిగి ఆయన సాయంకాలం ఆఫీసు నుంచి రాగానే సబ్బు, తుండు పుచ్చుకుని అక్క సిద్ధంగా నిలబడింది.

ఉదయంనుంచి అక్కపరిస్థితిని చూస్తున్న నాకు నిజంగా కళ్లు చెమ్మగిల్లాయ్. సంఘంలో పుట్టి, సంఘంలో పెరిగి, సంఘంలో వ్యవహరిస్తూ ప్రాణంగా చూసుకోవలసిన పత్నిని బానిసగా చూచే వ్యక్తుల్ని యేమనాలో అర్థంకాదు. ప్రక్కప్రాణిని హింసపెట్టి తానను భవించేదొక సుఖంకాదు. అది సంపూర్ణ మానవత్వం గల హృదయంగూడ కాదేమో! ఇది యొక పురుషులకేగాదు స్త్రీలకుగూడ వర్తిస్తుంది. వివాహమైనతరువాత స్త్రీ భర్తనుంచి క్రొత్త సుఖాల్ని, క్రొత్త అనుభూతుల్ని పొందడానికి ఆశిస్తుందిగాని యిలాంటి బానిసత్వంగాదు. ఈ బానిసత్వం ముందే తెలిసియుంటే అసలు వివాహానికే ఒప్పుకోదేమోగూడ. అయితే అందరు మగవాళ్లు యిలా ఉండరు గనుక స్త్రీ కా ఉద్దేశ్యమే రాదు. భార్యచేత పనిచేయించగూడదని, కూర్చోబెట్టి సుఖపెట్టాలని నేను అనను. మగవారికంటె ఆడవాళ్లకు పని, శ్రమ యెక్కువ. ఉదయంనుంచి సాయంకాలం వరకు గృహకార్యాలలో మునిగితేలుతూన్న స్త్రీకి భర్తకు గూడ సేవచేయాలంటే ఆ ప్రాణి ఎంత కష్టపడుతుందో ఆలోచించండి. భార్య భర్తకు సేవ చేయడం తప్పని గూడ చెప్పను. కాని అది అనారోగ్యంగా ఉన్నప్పుడులాంటి కొన్ని అనివార్య పరిస్థితులలోగాని, నిత్యజీవితంలోను, స్వల్ప విషయాలలోను గాదు. నిజంగా కొందరిని చూస్తుంటే వాళ్ల జీవితాంతం ఇంతేనా ? విశ్రాంతికే వారు నోచుకోలేదా ? అనిపిస్తుంది. ఆమెకే నలుగురు పిల్లలుండి భర్తకు పరిచర్య చేయాలంటే యింకెలా ఉంటుందో ఊహించండి. భర్త నుంచి భార్య, భార్యనుంచి భర్త చేయూత తీసుకోవడం తప్పుగాదు. పెళ్లినాటి ప్రమాణాలలో అదీ యొకటి. కాని అది సంసార వీధిలో దుమ్ము గాలులు రేగినపుడే సమంజసమనిపిస్తుంది.

ఇంటికి దీపంలాంటివాడు పురుషుడు. తాను తెలివిగా వ్యవహరించుకుంటూ భార్యలోని లోపాల్ని సరిదిద్దుకోవాల్సిన బాధ్యత అతనిదే. ప్రతి విషయంలోను పతికి పరిచర్యచేయాలంటే ఆ వనిత మనసు ఎప్పుడూ బాధపడుతూ ఉంటుంది. ఆ పరిస్థితిలో తాను సుఖపడలేదు. భర్తకు పూర్తి సుఖాల్నివ్వలేదు. ఆ సంసారమే సుఖంగా ఉండదు. మహాత్ముడు చెప్పినట్లుగా యెవరిపనులు వారు చేసుకుపోతోంటే నిజంగా తనకు, ఇతరులకు గూడ యెంతో హాయిగా ఉంటుంది. స్త్రీలో అవలక్షణాలుంటే కొన్నాళ్లకు కొన్నాళ్లకయినా పురుషుడు సాధించవచ్చు. కాని పురుషునిలో సంస్కృతి, నాగరికత లేకపోతే స్త్రీ సాధించడం సాధ్యంగాదు. పరిచర్యలు చేసేపరిస్థితిలోనే భర్త అంటే ఒకవిధమైన అయిష్టత ఏర్పడుతుంది స్త్రీకి. భర్త అంటే ఒకవిధమయిన భయం గూడ ఏర్పడ్తుం కద్దు. అలాంటి పరిస్థితిలో వారిరువురికి (భర్తకూ, భార్యకూ) సుఖం ఉండదు. అవును మరి. ఎంత భర్త అయితేమాత్రం జీవితాంతం సేవచేయాలంటే ఏ వనితకు కష్టం అనిపించదు ?

సంసారానికే చాలీచాలని జీతంలో రోజుకు ఒక పెక్కెట్టు సిగరెట్లు, ఐదు లేక ఆరుసార్లు కాఫీ, రెండు, మూడు సార్లు స్నో, పౌడరుకోసం డబ్బు తగులబెట్టడం, ఇంట్లో భార్యను పనిమనిషిగా చూడడం, ఇలాంటి లక్షణాలు గల మగవాళ్లను ఏంచేయాలో, ఏమనాలో చెప్పండి. కేవలం పురుషులలోనే గాదు, స్త్రీలలోగూడ యెన్నో లోపాలుంటయ్. అవి సరిదిద్దుకోవలసిన "భర్త" తన లోపాల్ని ముందు దిద్దుకోవాలి. భార్యగూడా తనలా సుఖాన్నాశించే జీవేనని భార్య అంటే దాస్యం చేయడం కోసమే గాదని తనతో సహకరించి తన కష్టసుఖాల్లో భాగస్వామని గమనించి, పాలూ, నీరులా, చిలకా గోరింకల్లా అన్యోన్యంగా, రమ్యంగా కలిసిపోయేదే సరైన దాంపత్యమనిపించుకుంటుంది. వారి జీవితాలే ఆనందమయం. సుఖప్రదం. భార్య అంటే పరిచారిక అనే చులకనభావం లేకుండా తన జీవితతటాకంలో ముచ్చటగొలిపే కలువ అనే మృదుభావంగల పురుషుడే భార్యనుంచి పూర్తిసుఖాన్ని అనుభవించగలుగుతాడు. అతని భార్యను సుఖింపజేయగలుగుతాడు.

ఇలా వ్రాశానని అన్యథా భావించకుండా సోదరులంతా నన్ను మన్నిస్తూ నేను వ్రాసినదానిభావాన్ని గ్రహిస్తారని ఆశిస్తున్నాను.



ఏ హృదయంలో నాకు చోటీయవూ ? !

చిత్రకారుడు: పి. రంగనాథస్వామి (హైదరాబాదు)



# వనితా వాణి

## వంట ఇంటి ప్లాను

శ్రీమతి యశోదా దొరైస్వామిగారి "వంట యింటి ప్లాను" చదివినాను. వంటయింటిలో పూజా మందిరమునకు స్థానము లేకపోయినందుకు విచారిస్తున్నాను.

శాంత ( కాగజ్ నగర్ )

* * *

## స్త్రీలు-ఆర్థిక స్వాతంత్ర్యము

సి. కృష్ణకుమారిగారు వ్రాసిన (స్త్రీలు—ఆర్థికస్వాతంత్ర్యము) అన్న వ్యాసము చాలా బాగుంది. వారు వ్రాసినట్లు భర్త కష్టపడి చెమటోడ్చి సంపాదించి తీసుకునివచ్చే యింటి సామానులు అమ్మడము అన్నది సహించరానిది. కానీ భార్యకు (యింటి) ఖర్చులకు, పిల్లల ఖర్చులకు అడపా దడపా కొంత డబ్బు ఇవ్వాలి.

శ్రీమతి ఉ. నాగభూషణ్ ( విశాఖపట్నం )

* * *

"స్త్రీలు—ఆర్థిక స్వాతంత్ర్యము" అనే వ్యాసము చదివాను. మగవారు ఆడవారికి డబ్బు యిచ్చి ఇంటి బాధ్యత అంతా వదిలేస్తే, వారికి డబ్బు విలువ, బాధ్యత అర్థమవుతుంది. బాధ్యత తెలిసిన గృహిణి అనవసరంగా డబ్బు ఖర్చుపెట్టదు. ఈ సంగతి గ్రహించిన. మగవారికి ఏలాంటి చిక్కులు ఉండవు. ఇప్పుడు చాలమంది వారి పిల్లలకు పై ఖర్చులకని డబ్బు ఇస్తారు. అలా వారు ఇస్తూంటే జేబుల్లో డబ్బుగాని, డ్రాయర్లలో చిల్లరగాని మాయము అయ్యే అవకాశము ఉండదు. కనుక మగవారు ఆడవారి పరిస్థితులను, అవసరాలను గ్రహించి ప్రవర్తిస్తే హాయిగా, సుఖంగా ఉంటారు.

శ్రీమతి వసంతాప్రకాశ్ (ఒంగోలు)

* * *

కృష్ణకుమారిగారు వ్రాసిన స్త్రీలు — ఆర్థిక స్వాతంత్ర్యం అను వ్యాసము బాగుంది. పురుషులలో కొందరు తమ భార్యలకు ఆర్థికంగా యిబ్బంది కలిగించడం, వారు తప్పుదారులు త్రొక్కడం జరుగుతోంది. మాకు తెలిసినవారిలో ఒకామెకి చిరుతిళ్ళు తినడం అలవాటు. భర్త కొని యిచ్చేవాడే కాదు. ఆవిడేమో రోజా భర్తకి తెలీకుండా కోమటి దగ్గర పెసరట్లు వేయించుకుని తిని, కొన్ని రోజులకి మెడలోని గొలుసుని హరింపజేసికొంది. ఆ విషయం భర్తకి తెలియదు. ఆయనేమో భార్యను చాలా క్రమపద్ధతిలో పెడుతూన్నట్లు భావించుకొనేవాడు.

భర్తవద్దనుంచి డబ్బు రాబట్టలేని స్త్రీలు బియ్యాలు, పప్పులు అమ్ముతూండడం, తాము కొన్న చీరలు కొన్ని రోజులు కట్టుకుని పని మనుషులకి తక్కువ ధరకి అమ్మడం చూస్తూనే ఉన్నాము.

కృష్ణకుమారిగారి వ్యాసం కొంత కాకపోతే కొంతయిన పురుషులకి మెలకువ తెప్పించగలదని తద్వారా స్త్రీలకి అనుకూలించగలదని భావిస్తున్నాను.

వాడపల్లి పద్మ (విశాఖపట్నణం)

* * *

## గాజులు

మందరవు లలితగారు వ్రాసిన "గాజులు" వ్యాసము చాల బాగున్నది. వారు 'గాజులమ్మాగాజులు, కన్నెపిల్లల మోజులు' అను కార్తవరాయుని కథలోని పాటను వ్యాసానికి తగ్గట్టు బాగా సమర్థించి వ్రాసినారు. గాజులు తీసివేసి సన్యాసుల్లా తయారవుతారని లలితగారు వ్రాసిన మాట నిజమే. అట్లాంటి స్త్రీల ముఖాలు చూస్తుంటే నాకు చెడ్డకోప మొస్తుంది. గాజులు లేకుంటే ఎన్ని ఉన్నా ఆ స్త్రీ మొగరాయుడిలా ఉంటుంది. చేతికి ఒక్కొక్కగాజు వేసుకునేకన్నా ఎక్కువగా వేసుకుంటేనే చక్కగా ఉంటుందని నా అభిప్రాయము. ఎక్కువంటే డజన్లు డజన్లు కాదు సుమండీ ! ఐదు లేక ఆరు గాజులు వేసుకుంటే బాగుంటుంది. ఏ స్త్రీకైనా గాజులు వేసుకుంటే ఉండే అందము తీసేస్తే ఉండదు గదండీ లలితగారూ !

కుమారి పోతిరెడ్డి సులోచన (విడవలూరు)

మందరపు లలితగారు వ్రాసిన గాజులు వ్యాసం చాలా బాగుంది. గాజులను తీసి పారేసి సన్యాసుల్లా బోసిగా తయారయ్యే పడతులు నిజంగానే మోటుగా మగరాయళ్ళలా కనపడతారు. స్త్రీకి అందాన్నిచ్చే అనేక వస్తువుల్లో గాజులు చాల ముఖ్యమైనవి. అవి లేకపోతే చాల అసహ్యంగా ఉంటారు. అలాంటి ఏహ్యాభావం కలగాలనే దృష్టితోనే మన పూర్వీకులు వితంతువులకు గాజులు ఉండకుండా చేశారు. అస లంతెందుకు. చాల మంది ఆడపిల్లలు ఎన్. సి. సి. దుస్తులలో గాజులు లేకుండా ఉన్నప్పటికంటె, చీరా జాకెట్టు వేసుకొని, తగినన్ని గాజులు తొడుక్కుంటే ఎంతో ముచ్చటగా కనిపిస్తారు.

ఎస్. వి. రాణీమహేశ్వరి (అనంతపురం)

* * *

## సమిష్టి కుటుంబాలు

"సమిష్టి కుటుంబాలు" వ్యాసం బాగానే ఉంది. కుటుంబ మంతా సమిష్టిగా జీవించడం ఆనందదాయకమనీ, చాలా ఉత్తమమనీ ప్రారంభించిన శ్రీమతి ఆకుండివారు, వ్యాసం మధ్యలో వనితలను దుయ్యబట్టడం విచారకరమైన విషయం. సమిష్టి కుటుంబాలు వ్యష్టికుటుంబాలుగా మారడానికి స్త్రీలే కారణమని రచయిత్రి తమ అమూల్యాభిప్రాయాన్ని తెలియజేశారు.

అటు పాశ్చాత్య నాగరికతను పూర్తిగా అనుకరించలేక, ఇటు ప్రాచీన సంప్రదాయాలను పూర్తిగా వదలుకోనూ లేక పాశ్చాత్య ప్రాచీన నాగరికతల మధ్యగా త్రిశంకుస్వర్గంలా వ్రేలాడుతున్న నేటి భారతదేశపు సమిష్టి కుటుంబాల నుద్ధరించుటకు వనితలు వ్యాసాలు వ్రాయడం దేశమంతా గర్వించతగిన విషయం.

కాని ఒక్క విషయం ! వనితలు తమ రచనల్లో తోటి సోదరీమణులను దుయ్యబట్టడం ఏమంత మంచిపని కాదు. ఒక వ్యక్తి ఏరకంగానైనా తప్పటడుగు వేస్తుంటే అతన్ని సరిదిద్ది బాగుచేయాల్సిన బాధ్యత, కన్న తల్లిదండ్రులకే కాకుండా కట్టుకున్న భార్యకు కూడా ఉంటుంది. అదేవిధంగా ఒక సమిష్టి కుటుంబంలో తన భర్త అందరికంటె ఎక్కువ ఆదాయాన్ని తెచ్చి కుటుంబ ఖర్చులకోసం వినియోగిస్తుంటే, తన బిడ్డల భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని, భర్త వనుల కడ్డుపడి, ఆ సమిష్టి కుటుంబాన్ని వ్యష్టి కుటుంబంగా మార్చడంలో ఆ వనితకు ఏమి దోషం లేదంటాను .... ! రచయిత్రి నా అభిప్రాయాలతో ఏకీభవిస్తారని ఆశిస్తాను.....

ఎస్. ఎ. ఎస్. రాధ (రాజమండ్రి)★



శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునస్వామివారి ఆలయం

# శ్రీశైల ఆలయ ఉద్ధరణకు నిధివసూలు: భక్తులకు 'ఆంధ్రపత్రిక' విజ్ఞాపన

'శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే' అన్నారు. దర్శనమాత్రముననే మానవులకు మోక్షము ప్రసాదించునట్టి క్షేత్రము శ్రీశైలం. అట్టి క్షేత్రమును పునరుద్ధరించాలని నిశ్చయించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము గత ఏప్రిల్‌లో శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునస్వామి ఉద్ధరణ సంఘమును ఏర్పాటు చేశారు. ఈ సంఘమువారు జులై 7 వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య అధ్యక్షతను సమావేశమై, శ్రీశైల మహాక్షేత్ర జీర్ణోద్ధరణ నిధికి రు. 12 లక్షలు వసూలు చేయాలని నిశ్చయించి, ఉదారముగా విరాళాలు యివ్వవలసిందిగా ప్రజలకు, ప్రజాసంస్థలకు విజ్ఞప్తి చేశారు.

ఉద్ధరణసంఘం వారి అభ్యర్థనను పురస్కరించుకొని, ఉడుతాభక్తిని ఈ కార్యక్రమంలో పాల్గొనాలనే సంకల్పముతో విరాళాల వసూలు తోడ్పాటుకు, విరాళాలు ఇచ్చిన భక్తుల పేర్ల ప్రచురణకు 'ఆంధ్రపత్రిక' అంగీకరించింది.

కోరిన వెంటనే అంగీకరించినందుకు 'ఆంధ్రపత్రిక' సంపాదకులు శ్రీ శివలెంక శంభుప్రసాద్ గారిని అభినందిస్తూ, ఈనెల 7 వ తేదీన జరిగిన సమావేశంలో శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునుల ఉద్ధరణ సంఘంవారు తీర్మానించారు.

ఆంధ్రప్రదేశ్ పునరుజ్జీవనమునకు మూలపురుషులైన దేశోద్ధారకులు శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు శ్రీశైలంతో సహా అనేక దేవాలయాల పునరుద్ధరణకు కృషిచేసి ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి విజ్ఞప్తిని పురస్కరించుకొని ఉదారముగా విరాళాలు ఇచ్చి, పవిత్రము దేశోద్ధారకునకు ప్రియతమము అయిన ఈ కార్యక్రమమును జయప్రదం చేయవలసిన బాధ్యత ఆంధ్ర మహాజనులమీద ఉన్నది.

**[విరాళాలను "ఆంధ్రపత్రిక," 6-7 తంబుచెట్టి వీధి, జార్జిటౌన్, మద్రాసు—1 కి పంపవచ్చును.]**

పరమకరుణాసముద్రుడు నిత్యనిరంజనుడు నగు మహేశ్వరుడు, మహేంద్ర పర్వతములలోని శ్రీ వనప్రాంతములలోని శ్రీపర్వతశిఖరాగ్రదేశమున శ్రీ మల్లికార్జున లింగరూపియై సృష్టికి ఆదికాలమందే వెలసిఉన్నాడు. సర్వమంగళాలయయు సకల జగన్మాతయు నగు, ఆదిశక్తి శ్రీ భ్రమరాంబికా రూపమున అష్టాదశపీఠశక్తులలో నొక శక్తి అయి వెలసియున్నది.

శ్రీశైల మహాక్షేత్రమును పునరుద్ధరించుటకై అనంతభువన బ్రహ్మాండాధినేత యగు శ్రీ భ్రమరాంబా సహిత మల్లికార్జున మహాదేవుని ప్రేరణ



దేశోద్ధారకులు

వల్లనే మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారికిన్నీ, విశేషించి దేవాదాయ ధర్మాదాయ శాఖామాత్యులకును, ఆ శాఖ ప్రధానాధికారులకును ప్రత్యేక శ్రద్ధ కలిగినది. గట్టి రాజమార్గములు వేయించి రాకపోకల సౌకర్యమునకు బస్సులు నడిపింపబడుచున్నవి. అరణ్యమువలె పెరిగిపోయిఉన్న శ్రీ మల్లికార్జున దేవాలయ ప్రాకార గోపుర మంటపాదులు బాగుచేయించబడుచున్నవి. మంచినీటిని పాతాళగంగ నుండి యంత్రముల ద్వారా తోడి తెచ్చి పంపులద్వారా అందరికీ అందించుచున్నారు. యాత్రికుల వసతి సౌకర్యముల నిమిత్తం లక్షల వ్యయముతో ఉదారచిత్తులగు దాతల సహాయ సహకారముతో, అనేక సత్రములు, వసతి గదులు మొదలైనవి నిర్మించి ఉన్నారు. ఇంకనూ నిర్మించుచున్నారు. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునులకు సుప్రభాత మారంభించి, నిత్యపూజావిధులను, నిత్యపూజాపద్ధతిలో జరిపించుచున్నారు. అనేక విశేషోత్సవములను ప్రోత్సహించి చేయించుచున్నారు. పుష్పవనము, బిల్వవనము, కదళీవనము వేయించి పోషించుచున్నారు. భక్తుల సహాయంతో గోసంరక్షణశాలను ప్రారంభించి అభివృద్ధి నొందించుచున్నారు. ఇట్టి మహనీయ కార్యముల నిర్వహణకై సుమారు రు. 12 లక్షలు వ్యయమగునని అంచనా వేయబడి ఉన్నది. భగవత్కారుణ్యప్రేరితులైన భక్తమహాజనులను, ఉదారచిత్తులు నగు భారత ప్రజానీక మన్నివిధముల తమ తమ యథాశక్తి కానుక లర్పించియు, ఇతరులచేత ఇప్పించియు ఈ ఘన పుణ్యకార్యమును సాంతము నెరవేర్పించి, పరమేశ్వరుని అనుగ్రహ ప్రసాదములు పొందవలసిందిగా కోరుచున్నాము.

★



శ్రీ భ్రమరాంబిక



**మందరపు లలిత:**

# చామంతి

సువర్ణకాంతులీనే చామంతి నోరార చెప్పుకో దగ్గ బహు చక్కని పువ్వు. ఆ మొక్కవోని సత్యాన్ని ఎల్లరు ఒప్పుకు తీరాల్సిందే. పసుపుపచ్చని రేకులతో చామంతి మిసమిసలాడుతూ ఉంటుంది. పసగల పచ్చని చామంతిని మెచ్చనివారుంటారా?

చామంతిలో పలురకా లున్నాయి. ముద్దచామంతి, రేకచామంతి, దమ్మిడీ చామంతి, గడ్డి చామంతి— ఎందులోనన్నా అందం హుందాగా దోబూచులాడుతుంది. ముద్దచామంతిలో రేకులన్నీ దుబ్బుగా చేరి ముద్దులొలుకుతూ ఉంటాయి. రేకచామంతిలో రేకలన్నీ విడి విడిగా, పలచగా విరబోసివుంటాయి. దమ్మిడీచామంతి దమ్మిడీ అంత ప్రమాణంలో ముద్దుగా చూస్తూ చూపరులను ముగ్ధుల్ని చేస్తుంది. చామంతి మధ్యలో గుండ్రంగా పరుచుకునివుండే పుప్పొడి అందం చెప్పతరంకాదు.

మేలిమికాంతులతో మిలమిల మెరిసే పచ్చని చామంతితోపాటు పాలతరగల కాంతితో నిర్మలంగా ప్రకాశించే తెల్ల చామంతిని కూడా తరచు చూస్తూనే ఉంటాం. తెల్లనిచామంతిమధ్య పచ్చని పుప్పొడి చూడముచ్చటగానే వుంటుంది. తెల్ల చామంతిలో దమ్మిడీచామంతికూడా వుంది.

గడ్డిచామంతిలో అరచేతులంత పూలుకూడా వుంటాయి. ఇందులో చామంతిరేకలు గడ్డిపరకల్లా విడివిగా వుంటాయి.

చామంతిపై ఇంతులకు తగని భ్రాంతి. చామంతి పూలు దండగా గుచ్చుకుని పూబోడులు జడలో ముడుచుకుంటారు. చామంతులతో పూల జడ కట్టుకుని శిరోజాలను సింగారించుకుంటారు. వాటిని వరసాగ్గా జడపై పెట్టి టాకాలుపోస్తే పచ్చగా మెరుస్తూ నేత్రపర్వం చేస్తాయి. కేవలం తెల్ల చామంతులతోకూడా జడ కుట్టుకోవచ్చుగాని ఆ అందం రాదు. ఆ పూలజడపైన తలలో చామంతి దండ పెట్టుకుంటే సొగసుగా ఉంటుంది. చామంతి పూలను అటొకటి, ఇటొకటివేసి దారంతో మాల కట్టుకుంటారు సాధారణంగా. కాడలు తీసేసి పూలన్నీ ముద్దగా గుచ్చుకున్నా బాగానే వుంటుంది.

చామంతిని పెరట్లో శ్రద్ధతీసుకుని పెంచవచ్చు. పెరట్లో స్థలం లేకపోతే, చామంతిని గోలాల్లో కూడా పెంచుకోవచ్చు. రోజూ నీళ్ళు పోస్తూ, తగిన ఎరువులు వేస్తూవుంటే చామంతి విరగ కాస్తుంది. చామంతిరేకులు గులాబీరేకుల్లా ముట్టుకుంటే రాలిపోవు. చామంతి ఎన్నోరోజులకుగాని పసి వాడదు. చెట్టున కోయకుండా వదిలేస్తే చామంతి వారం, పదిరోజులవరకు వన్నెతరగకుండా ప్రకాశిస్తూ ఉంటుంది.

గడ్డిచామంతి పెద్దదిగా వుంటుంది కాబట్టి తలలో పెట్టుకోవటంకన్నా చూసి ఆనందించటానికే బాగుంటుంది. ఫ్లవర్‌వేజుల్లో ఈ చామంతి అందాలొలకబోస్తుంది.

మాటా మంతీ రాకపోయినా చామంతి బంగారు కాంతులీనుతూ వనితలను చెంతకురమ్మని పిలుస్తూనే వుంటుంది. చామంతి అందానికి ముగ్ధలైన స్త్రీలు వాలుజడలో, సిగమధ్యలో బంగారుచామంతి బిళ్ళను ధరిస్తారు. వెండికంచాలమధ్య బంగారంతో చిన్న చామంతిపూలను వేయించుకుంటారు.

వివాహాదిశుభకార్యాలలో, ఉత్సవాలలో చామంతి దండలను విరివిగా వాడుకచేస్తారు. సభల్లో ఉపన్యాసకులకు, చిత్రపటాలకు చామంతిదండలు వేసి సన్మానించటం వున్నదే. పందిళ్ళకు పచ్చని చామంతితోరణాలు చక్కని అలంకారాలు. చామంతి పూలతో దేవుడిని పూజించవచ్చు.

అందానికి కొదవలేని చామంతికి పరిమళం లేకపోవటం చింతించదగ్గ విషయమే. అయినప్పటికీ, పసిడికి తావిలేనంతమాత్రాన పనికిరానిదవుతుందా? ★

ఎప్పుడూ ఇంతే—91 శంకర్






# జాతిపరిపూర్ణతకు అవరోధంగా ఉన్న ధోరణులు

పి. వి. నరసింహారావు

బ్రిటిష్‌వారి పాలనలో జలియన్‌వాలాబాగ్ దురంతం తర్వాత భారత జాతీయ నాయకుల ఆలోచనల తీరు మారింది. కాంగ్రెసుపార్టీ పాలనలో ఇప్పుడు జబల్‌పూర్ కొట్లాటల పిమ్మట కాంగ్రెసు అగ్ర నాయకుల మనస్తత్వంలో మార్పువచ్చింది. జాతి పరిపూర్ణసిద్ధికి భంగం కలిగించే శక్తులు దేశంలో విజృంభించకుండా తీసుకొనవలసిన చర్యలను అఖిలభారత కాంగ్రెసుసంఘం దుర్గాపూర్ సమావేశంలో సూచించింది.

ఈ చర్యలలో ప్రధానమైనవి—కుల మత తగాదాల సందర్భంలో ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టాన్ని హెచ్చుగా వినియోగించడం. సాముదాయక జరిమానాల విధింపు. భారత శిక్షాస్మృతిని సవరించి ఇంకా కట్టుదిట్టాలు చేయడం. అల్ప సంఖ్యాక వర్గాలకు ఇంకా హెచ్చు అవకాశాల కల్పన, వసతులను పెంచడం, కులమత పాఠశాలల రద్దు, మత సామరస్యాన్ని, సమైక్యతను బోధించే పాఠ్యాంశాలు చెప్పించడం వగైరాలన్నీ వున్నాయి.

ఈ సూచనలను పరిశీలించినా, పైనిమీద దుర్గాపూర్ సమావేశంలో కాంగ్రెసునాయకులు చేసిన ప్రసంగాలు పరిశీలించినా కాంగ్రెసు పార్టీ మనస్తత్వం ఎంతగా పరిమితమైనదీ, వారి ఆలోచనలను ఎలా పరిమితం చేస్తున్నదీ అర్థమవుతున్నది. కేవలం రాజదండాన్ని, అధికార బలాన్ని వినియోగించి జాతి పరిపూర్ణస్థితిని సాధించాలనే వింత మనస్తత్వం వ్యక్తమవుతున్నది. ఆ రాజదండ ప్రయోగంలోనే, ఆ అధికార బల వినియోగంలోనే పార్టీ ప్రయోజనాలు, నాయకుల స్వార్థాలు, పదవుల పంపిణీ వివాదాలు జాతిని ఎలా చీలుస్తున్నదీ అర్థం చేసుకొనలేకపోతున్నారనేది కానవస్తున్నది.

జాతి, దేశం, ప్రభుత్వం వగైరా విశాల దృక్పథంనుంచి కాక, కేవలం కాంగ్రెసు పార్టీ పరిమిత దృక్పథం దృష్ట్యా చూచినా స్వాతంత్ర్యోద్యమం ద్వారా భారతజాతికి రాజకీయ పరిపూర్ణ స్థితిని సాధించినది కాంగ్రెసుపార్టీ అనే మాట నిజం. ఆ కాంగ్రెసు పార్టీ ద్వారానే ఆర్థిక పరిపూర్ణత సమకూరవలసివున్నమాట కూడా నిజమే. అందుకు అది గత పదమూడేళ్ళుగా పంచవర్ష ప్రణాళికల ద్వారా కృషి చేస్తున్నది. రక రకాలుగా ప్రాజెక్టులను నిర్మిస్తున్నది. పరిశ్రమలను నెలకొల్పుతున్నది. దేశంలో రహదారి, రవాణా సౌకర్యాలు అభివృద్ధి చెందుతున్నాయి. గ్రామీణప్రాంతాలకు విరివిగా విద్యుచ్ఛక్తి అందుబాటు అవుతున్నది. రక రకాలుగా కొత్త వస్తువులు దేశంలోనే స్వశక్తితో ఉత్పత్తి చేసుకుంటున్నాం. ఇంతవరకూ బాగానే వుంది. కాని సాంఘికంగా మనలోను, మన మధ్య ఎలాంటి భావాలు నలుగుతున్నాయి. మన ఆలోచనల తీరు ఎలావుంటున్నది అని ఆలోచిస్తే జాతి పరిపూర్ణస్థితికి అనువైన ధోరణులు కనుచూపుమేర దూరంలో ఎక్కడా కానరావడంలేదు. నాయకుల యోచనలకు, దేశంలోనిజస్థితికి పొంతనం కుదరడంలేదు.

ఒకజాతిచరిత్రలో కేవలం పదేళ్ళు గడవడం పెద్ద విశేషం కాకపోవచ్చు. ఒక దేశ రాజ్యాంగం పదేళ్ళు అమలు జరగడం దాని పరిపూర్ణతకు ప్రమాణం కాకపోవచ్చు. కాని ఈ పదేళ్ళలోనే పెక్కు రకాలుగా భావ వ్యాకులతకు ఆదేశ ప్రజలు లోనుకావడమనేది నిజంగా గమనార్హం.

ఈ భావ వ్యాకులత కూడా సుస్థిర ప్రభుతకు, దేశ భద్రతకు సంబంధించినదైతే అందుకు ఆశ్చర్యపడవలసిన అవసరంలేదు. కొత్తగా స్వాతంత్ర్యాన్ని పొందిన దేశానికి ఇలాంటి బాల్యారిష్టాలు సహజం. కాని ఈ భావ వ్యాకులత, జాతి పరిపూర్ణతకు, జాతి సమైక్యతకు, పౌర జీవితానికి వ్యక్తి వికాసానికి సంబంధించినదైనప్పుడు, ఒందుకు ఆందోళన చెందక తప్పదు. ఆ సంగతులు నిష్పాక్షికంగా ఆలోచించుకొనక తప్పదు.

అయితే ఈ ఆలోచనలు ఈనాడు ఆ యా పరిస్థితుల ప్రభావానికి, పార్టీల ప్రయోజనాలకు పాక్షిక స్వలాభాలకు పరిమితమవుతున్నవి. జబల్‌పూర్‌లో కొట్లాటలు జరిగితే హిందూ ముస్లిం సమస్య ముందుకు వస్తున్నది. ఒరిస్సాలో కాంగ్రెసు విజయం దేశంలో పార్టీనిరంకుశత్వ స్థాపనకు చిహ్నమంటున్నారు. ఒక కులం ప్రతినిధి మంత్రి కాకపోతే అది ప్రజాస్వామ్యమే కాదనిపిస్తున్నారు. ఇలా ఈ విశాల దేశంలో ఏ మూల ఏ చిన్న సంఘటన, సంఘర్షణ జరిగినా, దేశం నడక తల్లక్రిందులుగా మారుతున్నదనే విమర్శలు [illegible] న్నవి. అసలు సమస్యలను, సంగతులను కప్పిపెడుతున్నవి.

స్థూలంగా ఆలోచిస్తే, గత పన్నెండు, పదమూడేళ్ళలోను మనదేశంలో అయిదు రకాల ధోరణులు కానవచ్చాయి. ఆ యా పరిస్థితులనుబట్టి ఈ ధోరణులకు తాత్కాలిక ప్రాధాన్యం, వానిని గురించి, ప్రచారం జోరుగా జరుగుతూ వచ్చింది.

మొదటిది. దేశంలో హిందూ, ముస్లిం అనే భేదం లేదంటూ ప్రచారం. చివరకు ఆ భేదం కలదంటూ దేశ విభజనకు అంగీకరించడం. గత పన్నెండేళ్ళలోను సగకాలం దేశ విభజన, అందుండి ఉద్భవించిన హిందూ ముస్లిం సమస్యలతో సతమతం కావడానికి సరిపోయింది. ఈ సందర్భంలోనే ముస్లింలపట్ల మొగ్గు చూపాలి—మొగ్గు చూపరాదనే వాదనలు జరిగాయి. ఇప్పుడే హిందూ తత్వమనేది హిందూ మహాసభ, జనసంఘం, రామరాజ్య పరిషత్తువంటి పార్టీల రూపం దాల్చింది. పాలక పక్షంగావున్న కాంగ్రెసు ఎంతగా ముస్లింలను ఆకర్షించడానికి ప్రయత్నించినా, చివరకు జాతీయ ముస్లింలనేవారు ఈనాడు విడిగా సమావేశమై తమకు పూర్తి న్యాయం జరగటం లేదన్న విమర్శలు చేస్తున్నారు.

రెండవది. జాతీయ, దేశీయ భాషా వివాదం. ఇందులో రెండువిభాగాలు వున్నాయి. దేశానికొక జాతీయభాష కావాలి. అందుకు అర్హత

(41-వ పేజీ చూడండి)



న్యూఢిల్లీలో జరిగిన భావసమైక్యతా సంఘసమావేశంలో ప్రసంగిస్తున్న కేంద్రవిద్యామంత్రి డా॥ కె. ఎల్. శ్రీమాలి.

విజయావారి 'జగదేకవీరుని కథలో' ఒక మనోహర నాట్యసన్నివేశం.

# సంక్షిప్త వార్తలు

## భారత్‌లో వర్ణచిత్రాల ప్రాసెసింగ్

భారతదేశంలో తయారయ్యే వర్ణచిత్రాలకు దేశీయంగా ప్రాసెసింగ్ సదుపాయం ఇకనుంచి లభించబోతోంది. ఈ ప్రాసెసింగ్ లేబరేటరీ స్థాపనకు నాందీగా రామనార్ట్ పరిశోధనాలయం (బొంబాయి) వారు లండన్ టెక్నికలర్ సంస్థ వారి సహకారంతో నెగిటివ్ రష్ ప్రింటులకు కావలసిన పరికరాలు సమకూర్చుకుంటున్నారు.

ఈ రామనార్ట్ పరిశోధనాలయం తాలూకు వ్యక్తి శ్రీ రామ్ చటోపాధ్యాయ నాలుగున్నర మాసాల పాటు లండన్‌లో ఉండి, పై విషయంపై లండన్ టెక్నికలర్ లిమిటెడ్ వారితో చర్చలు జరిపి వచ్చారు. శ్రీ చటోపాధ్యాయ కేంద్రవాణిజ్య పరిశ్రమల మంత్రి శ్రీ మనూభాయ్‌షాను కూడా కలుసుకొని చర్చించారట. 1963 మధ్యకాలం నాటికి పూర్తిగా కలర్ ప్రింటులు విడుదల చేసేటట్లుగా పని కొనసాగించుకోవా లనుకుంటున్నారట.

లండన్ టెక్నికలర్ లిమిటెడ్ జనరల్ మేనేజరు శ్రీ ఆల్బర్ట్ అలెన్ ఆగస్టులో భారతదేశం వచ్చి వర్ణచిత్రాల ప్రాసెసింగు శాలను ఏర్పాటు చేసే విషయం సంప్రదింపులు జరుపుతారట.

## బర్సాత్-కిరాత్ నిర్మాత అరెస్టు

సుప్రసిద్ధ హిందీచిత్రం బర్సాత్-కిరాత్ నిర్మాత శ్రీ ఆర్. చంద్రను జూన్ 27 వ తేదీన లైమింగ్‌టన్ రోడ్ పోలీసులు తనదగ్గర్నుంచి దగాగా రు. 100,000 (రొక్కం, నగదు) తీసుకున్నాడని శ్రీమతి గీతా రాజ్యలక్ష్మీదేవిచేసిన ఫిర్యాదుపై అరస్టుచేశారు. చంద్రాను శ్రీ ఓంప్రకాశ్ 10 వేల రూపాయల జామీనుపై విడుదలచేయించారు. విచారణ జులై 28 వ తేదీన తిరిగి ప్రారంభం కాగలదని తెలుస్తోంది.

## గ్రిగరీ ఛుక్రాయికి లెనిన్ బహుమతి

సోవియెట్ నిర్మాత గ్రిగరీ ఛుక్రాయ్‌కి 'బాలడ్ ఆఫ్ ఎ సోల్జర్' అన్న చిత్ర నిర్మాణానికిగాను లెనిన్ బహుమతిని యిచ్చారు. ఈ బహుమతి ప్రదా



"జగదేకవీరుని కథలో" కనులకువాలి.

వోత్సవం మాస్కోలోని మాస్ ఫిల్మ్ స్టూడియోలో జరిగింది.

## నితిన్ బోస్ చిత్రాని పెట్టుబడి

నితిన్ బోస్ దర్శకత్వాన అమార్ ఫిలింస్ వారు నిర్మించబోయే చిత్రానికి చలనచిత్ర ఆర్థికసంస్థ డైరెక్టర్ల బోర్డు మూడు లక్షల రూపాయలు అప్పుగా యివ్వటానికి నిశ్చయించింది.

## ట్రోజన్ యుద్ధంపై చిత్రం

ట్రోజనుల యుద్ధాన్ని ఆధారంగా యూరోపా సినిమటోగ్రాఫిక్ వారి 'లాగ్యుయెర్రాడి ట్రోరియా' (ది ట్రోజన్‌వార్) చిత్రనిర్మాణం శరవేగంతో సాగుతోంది. ఈ చిత్రంలో స్టెవిరీవెస్, జాన్‌జారివెూర్, లిడాఅల్ఫ్రేక్‌సీ, ప్రభృతులు నటిస్తున్నారు.

## బాలల చిత్రంపై వినోదపు పన్ను రద్దు

బాలలకోసం తీసే చిత్రాల ప్రదర్శనలపై వినోదపు పన్నును తీసివేస్తూ పంజాబ్ రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వు చేసింది.

## జపానీస్ చిత్రానికి సెల్జనిక్ బహుమతి

జపానీ చిత్రం "ఇకిరు" ను 1960 లో తయారైన ఉత్తమ చిత్రంగా బెర్లిన్ అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో తీర్మానించి, ఆ చిత్రానికి సెల్జ్‌నిక్ బంగారు హస్త బహుమతిని ఇచ్చారు.

స్వీడిష్ చిత్రనిర్మాత ఇంగ్‌మర్ బెర్గ్‌మన్‌కు ఒక బంగారు బహుమతి, ఫ్రాన్సుకు మూడు రజిత బహుమతులు లభించాయి.

## బెర్లిన్‌లో 'అనూరాధ'పట అసంతృప్తి

బెర్లిన్ అంతర్జాతీయ చలన చిత్రోత్సవానికి భారతదేశం నుంచి పంపిన చిత్రం 'అనూరాధ' ప్రేక్షకులను సంతృప్తిపరచలేక పోవటమే గాక తీవ్ర నిరుత్సాహానికి ఘాటు విమర్శలకు గురైంది.

ఒక జర్మన్ చలనచిత్ర విమర్శకులు ఈ చిత్రాన్ని విమర్శిస్తూ, బహుమతి అంటూ ఇవ్వాల్సి వస్తే అది దో అంకే బారాహాత్ (శాంతారాం చిత్రం) కే ఇవ్వాలన్నారు. "భారత చలనచిత్రాల పట్ల ప్రజలకుండే మోజును అనూరాధ చిత్రం నాశనం చేసింది." అని కూడా ఆయన అన్నారు.

ఒక డేనిష్ డిస్ట్రిబ్యూటరు అనూరాధ చిత్రాన్ని "భారతదేశం నుంచి దిగుమతైన నిరుత్సాహమూర్తి" గా అభివర్ణించారు.

## జర్మనుకథపై భారతీయ చిత్రం

జర్మను భాషలోని ఒక కథ నాధారంగా, దర్శక, నిర్మాత బి. ఆర్. చోప్రా 'గుమ్రా' చిత్రం నిర్మిస్తున్నారు.

తప్పుదోవ పట్టిన ఒక స్త్రీ కుటుంబం బాధలు ఇతివృత్తంగా ఉన్న ఈ కథకు శ్రీ చోప్రా దర్శకత్వం వహించి నిర్మిస్తారు. అశోక్ కుమార్, నానాఫల్సికర్ ప్రభృతులు పాల్గొంటారు.

(48-వ పేజీ చూడండి)



జైరాప్ ప్రొడక్షన్సువారి చిత్రంలో రేలంగి.



'జగదేకవీరుని కథలో' గిరిజ.



యం. ఏ. యం మూవీస్‌వారి "కొరడావీరుడు"లో ఒక దృశ్యం.



---

## జరిగిన కథ

పోలయ్యంటే ఆ ఊళ్ళో చాలా మందికి అభిమానం, గౌరవం. కొంత మందికి అతనిపైన అయిష్టం కలగడానికి కూడా కారణం లేకపోలేదు. నరసింహప్ప పోలయ్యను తన పక్షంలో చేర్పించటానికి ప్రయత్నం చేస్తూ ఉంటాడు. కాని పోలయ్య రాజారావుని తప్ప మరెవ్వరినీ లెక్క చెయ్యడు.

---

రాజారావు దృష్టి మళ్లీ డొంకవైపు పడింది. అల్లంత దూరాన్నుంచి పోలాయి వస్తున్నట్టు కనిపించింది.

"దండాలు బాబూ" అంటూ పోలాయి వచ్చి చేతులు జోడించాడు.

"కూర్చో పోలయ్యా—ఏమిటి విశేషాలు" అన్నాడు రాజారావు.

"పెద్ద దొరవారు ముందు ముందుగానే జాగ్రత్త పడుతున్నారు బాబు! నాకు రెండెకరాల పొలమిచ్చి కొనేద్దా మనుకుంటున్నాను నన్ను."

రాజారావు నవ్వి వూరుకున్నాడు.

"నాకేదో నచ్చచెప్పాలని మునసబుగారు సాయంత్రం ఇంటికి రమన్నారు."

"వెళ్లిరాకపోయావా" అన్నాడు రాజారావు.

"ఎందు కెళ్లడం—ఆయన చెప్పేది మనకు తెలియకపోతేగా" నవ్వుతూ అన్నాడు పోలాయి.

"వెళ్లినంతమాత్రాన నష్టమేముంది పోలయ్యా వాళ్ల విషయాలు ఇంకా మన కేమైనా తెలుస్తాయేమో!" సాలోచనగా అన్నాడు రాజారావు.

"ఏదైనా చెప్తే నమ్మేట్టుగుండాలి గదండి. ఇన్నేళ్లనుంచి లేంది ఇవ్వాళ్ల నరసింహప్ప దొరవారికి ప్రత్యేకమైన అభిమానం పుట్టిందట నామీద. రెండెకరాలు ఎర జూపితే ఈ పోలాయి లొంగిపోతా డనుకున్నారు, ఆ మునసబు దొరగారున్ను.'

"నీకు యిష్టంలేని పని చేయకు పోలయ్యా! మునసబు ఇంటికి పోనందువల్ల మనకు వచ్చే నష్టమేమీ లేదు. డబ్బున్నవాడు ప్రతి వస్తువునూ కొన్నట్టే మనుష్యులనీ కొనేస్తున్నాడు. దేశంలో ఏర్పడ్డ ఆర్థిక సంక్షోభంవల్ల జీవన వ్యయం పెరిగిపోయి, ఆదాయం తక్కువై పోవడంవల్ల పేద ప్రజలు ఉక్కిరిబిక్కిరై పోతున్నారు. ధనవంతులు వాళ్లకు డబ్బు ఎర చూపి తమ పబ్బం గడుపుకుంటున్నారు." 'మధ్యలో పోలాయి ఏదో చెప్పబోవడంవల్ల రాజారావు ఆగిపోయాడు.

పేదవాళ్లంటే డబ్బుకు లొంగిపోయారనుకోండి. వందలకు వందలు సంపాదించుకొనేవారు కూడా ధనవంతులకు లొంగిపోతున్నారుగా" అన్నాడు పోలాయి.

"నీతి వదలినప్పుడు వందలు సంపాదించేవాడూ ఒకటేక, ఏభై రూపాయలు తెచ్చుకొనేవాడూ ఒకటే పోలయ్యా !"

"చదువు రానివాడు తెలియక నీతితప్పా డనుకుందాం బాబూ ! చదువుకున్నవాళ్లు అన్నీ తెలిసినవాళ్లే ఇట్లా నీతి తప్పితే ఎట్లా ?"

"నీతిగా ఉండటానికి చదువు అక్కరలేదు. పోలయ్యా ! ఇది మంచి, ఇది చెడు, ఇది నీతి, అది అవినీతి అని మనస్సే చెబుతుంది. అంతెందుకు ఆరోజు నీవు చలమయ్యదొర మీదకు క్రెందుకు విసిరావు ? అప్పటికి నీవు ఏం చదువుకున్నావని ఆయన చేసేపని అవినీతి అని ఎలా తెలుసుకున్నావు ?"

"మీరు చెప్పింది నిజమే బాబూ ! మరి వీళ్లల్లో ఇంక మార్పు రాదంటారా ?"

"మార్పు రావడం సహజమే కాని పోలయ్యా—దానికి చాలాకాలం పడుతుంది. ఈ మార్పు పెద్దవాడి దగ్గరనుంచి చిన్నవాడిదాకా కలగాలి. ప్రతివాడూ ఆత్మపరిశీలన చేసుకోవాలి. తనూ ఒక మనిషిననీ, తనకూ వ్యక్తిత్వం ఉందనీ, ఆ వ్యక్తిత్వాన్ని నిలుపుకోడానికి పూనుకోవాలి. తాను చేస్తున్నపని ఎవరినో ఉద్ధరించేందుకు అనుకోకుండా తన విధ్యుక్తధర్మంగా భావించాలి. అప్పుడుగాని దేశం బాగుపడదు."

పోలాయి ఏదో ఆలోచిస్తున్నాడు. చుట్టూ చీకట్లు విరిశాయి. ఆ చీకట్లో కూడా మునేరు నిర్మలంగా ప్రవహిస్తున్నది. పొలాలలోంచి, తోటల్లోంచి 'గీ' 'గూ' అని ఏవో పురుగుల స్వరాలు వినవస్తున్నాయి.

"ఏమిటి పోలయ్యా ఆలోచిస్తున్నావు" అని ప్రశ్నించాడు రాజారావు.

"ఏంలేదు బాబూ, నా అదృష్టాన్ని తలచుకుంటున్నా. మీరే ఈ వూరికి రాకపోతే నాగతేం కాను ?" అన్నాడు పోలాయి.

"నేను నిమిత్తమాత్రుణ్ణి పోలయ్యా ! అయినా నేను నీకు చేసిందేముంది ?" నవ్వుతూ అన్నాడు రాజారావు.

"సంతకం చేయటం చేతకానివానిచేత పెద్ద పెద్ద పుస్తకాలు చదివిస్తున్నారా ? నాకు తెలియని ఎన్నో విషయాలు తెలియజేస్తున్నారా ? ఇంకేం చేయాలి బాబూ! మీ ఋణం ఎట్లా తీర్చుకోగలను !"

"నిన్ను చూసిన వేళా విశేషం అటువంటిది పోలయ్యా ! నీవు బుద్ధిమంతుడివి. పట్టుదల గలవాడివి. సీతన్న చూడూ నీతోపాటే చదువు మొదలుపెట్టినా ఎంత వెనకపడ్డాడో ! ఈ మూడు నెలలూ నీవు కష్టపడి చదివావంటే ఒక ఒడ్డున చేరినవాడ వవుతావు. ఇంకా నేను నిర్వర్తించవలసిన విధ్యుక్తధర్మం చాలా ఉంది పోలయ్యా !"

"ఏమిటి బాబది ?"

"ముందు ముందు నీకే తెలుస్తుంది. మొదట నీ పరీక్ష అయితేకాని .... ఇక లే పోదాం" అంటూ రాజారావు లేచాడు.

పోలాయి అతణ్ణి అనుసరించాడు.

ఇసుకపర్రలు దాటి ఇద్దరూ డొంకలోంచి నడుస్తున్నారు.

"ఇందిరమ్మగారు రేపు మిమ్మల్ని ఒకసారి రమ్మని చెప్పమన్నారు" అన్నాడు పోలాయి.

"ఆయన వద్దన్న తరువాత నేను మళ్లీ నరసింహప్పగారింటికి ఎలా వెళ్లను ?"

"మిమ్మల్ని ఇంటికి రావద్దనలేదుగా దొరవారు. అమ్మాయిగారికి చదువు చెప్పవద్దన్నారు. పొద్దున నేను దొరవారితో మాట్లాడి వస్తుంటే ఇందిరమ్మగారు పిలిచి పంతులు గారిని రమ్మని మరీ మరీ చెప్పింది" అన్నాడు పోలాయి.

రాజారావు సమాధానమేమీ చెప్పకుండా నడుస్తున్నాడు.

---

ఒక విందుకు చాలామంది వచ్చారు. అప్పుడు విందు సందర్భంలో ఏర్పడిన పాట కచేరీ విని ఒకడు తన స్నేహితునితో "ఈమెపాట గాడిద అరచినట్లుంది, పేరేమిటో" అని అన్నాడు. దానికి స్నేహితుడు "ఆమె నాభార్యనండి!" అన్నాడు. అదివిని "ఓం! అహాం! స్వరం బాగానే వుంది. ఆపాట ఎవరూ ఇంత కంటె బాగా పాడలేరు. ఆపాట సరిగా లేందే పాడటము ఎలా వీలవుతుంది. ఇంతకీ పాట రాసిందెవరో" అన్నాడు. రెండవ మనిషి "నేనేనండి" అన్నాడు. మొదటివాడు మరి మాట్లాడకుండా వెళ్లిపోయాడు.

జి. ప్రపాదరావు (విజయనగరం)

---

"నల్లటివన్నీ నీళ్లనీ, తెల్లటివన్నీ పాలనీ నమ్మే అమాయకురాలు ఇందిర. తండ్రి రాజకీయాలు గానీ, పరిస్థితులు గానీ అర్థం చేసుకోలేదు పాపం ! నా అంతట నేనే మానేశా ననుకుంటున్నది" అని ఆలోచిస్తున్నాడు రాజారావు.

ఇంతలో ఇద్దరూ డొంకదాటి వూళ్లోకి వచ్చారు.

అక్కడి దృశ్యం రాజారావును ఆశ్చర్యపరిచింది.

అదొక సమాధి. దానికి ఆరోజే సున్నము వేసినట్టుంది.

సమాధిపైన బంతిపూలతో కట్టిన హారం వేసి ఉంది. ప్రమిదలో దీపం వెలుగుతున్నది.

సమాధి ముందు ఒక స్త్రీ కూర్చున్నది. ఆమెకు సమీపంలోనే ఒక వృద్ధుడు కర్ర సహాయంతో నిలబడి ఉన్నాడు. బహుశః అతని కళ్లల్లో కూడా నీళ్ళు నిలిచాయేమో—పోలాయి పలుకరించేప్పటికి జీరపడిన గొంతుతో సమాధానమిచ్చాడు.

"చంద్రయ్యతాతా !" అన్నాడు పోలాయి.

"ఎవరు—నీవా పోలాయ్" దుఃఖావేశంతోనేమో వృద్ధుని కంఠం ఒణికిపోయింది.

ఆ స్త్రీ లేచి నిలబడి "పోలాయన్నా" అంది ఏడుస్తూనే.

"వూరుకో చెల్లమ్మా !.... నీవు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా గుండె చెరువైపోతుంది. నీ జీవితంలో అగ్గి పెట్టాను. ఆరోజు నావెంట జగ్గును తీసుకెళ్లకుంటే నీకీ గతి పట్టేదికాదు" అని అంటుంటే పోలాయి కంఠం రుద్ధమైంది. కళ్లల్లో నీళ్ళు నిండాయి.

"నీమీద నాకేం కోపం లేదన్నా ! మనసు ఉండబట్టలేక ఏడుస్తున్నాను. ఆరోజు నీవూ ఆయనే లేకపోతే ఎంతమంది ఆడవాళ్ల బతుకులు పాడయ్యేవో ! ఆ రాక్షసముండాకొడుకులు తరుముతుంటే ఆయన తప్పించుకోలేకపోయాడు. నాకు ఒకవిధంగా గర్వం, ఒకవిధంగా దుఃఖం" అందామె.

విస్మయంతో రాజారావు వాళ్ల సంభాషణ వింటూ నిలబడిపోయాడు.

"ఇంక పోదాం పద తల్లీ !" అన్నాడు వృద్ధుడు.

"రెండు రోజు లుంటారా తాతా !" అన్నాడు పోలాయి.

"ఇంక ఇక్కడేముంది బిడ్డా—తెల్లారుజామున ఎల్లిపోతాము."

ఆమె లాంతరు పట్టుకొని ముందు నడుస్తున్నది. మిగతావాళ్ళు వెనకాలే నడుస్తున్నారు.

కొంతదూరం వచ్చేప్పటికి "పేమిటు పోతాం చెల్లమ్మా .... ఇవిగో—ఈ ఏభై నీ దగ్గర ఉంచుకో తాతా ! .... పిల్లాడి కింద ఖర్చుపెట్టు" అంటూ పోలాయి రొండి నుంచి నోట్ల కట్టలు తీశాడు.

"ఒద్దన్నా—ఎందాకా ఇట్లా ఇస్తావు ...." అందామె.

"ఎందుకులే పోలాయ్ .... ఇంకా నా బొందిలో పాణముందిగా. ఆపైన అన్నలు ఎట్టనూ సూడరు దాన్ని" అన్నాడు తాత.

"మీరు తీసుకోకపోతే నా మనస్సుకు శాంతి ఉండదు చెల్లమ్మా ! పిల్లవాడు పైకి వచ్చిందాకా నే నిచ్చేది కాదనకండి" అంటూ పోలాయి ఆ నోట్లను వృద్ధుని చేతిలో పెట్టి "వస్తాను చెల్లమ్మా" అంటూ ముందుకు నడిచాడు. సంభ్రమాశ్చర్యాలతో రాజారావు పోలాయి వెనుకనే నడుస్తున్నాడు.

కొన్ని క్షణాలు ఇద్దరిమధ్య మౌనం నిలిచింది.

"ఏమిటిదంతా పోలయ్యా ?" అని ప్రశ్నించాడు రాజారావు.

"అదంతా ఓ కథ బాబూ !"

ఒక శృంగాటకంలో ఇద్దరూ విడిపోయారు.

రాజారావు భోజనం ముగించుకొని పుస్తకం ముందరపెట్టుకు కూర్చున్నాడు. చదవాలని ప్రయ

(40-వ పేజీ చూడండి)

# బంగారం - సింగారం - 'రేఖ' చిత్రకథ -



















# బంగారం - సింగారం - 'బాపు' చిత్ర కథ -












# నేతివర్తకుడు

శాంతిశ్రీ

అక్బరు గొప్ప కళాప్రియుడు. అతని ఆస్థానంలో ఎంతోమంది కవులు, పండితులు, విద్వాంసులు ఉన్నారు. వారిలో ముఖ్యముగా చెప్పుకోదగిన వ్యక్తి "బీర్బల్". అతడు చాల తెలివైనవాడు. ఎటువంటి క్లిష్ట సమస్యలనైనా తనయొక్క బుద్ధిబలంచే సాగుచేసేవాడు. అతడంటే అక్బరుకు వల్లమాలిన అభిమానం. "బీర్బల్" తెలివితేటలను సూచించే కథలు ఎన్నో ఉన్నాయి. వాటిలో ఇది ఒకటి.

ఒకరోజున "బీర్బల్" విశ్రాంతిగా ఇంట్లో కూర్చుని ఉన్నాడు. అప్పుడు అక్కడకు ఒక నేతి వర్తకుడు వచ్చాడు. "బీర్బల్" ఆ వ్యక్తిని పరీక్షగా చూసి ఏంకావాలని అడిగాడు.



పోలీసు:-థాంక్స్ శాస్త్రిగారూ! పెద్ద గజదొంగను పట్టుకున్నారండి.

చిత్రకారుడు : వి. రామారావు (ఖమ్మంమెట్టు)

"అయ్యా! తమరు నాకొక చిన్న సహాయంచేసిపెట్టాలి" అన్నాడా వ్యక్తి.

"ఏమిటది?" అని అడిగాడు "బీర్బల్".

"నేనొక నేతివర్తకుడను. ఆరు మాసముల క్రితము నేను నా స్నేహితుని కొకనికి ఆతడు చిక్కులలో ఉండగా వెయ్యిరూపాయలు అప్పు ఇచ్చాను. ఇప్పుడు ఆ డబ్బు నాకవసరమొచ్చి అతనిని ఇమ్మనడిగాను. కాని ఆతడు తనకేమి నేను డబ్బు ఈయలేదని బొంకుచున్నాడు. తమరు న్యాయమూర్తులు. న్యాయముగా నాకు రావలసిన సొమ్ము నాకిప్పించండి. మీఋణ మీ జన్మలో మర్చిపోలేను". అన్నాడా వ్యక్తి వినయంగా.

"అయితే నీవు ఆతనికి డబ్బు ఇచ్చినప్పుడు నోటు వ్రాయించుకున్నావా? లేక నీకు అప్పుడు ఎవ్వరైన సాక్షులున్నారా?" అని ప్రశ్నించాడు "బీర్బల్".

ఆ వర్తకుడు తల అడ్డంగా త్రిప్పి," లేదండీ నేనాతనివద్ద పత్రం వ్రాయించుకొనలేదు. సాక్షులు గూడా నాకు ఎవ్వరూ లేరు. మేమిరువురు వర్తకులము. పత్రములేకుండ నేతరచుగా ఒకరియొద్ద మరొకరము చేబదులు తీసుకుంటుంటాము. అలాగే ఈ మారు గూడా నేనాతనివద్ద పత్రం వ్రాయించుకోలేదు. భగవంతుని సాక్షిగా జరిగిన యథార్థం చెబుతున్నాను నేను. నన్ను నమ్మండి." అన్నాడు వర్తకుడు దీనంగా.

"బీర్బల్" కొద్దిసేపు తీక్షణంగా

ఆలోచించి, "సరే నీవు నాకిప్పుడు చెప్పినదంతా ఒక కాగితంమీద వ్రాసియ్యి. ఆ విషయంగూర్చి నేనాలోచించి తరువాత నువ్వేమి చెయ్యాలో తెలుపుతాను." అన్నాడు.

ఆ వర్తకుడు అల్లే తను చెప్పినదంతా ఒక పత్రంమీద వ్రాసి ఇచ్చాడు. ఆ పత్రం తీసుకొని "బీర్బల్" ఆతన్ని పంపివేసాడు.

"బీర్బల్" రెండవ వర్తకునకు కబురు పంపాడు. అతడు "బీర్బల్" వద్దకు వచ్చాడు.

"బీర్బల్" ఆతనికి మొదటి వర్తకుడు వ్రాసిఇచ్చిన పత్రం చూపించాడు. దాన్ని చూసి ఆ వర్తకుడు, "పాడుప్రపంచం. తుదకు నాస్నేహితుడు గూడా నన్ను వంచించటానికి ప్రయత్నిస్తున్నాడు. ఎంత మోసం. ఎంత అన్యాయం." అన్నాడు. "అయితే ఆవర్తకుడు నీకేమీ అప్పు ఇవ్వలేదా?"

"లేదండీ. అంత వట్టినాటకం. నాకతడు చిల్లిగవ్వకూడా అప్పు ఇవ్వలేదు. పైగా నేనే ఆతనికి అప్పు ఇచ్చి ఆపదలలో ఆదుకొనేవాడను. తుదకతడు ఈ విధంగా నాకు ఋణం తీర్చుకొన్నాడు. నిజానిజాలు ఆ భగవంతునికే తెలుసు. నా వర్తకము ఆతని వర్తకముమీద అభివృద్ధి చెందుచుండుటచే ఓర్వలేక నన్నీ విధముగా నాశనం చేయదల్చుకొన్నాడు." అన్నాడా వర్తకుడు.

"బీర్బల్" ఆతని మొగం వంక పరీక్షగా చూస్తూ, "ఇంతకూ అతడు చెప్పినది నిజంకాదంటావా?" అని ప్రశ్నించాడు. "అది ఎంత మాత్రము నిజముకాదు. నేనతని సొమ్ము చిల్లిగవ్వ ఐనా ముట్టుకో

(18వ పేజీ చూడండి)

# కాకి కబురు

అలపర్తి వెంకటసుబ్బారావు

విన్నావటే అమ్మ - విన్నావటే?
నాన్న యీపూట వస్తున్నాడటే !!

మదురు గోడను చేరి
కుదురుగా కూర్చుండి
కావుకావని అరచి
కాకమ్మ చెప్పింది !!

విన్నావటే అమ్మ - విన్నావటే?
నాన్న యీపూట వస్తున్నాడటే !!

కాకమ్మ చెప్పేటి
కబురెప్పుడైననూ
వట్టిదవబోదమ్మ
గట్టి కబురేనమ్మ !!

విన్నావటే అమ్మ - విన్నావటే?
నాన్న యీపూట వస్తున్నాడటే !!

నాన్నవస్తే నాకు
నవ్వు వస్తుందమ్మ !
నాన్న తెచ్చేపప్పు
లన్ని నాకేనమ్మ !!

విన్నావటే అమ్మ - విన్నావటే?
నాన్న యీపూట వస్తున్నాడటే !!

కబురు చెప్పెను గనుక
కాకమ్మ కందులో
బహుమతిగ కాసిన్ని
పప్పులిస్తానమ్మ !!

విన్నావటే అమ్మ - విన్నావటే?
నాన్న యీపూట వస్తున్నాడటే !!

ప్రస్తుకాలంలో కుస్తీ పట్టిన మొదడుకి కాస్త విశ్రాంతి కలిగిద్దామని వచ్చాం నేను, రవి, రాజా.

మా కందరికీ విశ్రాంతిఉంది. కాని మాకు విశ్రాంతి లేదన్న ఉక్రోషంతో సముద్రపు కెరటాలు ఉవ్వెత్తుగా ఒడ్డుకు దూసుకువచ్చి వాటి శ్రమ చిహ్నంగా నురుగును ఒడ్డున వదలి, ఆడపిల్ల బాధ్యత తీర్చిన తలి దండ్రులలాగ వెనక్కి వెళ్ళిపోతున్నాయి.

"ఇక్కడ కూర్చుందాంరా రామం!" అన్నాడు రాజా హఠాత్తుగా.

ఏదో విశేషం ఉండాలని చుట్టూ పరిశీలించాను. మాకు కొద్ది దూరంలోనే నలుగు రమ్మాయిలు ఉల్లాసంగా కబుర్లు చెప్పుకుంటున్నారు. 'అసలు కారణం యిదా!' అనుకున్నాను.

అందులో ఒక తెల్ల చీరమ్మాయి గురించి ఆపు లేకుండా చెప్పుకుపోతున్నారుడు రాజా.

"ఒరేయ్! నోర్ముయ్!" అని గద్దించాను.

"నీకేం తెలుసురా. ఆ అమ్మాయి గురించి.

ఆ పాము కుబుసంలాంటి తెల్లని చీర, దానికి సరిపోయే తెల్లని సిల్కు బ్లౌజు!......అబ్బా! వర్ణించ లేనురా!......." "ఆగరా! ఆగు! ఒరేయ్ నాయనా అనవసరంగా మూర్ఛ పోక అసలు సంగతి సరిగా చెప్పేడు."

"ఏం చెప్పనురా! ఆ అమ్మాయి నాకు తొలి దర్శనమిచ్చినప్పుడే నా గుండె గాయం చేసేసింది! ఆమెకోసం ఎంతో తహ తహ లాడుతున్నాను. ఎక్కడైనా కనుపిస్తుందేమోనని, ఆ అమ్మాయితో పరిచయం చేసుకోవాలని......"

"వెర్రి మొర్రి వేషాలెయ్యక, ఆ అమ్మాయి గురించి తెలిసింది చెప్ప గలిగితే చెప్పు."

"అయితే వినండిరా! ఆ అమ్మాయి పేరు సరళ. చాలా బాగుంటుందిరా."

"బాగుంటుందేమిటిరా నీ మొహం. ఎదురుగుండా కనుపిస్తోందిగా!" మధ్యలోనే నేను అడ్డు తగిలాను. వాడే విషయమైనా చెప్పుకుపోతున్నప్పుడు మధ్యలో అడ్డు తగులుతూండడం నా కలవాటు.



**అనూరాధకు ప్రేమలేఖ వ్రాసిన ప్రబుద్ధుడు ఎవరు? నిజం తెలిసిన తరువాత కలిగిన పరిణామమేమిటి?**

రాజు సీరియస్‌గా "రామం! నువ్వు మధ్యలో మాట్లాడకురా—'పానకంలో పుడకలాగ! నా ఏడు పేదో నన్నేడవనీ," అంటూ తిరిగి తన ధోరణిలో ముందు కుపక్రమించాడు.

"సరళ యీ యేడాదే యింగ్లీష్ ఆనర్సులో చేరింది. చాలా సరదాగా ఉంటుంది. ఆ నవ యౌవన జవ్వని వయ్యారంగా హంసలా నడుస్తున్నప్పుడు ఆ నడకలోని తళుకు, బెళుకు చూస్తుంటే..."

"నీ కవిత్వం ఏడ్చినట్లే ఉంది"

"ఏం చెయ్యన్రా! నా కంతకంటే కవిత్వం రాదు మరి! నా హృదయం నా దగ్గరుండనని మారాం చేస్తోందిరా! దాన్ని ఆమె దగ్గరకు వెళ్ళకుండా ఆపడం నా శక్యంకాదు. రవీ! నువ్వు నాకొక్క చిన్న సహాయం చేసి పెట్టాలిరా. మళ్ళీ ఏన్నడూ నీ ఋణం....." ప్రాధేయపడుతున్నట్లడుగుతున్నాడు రాజు.

ఇంతలో ఆ అమ్మాయిలు నలుగురూ వెళ్ళిపోడానికి లేచి నిలబడ్డారు. అప్పుడు చూశాను. వాళ్ళలో మా క్లాసుమేటు అనూరాధకూడా ఉండటం. వాళ్ళు వెళ్ళిపోయారు. రాజు నీరసించిపోయాడు. బరువుగా బయలుదేరేం మేమూను.

* * *

రవి, రాజు, నేను ఒకే రూంలో ఉంటున్నాం. రవి, నేను ఒక ఊరి వాళ్ళమే. మే మిద్దరు చిన్నప్పటినుంచి కలసి మెలసి తిరిగే వాళ్ళం. వాళ్ళ కుటుంబం మధ్య తరగతి లోకే వస్తుంది. రవి వాళ్ళనాన్నగార్ని నేను బాగా ఎరుగుదును. జీవితంలో ఎక్కువగా కష్ట పరంపరనే ఎదుర్కొన్నా డాయన. సాధారణమైన పంచ, చొక్కాతో, ఎప్పుడూ చిరు నవ్వు ముఖంతో అందరితోనూ చనువుగా ఉంటూ








రాయన. రవి బి. యస్. సి. ఫస్ట్ క్లాస్‌లో పాసయ్యాడని వినగానే ఆనందంతో ఆయన హృదయం దాని అవధుల్ని దాటింది. అందుకనే ఆర్థికంగా వెనుకబడినా రవిని యమ్మెస్సీ, కెమిస్ట్రీలో విశాఖలో జాయిన్ చేశారాయన. తన గృహ పరిస్థితుల నర్థం చేసుకున్న రవి కూడా శ్రద్ధగానే చదువుతున్నాడు. అందుకేనేమో రవి అంటే నాకంత అభిమానం, ఆత్మీయతాను. వాడప్పుడప్పుడూ కథలు కూడా రాస్తుంటాడు.

రాజు స్ఫురద్రూపి. అందగాడు. విశాలమైన నుదురు, ఉంగరాల జుట్టు, పొడవుకుతగ్గ దేహం, దానికితగ్గ అంగ సౌష్ఠవం—యివన్నీ రాజు అందగాడని నిరూపిస్తాయి. వాడు ఫైనల్ ఆనర్సు యింగ్లీషు చదువుతున్నాడు.

మేం ముగ్గురం బాగా సన్నిహితులమయ్యాం. మాలో అభిప్రాయ భేదాలే లేవు. మా స్నేహం అటువంటింది.

ఒక రోజు......

నేను కాలేజీనుంచి రూం కొచ్చేటప్పటికి రవి విచారంగా కూర్చునున్నాడు.

"ఏంరా! అలాగున్నావు?"

"ఏం లేదు"

ఆ జవాబులో నాకు మునుపటి ఉత్సాహం, ఉల్లాసం, కనుపించడంలేదు. ఏదో వెలితి ఉన్నట్లుంది.

"ఒంట్లో బాగు లేదా!" వాడివంటిమీద చెయ్యి వేస్తూ అన్నాను.

"అబ్బే! బాగానే ఉందే!" వాడి గొంతుక తడబడుతున్నట్లుంది.

వాడి నా స్థితిలో వదిలి వేయడం నాకు సంతృప్తిగా లేదు. వాడినుంచి సరైన జవాబు రాబట్టాలి. మళ్ళీ మళ్ళీ అడగ్గా అసలు విషయం చెప్పడం ప్రారంభించాడు.

ఈవాళ ఉదయం నేను వారం రోజుల క్రితం తెచ్చిన 'పెయింటింగ్స్' బుక్ రిటర్న్ చేద్దామని లైబ్రరీ కెళ్ళాను.

అక్కడ—

"మిస్టర్! యిందులో కొన్ని కాగితాలు చింపేశారు" అన్నాడు కౌంటరు దగ్గర క్లర్కు.

"అబ్బే! నాకేం తెలియదండి"

"ఏమో మీరు లైబ్రరియన్‌గార్ని మీటయి తగిన సంజాయిషి యిచ్చుకోండి" అన్నాడు క్లర్కు.

తడబడుతున్న అడుగులతో అదిరే హృదయంతో లైబ్రరియన్‌గారి రూంలో అడుగు పెట్టాను. ఆయన చాలా కోపంగా ఉన్నారు. నేను వచ్చిన కారణం చెప్పాను.

"ఏమోయ్! యీ లైబ్రరీ నీ తాతగారి సొమ్మనుకున్నావా, నీ యిష్టం వచ్చినట్లు పుస్తకాల్లో కాయితాలు చింపడానికి" కొంచెం కటువుగానే అడిగారు.

తడారిపోయిన గొంతుతో మళ్ళీ కౌంటరు దగ్గిర సమాధానమే యిచ్చాను.

"ఏమిటోయ్ తెలిసేది. నీకామాత్రం బుద్ధుండక్కర్లా! నీలాటి వాళ్ళుండడం యీ యూనివర్శి

టికే పరువు తక్కువ. ఈ బుక్ ఖరీదెంతో తెలుసా. 40 రూపాయలు. నీకు పది రూపాయలు ఫైను వేస్తున్నాను. మొత్తం ఏభై రూపాయలు రేపు కౌంటరు దగ్గర కట్టెయ్" అధికార హోదాలో ఆయన తన కర్తవ్యాన్ని నిర్వహించారు. నేనేం మాట్లాడలేకపోయాను. బరువెక్కిన హృదయంతో, చెదిరిన మనస్సుతో రూంకు చేరుకున్నాను. డబ్బు విషయం ఎల్లా ఉన్నా, లైబ్రేరియన్‌గారి సూటీ పోటీ పలుకులు నా హృదయంలో ములుకుల్లా గుచ్చుకున్నాయి. వాటిని రూపుమాపి నా హృదయంలోని బాధను అణగార్చడానికి అశక్తుడనౌతున్నాను.

రవి యింకేమీ మాట్లాడలేకపోయాడు. నేను జరిగింది వినగానే క్రుంగిపోయాను. ఏమైనా వాడిని ఊరడించడం నా కర్తవ్యం అనుకుంటూ వాడిని సమీపించాను.

"రవీ! నీ వింత చిన్న విషయాని కంత ప్రాధాన్యతనిచ్చి బాధ పడతావెందుకురా? లైబ్రేరియన్ గారు నిన్ను మందలించడంలో తప్పేమీలేదు. ఆయన తన కర్తవ్యాన్ని నిర్వహించారు. ఇక ఎటొచ్చీ ఎవరు కాయితాలు చించారనేదే సమస్య. దీనికి నువ్వేమీ బాధపడకు. నిజం నిలకడమీదే బయట పడుతుంది."

ఈ మాటలన్నీ వ్యర్థమని నాకు తెలుసు. నా యీ ఊరడింపు వాక్యాలు వాడి హృదయంలో రేగుతున్న అశాంతిని రూపుమాపలేవు. వాడి ఏకాంతాన్ని భంగం చెయ్యడం యిష్టంలేక బయటకు వచ్చేసాను.

ఒక విషయం మాత్రం నన్ను పట్టుకొని పీడిస్తోంది.—ఎవరు చేశారీపని? ఒకవేళ రవే చింపాడేమో. ఛ! ఛ! వాడటువంటి పని చెయ్యడు. అటువంటి ఆలోచన వచ్చినందుకు నన్ను నేనే తిట్టుకున్నాను. మరెవరు చింపారు? ఆ పుస్తకాన్ని నేను కూడా చూశాను. అందులో అద్భుతమైన చిత్రాలున్నాయి. ఆ బొమ్మలను చూస్తుంటే కొన్ని స్వంతం చేసుకోవాలనిపిస్తుంది.

ఇంకా ఏవేవో ప్రశ్నలు బయలుదేరి నాలో నాకే కంగారు కలిగిస్తున్నాయి. బుర్ర వేడెక్కిపోయింది. కాఫీ తీసుకునేందుకు కాంటీన్ కెళ్ళాను. కాఫీ స్విప్ చేస్తున్నప్పుడు కూడా వెనుకటి ప్రశ్నలే నాలో తిరిగి తలలెత్తుతున్నాయి.

"రామం!"— ఎవరో పిల్చారు. తలెత్తి చూసాను. "ఓ రాజా! నువ్వా! రా! కూర్చో!" అన్నాను యాంత్రికంగా.

"ఇవాళ రవిని లైబ్రేరియన్ తిట్టాడుటగా!"

"అవును" అన్నాను ముక్తసరిగా.

"అందుకనే కామోసు! యివాళ నాతో గొడవ పెట్టుకున్నాడు. ఇడియట్! నాతో చెప్తే ఆ 50 రూపాయలు వాడి మొహాన్ని పారేసేవాడినిగా...." ఇంకా ఏదో అనబోతున్నాడు.

"అసలేం జరిగింది? నీకు, రవికి మధ్య ఏమైనా గొడవ జరిగిందా?" ఆత్రుతగా అడిగాను.

"అవును. అక్షరాల అంతే జరిగింది. రవి నేనే ఆ కాయితాలు చింపేశానన్నాడు. నా కంతగాలేం పట్టింది. చేసింది తప్పుపని కాకుండా యిదొకటా మళ్ళా. వాడికి నా సంగతి పూర్తిగా తెలియదనుకుంటాను. వాడి సంగతి చూస్తా! వస్తా!" అంటూ విసురుగా వెళ్ళిపోయాడు.

వాడి ఆఖరి వాక్యంలో పెద్ద విశేషమున్నట్లనిపించింది నాకు. వాళ్ళిద్దరికీ మధ్య చాలా పెద్ద గొడవే జరిగుండాలి అనుకున్నాను.

నేను రూం కెళ్ళాను. రవి రూంలోనే వున్నాడు. "రవీ! నువ్వు 'పెయింటింగ్స్' బుక్‌ని ఎవరికైనా యిచ్చావా?" అన్నాను డిటెక్టివ్‌లా.

"లేదు" అన్నాడు క్లయింటు లా వాడు.

"అంటే అది మన రూం దాటి బయటకు పోలేదన్నమాట"

"అవును"

వెంటనే ఒక నిశ్చయానికివచ్చి రూం తలుపు లోపల గడియపెట్టాను. రాజుకు సంబంధమైన వస్తి క్షుణ్ణంగా గాలించాను. ఆ విధంగా చెయ్యడం తప్పని నాకు తెలుసు. కాని తప్పదు. ఎంత గాలించినా ఫలితం శూన్యం. అక్కడే కుర్చీలో కూర్చున్నాను. మనస్సంతా చెప్పరాని ఆవేదనతో నిండిపోయింది. ఎదురుగా రాజా టేబుల్ పైనున్నవాడి ఫొటో నన్ను చూసి "ఓడిపోయావం"టూ హేళనతో నవ్వుతున్నట్లుంది. చింపిన కాగితాలేమయ్యాయి? ఏమవుతాయి. అసలు విషయం బయట పడిన తర్వాత ఆ కాయితాలు తన దగ్గరే ఉంచుకుంటాడా? ఉహుఁ తెలివైన వాడెవ్వడూ అలా ఉంచడు. చింపిపారేస్తాడు. ఎదురుగా టేబుల్ క్రిందనున్న చిత్తు కాగితంబుట్ట నా దృష్టిని ఆకర్షించింది. ఆత్రుతగా ఆ బాస్కెట్‌లోని కాగితాలను నేలమీద వంపి ప్రతి కాగితం క్షుణ్ణంగా గాలించాను. నేననుకున్నట్లుగానే నాకు రెండు నలిపి పడేసిన చిత్రాలు దొరికాయి. అవి 'పెయింటింగ్స్' బుక్‌లోని కాయితాలే. సందేహంలేదు. ఆ చిత్రాలు చాలా రమ్యంగా ఉన్నాయి. కాబట్టే వాడికి వాటిని చింపేయాలని బుద్ధిపుట్టుంటుంది. ఆ కాగితాలు రవికి చూపిద్దామని ప్రక్కకు తిరిగాను. వాడెప్పుడో వెళ్ళిపోయినట్టున్నాడు. ఆ కాగితాలు చూసినప్పుడేనా వాడి మనస్సు ఊరట కల్గుతుంది. వాడు ఊహించింది అక్షరాలా నిజమని తెల్సినప్పుడైనా దుఃఖాన్ని దిగమింగుకుంటాడేమో.

---

ఇద్దరు పిచ్చివాళ్ళు చీకటిలో కూర్చున్నారు. ఒకడు జేబులోంచి టార్చితీసి ఆకాశంవైపు ప్రసరింపజేసాడు. అపుడు రెండవ వాడు ఇలా అన్నాడు: 'నువ్వు ఆకాశానికి దారి వేశావు. నేను దాన్నిబట్టి పైకి వెళ్ళిపోగలను తెలుసా!

మొదటివాడు :- ఏదీ వెళ్ళు చూద్దాం.

రెం. వాడు :—వెధవా! నేను వెళ్తూఉంటే లైటుఆర్పేద్దామనా. నేను క్రింద పడిపోనూ!

ద్విభాష్యం రాజేశ్వరరావు,
(యలమంచిలి)

---

* * *

ఆ రోజు ప్రొఫెసరుగారి క్లాసు జరుగుతోంది. రవి శ్రద్ధగా ఆయన చెప్పేది వింటున్నాడు. ఇంతలో ఒక ప్యూనువచ్చి ప్రొఫెసరుగారికొక చీటీ యిచ్చాడు. అది చదవగానే ఆయన "మిస్టర్ రవీ! ప్రిన్సిపాల్ వెంటనే రమ్మంటున్నారు!" అన్నారు. రవి మౌనంగా లేచి బయటకు వచ్చాడు. క్లాసులో అందరూ రవిని వింతగా చూసారు.

ప్రిన్సిపాలుగారెందుకు రమ్మన్నారో రవి కర్థమవడంలేదు. తానింకా లైబ్రరీలో డబ్బుకట్టలేదు. ఆ విషయం లైబ్రేరియన్‌గారు ప్రిన్సిపాలుగారికి రిపోర్టు చేశారేమో! రవికి శరీరమంతా ముచ్చెమటలు పోశాయి.

ఎలాగో తన్ను తాను నిలద్రొక్కుకుంటూ ప్రిన్సిపాలు గారి గదిలో ప్రవేశించాడు. ఆయన ప్రక్కనే అనూరాధ కూడా నిలబడుంది. ఆమె తనను మింగేద్దామన్నంత కోపంగా చూస్తోంది. ఇతని రాకను గమనించి ప్రిన్సిపాలుగారు ముఖం చిట్లించారు. ఒక కాగితాన్ని తీసి చూపిస్తూ,

"మిస్టర్ రవీ! ఇది నువ్వు రాసిందేనా?" కటువుగా ప్రశ్నించారు.

ఆ కాగితాన్ని చూడగానే రవికి కళ్ళు బైర్లు కమ్మినట్లనిపించింది.

"అవునండి" నూతిలోనుంచి మాట్లాడుతున్నట్లుంది కంఠం.

"మర్యాదగా చదువుకుంటున్న అమ్మాయికి యిటువంటి లవ్ లెటర్స్ వ్రాయడానికి సిగ్గుండొద్దుటయ్యా? ఊఁ! దీనికి సంజాయిషి యేమిచ్చుకుంటావ్?"

"ఆ ఉత్తరం నేను వ్రాసిందే కానండి.... ఆ అమ్మాయికి మాత్రం నేను......"

"ఆ ఉత్తరం నువ్వే వ్రాశానని ఒప్పుకుంటూ పైగా యింకేదో మాట్లాడతావేమిటి? ఎడ్రసు కూడా క్రింద యిచ్చి. దాని పర్యవసానం ఆలోచించే చేసావా యీ పని?"

"నన్నొక్క విషయం చెప్పనియ్యండి సార్!"

"ఒక్క విషయంకాదు. అర విషయం చెప్పినా నే నిప్పుడు వినను. తల్లి దండ్రులు కష్టపడి, కడుపు మాడ్చుకుని, బిడ్డల పురోభివృద్ధికోసం తమ రక్తాన్ని చెమటగా వోడ్చి సంపాదించిన డబ్బు పంపిస్తూంటే, చిద్విలాసంగా చిల్లపెంకుల్లా డబ్బు ఖర్చు పెట్టడం తెలుసు మీకు."

"సార్"

"ఇంకా యేవిటయ్యా! చేసింది తప్పుపనికాక వ్యర్థసంజాయిషిలతో నన్ను మోసపుచ్చాలనుకుంటున్నావా? గౌరవం, ప్రతిష్ఠ, యీ ప్రపంచంలో పుట్టిన ప్రతిప్రాణికి ఉంటాయి. ఆ రెంటినీ నిలబెట్టుకున్ననాడే ప్రయోజకుడవుతాడు మానవుడు. ఆ ప్రయోజకత్వం సంఘం

పోకడనుబట్టి చేర్చుకుంటారని యీ విశ్వవిద్యాలయాలయొక్క ఆశయం. కాని ఆ ఆశయాలన్నిటిని అణగద్రొక్కి కేవలం తప్పుడు మార్గాలనే ఏరుకుంటూ, మమ్మల్ని మోసపుచ్చుతూ, మీరు మోసపోతున్నారు. నీ యీ నేరానికి నా సహాయం లభించదు. నిన్ను వెంటనే యీ యూనివర్శిటీనుంచి పంపించి వేస్తున్నాం. యిదుగో కాగితం''

రవి వణికిపోయాడు. అభిమానం అడ్డొచ్చినా లెక్కచేయక అసలు విషయం చెప్పడానికి అవకాశమిమ్మంటూ ప్రాధేయపడ్డాడు. కాని లాభం లేకపోయింది. ప్రిన్సిపాలుగారి హృదయం కరగలేదు. తన నిశ్చయానికి తిరుగు లేదన్నారు. రవి భారంగా అడుగులు వేసుకుంటూ రూంకు చేరుకున్నాడు.

* * *

రవి రాధకు, లవ్ లెటర్ వ్రాశాడనే విషయం యూనివర్శిటీఅంతా పాక్కిపోయింది. నాకూ యీ విషయం తెలిసింది. నేను నమ్మలేదు. రూంకు వెళ్ళి రవిని జరిగిందేమిటో చెప్పమన్నాను. రవి మాట్లాడలేదు.

''ఇంతకీ జరిగిందేమిటో చెప్పరా! ఊరికే అలా బాధ పడతావెందుకు? లవ్ లెటర్ నిజంగా నువ్వు రాశావా?'' అన్నాను.

''అవునురా! నేను వ్రాసినదే'' అంటూ ఆ ఉత్తరం ఎప్పుడు, ఎందుకు వ్రాసిందీ నాకు జ్ఞాపకం చేసాడు. ప్రిన్సిపాలుగారి రూంలో జరిగిన గొడవంతా చెప్పాడు. అవును. ఇప్పుడు నాకు గుర్తొచ్చింది. ఆ ఉత్తరం వ్రాస్తున్నప్పుడు నేను కూడా దగ్గరున్నాను. నిజం తెలియగానే నాకు చాలా బాధ కల్గింది. ఎవరికైనా అంతే. ఇంతకూ రవి దురదృష్టవంతుడు. విధి వాడిపైన ఒకటి తర్వాత ఒకటిగా అభాండాలు కురిపిస్తోంది. మూలిగే నక్కపైన తాటిపండు పడినట్లుంది వాడి పరిస్థితి. దానికి మనమేం చేస్తాం!

''ఒరేయ్! జరిగిందానికి విచారిస్తూ కూర్చుంటే ప్రిన్సిపాలుగారు తిరిగి నిన్ను చేర్చుకుంటారా? లాభం లేదు. ఇకముందు కర్తవ్యం గురించి ఆలోచించు'' అన్నాను ఊరడిస్తూ.

''ఏం చెయ్యమంటావురా?'' అన్నాడు బాధగా.

''బంగారు వస్తువులు లేనప్పుడు బంగారంలా కనిపించే నకిలీ వస్తువులతో సంతోషపడాలి! నీ యీ దురదృష్టాన్ని మర్చిపోయి బి. య్యస్. సి. ఫస్ట్‌క్లాస్ డిగ్రీతో సంతోషించు. కర్తవ్యపాలన మనది. ఫలిత ప్రసాదం భగవంతుడిది. ఊఁ! సరే! తరవాత సంగతాలోచిద్దాం. కాఫీ తాగొద్దాం నడు'' మే మిద్దరం కాంటీనుకు దారితీశాం.

మా నాన్నగారికి తెలుసున్న ఒకాయన దగ్గరకు వెళ్ళి రవి సంగతంతా చెప్పాను. ఏదైనా ఉద్యోగం వేయించమని అడిగాను. ఆయన మా నాన్నగారిమీదుండే అభిమానం, నామీద వాత్సల్యంకొద్దీ రవికి ఒక కంపెనీలో ఉద్యోగం యిప్పించారు. వాడికి ఉద్యోగం యిచ్చేవరకూ నా రూంలో అట్టే పెట్టుకున్నాను. వాడికి ఉద్యోగం రావటంతో మా యిద్దరి ఆనందానికి అవధులు లేకపోయాయి. వాడు కూడా జరిగిపోయినదంతా ఒక పీడ కల అనుకుని గతాన్ని మర్చిపోడానికి ప్రయత్నిస్తున్నాడు. అంతవరకూ ఎంతో సన్నిహితంగా ఉండి స్నేహం అంటే ఏమిటో నేను తెలుసుకోడానికి అవకాశం కల్పించినవాడు దూరమవుతున్నాడంటే బాధ కల్గడం సహజం. రోజు లిట్లాగే భారంగా దొర్లిపోతున్నాయి.

* * *

''రామంగారూ!.......'' ఎవరిదో పిలుపు వినపడింది. నన్నింత సన్నిహితంగా పిలిచే ఆడవాళ్ళెవరా అనుకుంటూ వెనక్కు తిరిగాను. ఆమె అనూరాధ. ఆమెను చూడగానే నాకు కోపం వచ్చింది. రవి వినాశానికి కారణభూతురాలైనందువల్ల ఆమెను చూడగానే అదొక రకమైన ఏహ్యభావం కూడా కలిగింది.

''మీరు నన్నేనా పిలిచారు!'' నన్ను కాదేమో నన్న అనుమానంతో అడిగాను.

---

ఒక చేనులోబడి ఒకాయన వెళ్లిపోయి బాటచేరుకున్నాడు. రైతు అదిచూచి కోపంతో తొందర తొందరగా వెంటపడి, "ఏమయ్యా, కళ్లు కనిపించ లేదా? మొక్కలు తొక్కుకుంటూ వెళ్లేవు?" అన్నాడు. రైతుతో ఆయన, "మరి మీరుకూడా ఇప్పుడలాగే వచ్చేరు కదండీ" అన్నాడు తాపీగా. ఆ రైతు తెలివి తెచ్చుకొనేసరికి అతను ఆ బాట మలుపు తిరిగిపోయాడు.

వ (టి. వల్స)

---

''ఆ! అవును. మిమ్మల్నే పిలిచాను. నిన్న ప్రొఫెసరుగారు న్యూటాపిక్ బిగిన్ చేశారట. నిన్న నే నాబ్సెంటయ్యాను. మీ నోట్సిస్తారా?''

ఆమె చొరవకు కొంచె మాశ్చర్యం కలిగింది. అసలు అటువంటి అవకాశం కోసమే చాలమంది కుర్రాళ్ళు ఎదురు చూస్తుంటారు. నేనేకోవకు చెందినా ఆమెతో మాట్లాడడానికి మాత్రం కొంచెం కష్టం కలిగింది.

''మీరు నా నోట్సే తీసుకోడానికి కారణం!'' కొంచెం కటువుగానే అడిగాను.

''సారీ! మీ నోట్స్ బాగా ఉంటాయని అడిగాను. మీకు కష్టంగాఉంటే మానెయ్యొచ్చు. చొరవ తీసుకొని అడిగినందుకు క్షమించండి!'' ఆవేశంతో మాట్లాడింది అనూరాధ.

నేను తొందరపడి ఆమెతో నిష్కర్షగా మాట్లాడినందుకు నొచ్చుకున్నాను. ఆమెకు క్షమాపణలు చెప్పుకుని నోట్సు యిచ్చాను. థాంక్స్ చెప్పి ఆమె పోయింది. నాలో ఏవేవో ఆలోచనలు తలలెత్తాయి.

రవి లవ్‌లెటర్ వ్రాసినందుకే ఆమెకు వాడిమీదంత కోపమొచ్చిందే! ఒక వేళ యీమెకు అసలు విషయం తెలిసినట్లైతే ఎంత బాధ పడుతుందో! ఆమె బాధ పడాలి. అప్పుడే ఆమెకు రవి పైన సదభిప్రాయం కలుగుతుంది. నాకు కావలసిందీ అదే. అప్పుడే నా మనసుకు నిజమైన ఆనందం, తృప్తీ కలుగుతాయి. మళ్ళీ ఆమె కనుపించినప్పుడు అసలు విషయం చెప్పి ఆమెకు రవిపైగల ఏహ్యభావాన్ని నిర్మూలించాలనే నిశ్చయానికి వచ్చాను.

* * *

కన్నుల విందుగా కలకల్లాడే బీచి ఆరోజు తండ్రి కోపానికి గురైన బిడ్డలావుంది. అక్కడక్కడ పల్చగా ఉన్నారు జనం. మధ్య మధ్య ఉరుముతోంది. ఎప్పుడైనా వాన రావచ్చు. నా మనస్సు కూడా అదే విధంగా ఉంది. ఏదో చెప్పలేని భయం, ఆందోళన నన్నావరించింది. నే చేసిన పని తప్పేమీ కాదు. నేను సరైన పనే చేశాను. ఆమె బాధ పడడమే నాకు కావల్సింది. ఇంతలో పెద్ద ఉరుము ఉరిమింది. నా ఆలోచనలు తెగిపోయాయి. ఎక్కడో పిడుగుపడి ఉండాలి. దూరంగా సముద్రంలో తేలుతున్న నావలు కెరటాలతోపిడికి ముందు వెనుకలకు ఊగుతూ ఎప్పుడు మునిగిపోతాయో నన్నట్లున్నాయి. ఎంత త్వరగా వడ్డుకు వద్దామన్నా అవి రాలేకపోతున్నాయి. నా మనస్సులో ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి.

ఆరోజు నన్ను బీచిలో 'స్కాండల్ పాయింట్' దగ్గర కలుసుకోమని అనూరాధకో చీటీ రాసి నోట్సులో పెట్టిచ్చాను. డైరెక్టుగా రమ్మని అడిగితే ఏమైనా అనుకుంటుందని భయమేసింది. కొంపదీసి ఆ స్లిప్ కూడా తీసికెళ్ళి ప్రిన్సిపాలుగారి కివ్వదుగదా!

ఇంతలో ఆమె వచ్చింది.

''మాట ప్రకారం వచ్చేశారే! కూర్చోండి'' అన్నాను ధైర్యంగా. ఆమె నాకు కొద్ది దూరంలో కూర్చుంది.

''ఎందుకు రమ్మన్నారో చెప్తారా?'' ఆమె ప్రశ్నించింది.

''ఓహ్ ...... అసలు విషయం మీకు చెప్పలేదుగా. మిమ్మల్ని నేనీ విధంగా రమ్మన్నందుకు మన్నిస్తారనుకుంటా!'' అన్నాను.

''పరవాలేదు చెప్పండి'' అభయమిస్తున్నట్లుగా అంది.

''మనం కొన్ని కొన్ని సందర్భాల్లో చాలా తెలివైన వాళ్ళలా ప్రవర్తిస్తాం అనుకుంటాం. మీరేమంటారు?'' అన్నాను ఆమె కేసి చూస్తూ.

''అవును. అందులో ఆశ్చర్యం ఏముంది?'' అంది అమాయకంగా.

''కాని మన ఆ తెలివైన ప్రవర్తనయొక్క పరిణామం దారుణంగాఉంటే మనస్సు ఏ విధంగా ఉంటుందంటారు?''

''తప్పటడుగు వేశామేమోనని బాధపడతాం''

''ఆబాధవల్ల మనస్సుకి కాస్త శాంతి ఉంటుందంటారా?''

''చేసిన తప్పు తెలుసుకొని పశ్చాత్తాపపడినవాడే మనసుకు శాంతి ఉంటుంది. అయినా యీ ప్రశ్నలు ఎందుకడుగుతున్నారో అర్థం కావటం లేదు. మీరు నన్నెందుకు రమ్మన్నారో చెప్తే త్వరగా

పోతాను. అసలే వర్షం వచ్చేటట్లుంది."

"అవును. ఈ ఉపోద్ఘాతమంతా ఆ విషయానికి నాందీ ప్రస్తావన" అంటూ మరో ప్రక్కకు తిరిగి చెప్పడం ప్రారంభించాను.

"మీకు రవి తెలుసుననుకుంటాను. బహుశా ఆ వ్యక్తిని మీరు ఏనాడో మర్చిపోయి ఉంటారు. కాని అదే వ్యక్తి ఎందరో మనస్సులకు హత్తుకుపోయాడు. నిజా నిజాలు తెలుసుకోకుండా తాత్కాలికోద్రేకంలో అంతా వాడిని అధోగతి పాలు చేశారు. నాకు తెలుసు మీకు రవిమీద ఎంత కోపం వుందో. పౌరుషంఉన్న స్త్రీ అలా చెయ్యడంలో తప్పులేదుకాని, కొంచెం వివేకం ఉపయోగించవలసింది. మీరు చదువుకున్నవారు. విజ్ఞాన సంపన్నులు. ప్రపంచాన్ని అర్థం చేసుకొన్నవారు. మీరంత అజ్ఞానంతో ప్రవర్తించడం నాకేం బాగా లేదు. ......"

"అంటే మీ ఉద్దేశ్యం ప్రకారం గౌరవంగాను, మర్యాదగాను బ్రతుకుతున్న ఆడ పిల్లలకి ప్రేమ లేఖలు వ్రాయటం తప్పులేదంటారు. ఆలోచించండి. ప్రశాంతమైన సరస్సులాఉన్న ఒక స్త్రీ జీవితంమీద రాయి విసురుతే ఆమె గతేం కాను? నా విషయంలో అంతే జరిగింది. లేఖ నాకు వ్రాసి, యడ్రసు మరొకరిది వ్రాశారు రవి. ఇదేమైనా మర్యాదగా ఉందా?"

"ఏమిటీ!" అన్నాను ఆశ్చర్యంగా.

"అవును. లేఖ పూర్తిగా వ్రాసి నా ఫ్రెండు సరళ యడ్రసు వ్రాశారు. నలుగురిలోను నవ్వుల పాలయ్యాను. నా ఆత్మాభిమానం దెబ్బతింది. వెంటనే ఆ లేఖ ప్రిన్సిపాలు గారికిచ్చాను. ఇదేమైనా తప్పా? చెప్పండి. ప్రేమలేఖ వ్రాయడమే తప్పు కాకుండా పైగా యడ్రసు మరొకరిది వ్రాయడం తప్పుకాదా? చెప్పండి రామంగారూ!" అంది.

నేనేమని సమాధానం చెప్పను? ఈ సంగతి మా కెవ్వరికీ తెలియదే! అలాంటి సందర్భంలో ఆమె రిపోర్టు యివ్వడం అసందర్భంగాదు. ఆమె నిశ్చలంగా నా వైపే చూస్తోంది. కాని ఆ చూపు నాకో సవాలనిపించింది.

"ఒక వేళ నిమ్మల్ని అల్లరిపాలు చేసిన వ్యక్తి రవి కాకుండా మరొక వ్యక్తి అవుతే......"

"అంటే మీ ఉద్దేశ్యం ప్రకారం రవికి యీ విషయంలో ప్రమేయం లేదంటారా?"

"అక్షరాలా రవికేం సంబంధంలేదు. అయినా ఆలోచించండి. రవి మిమ్మల్ని ఎప్పుడైనా యేమైనా అన్నాడా? మీ వెనువెంట తిరిగాడా? మిమ్మల్ని ఎప్పుడైనా గేలి చేశాడా? అటువంటిది మీకొక ప్రేమలేఖ వ్రాసాడంటే మీరేమైనా ఆలోచించారా?"

"మరి ప్రిన్సిపాలుగారి దగ్గర తనే వ్రాసానని ఒప్పుకున్నారు"

"అందులో అబద్ధం ఏమీ లేదు. ఆ లేఖ వ్రాసింది వాడే. కాని ఆ లేఖని మీరు పూర్తిగా చూడలేదు. సరిగా చూస్తే మీకే అర్థం అవును. లేఖ పూర్తిగా రవే వ్రాశాడు. కాని మీపేరు, క్రింద రవి పేరు, యడ్రసు, పైన సరళ యడ్రసు మరొక వ్యక్తి వ్రాశాడు."

"నా కివేం అర్థమవటంలేదు. కొంచెం వివరంగా చెప్పండి"

"ఆ వివరాలు చెప్పడానికే మిమ్మల్నిక్కడకు రమ్మన్నాను. మీకు లేఖ వ్రాసినంత మాత్రంచేతనే అవమానంపొందినట్లు కుమిలిపోయారు. అలాగే ఒక ప్రాణస్నేహితుని జీవితం నాశనమైపోయిందని ఎప్పుడూ కుమిలిపోతున్నాను నేను. స్వతంత్రంగా ప్రవహించే నదికి ఆనకట్ట కట్టినట్లయింది రవి జీవితం. అలాగే మీ యీ సంఘటన రవి పురోభివృద్ధికి అడ్డుపడింది. ఆర్థిక స్తోమత లేకపోయినా బిడ్డ అభివృద్ధికోసం ఆకన్నతండ్రి అష్ట కష్టాలుపడి చదివిస్తూంటే, మీ యీ సంఘటనతో ఆ తండ్రి నేలంట నరికిన మ్రానులా కూలిపోయాడు....."

"అసలు విషయం చెప్పమంటే ఆవేశంగా మాట్లాడతారేమిటండీ రామంగారూ."

"అవును. ఆవేశమే. ఒక్క లేఖ చూడగానే

---

డాక్టర్ :- మీ నాడి గడియారంవలె ఖచ్చితంగా పని చేస్తున్నది. భయంలేదు.

రోగి :- కాని డాక్టర్, మీరిందాక నా చేయి చూడ్డానికి బదులు నా రిష్టువాచీపై చేయి వుంచారేం?

ఎ. వంకటరెడ్డి (సిద్ధిపేట)

---

మీ జీవితం నాశనమైపోయిందని బాధ పడ్డారే! వాస్తవంగా జీవితం నాశనమైంది రవిది. నేరం ఒకరిది, శిక్ష మరొకరికి. నా యీ బాధ అణచుకోలేను రాధాదేవీ......క్షమించండి. ఆవేశంలో అసలు విషయం మర్చిపోయాను. ఇప్పుడు చెప్తాను వినండి.

"రవి, నేను, రాజా ఒకే రూంలో ఉంటున్నాం. ఒకనాడు బీచిలో మీరు, సరళ మరొక యిద్దరమ్మాయిలు ఉండగా మేం ముగ్గురం మిమ్ములను చూడ్డం తటస్థించింది. రాజా సరళను ప్రేమించానన్నాడు. తనకొక ప్రేమలేఖ వ్రాసి యిమ్మని రవిని అర్థించాడు. ఒక స్నేహితుడుగా సహాయం చెయ్యమన్నాడు. రవి కథకుడు. అలాగే నన్నాడు. ఆరోజు రాత్రే నా సమక్షంలోనే యీ లేఖ వ్రాయబడింది. కాని ఎవరికి సంబోధించేదీ, ఎక్కడకు పంపేదీ, ఎవరు వ్రాసిందీ మాత్రం రవి వ్రాయలేదు. రాజా తన స్వహస్తాలతోనే వ్రాసుకుంటానన్నాడు. అప్పుడు మిత్రుడుగా రవి తన కర్తవ్యాన్ని నిర్వహించాడు. కాని విధి ఎదురైంది. రెండు రోజుల తర్వాత రవి ఒక పుస్తకం తిరిగి ఇవ్వడానికి లైబ్రరీ కెళ్ళినప్పుడు అక్కడ క్లర్కు అందులో కొన్ని కాగితాలు లేకపోవడంచూసి ఆ సంగతి లైబ్రరియన్‌గార్కి రిపోర్టు చేశాడు. ఆయన యితన్ని నానా చివాట్లుపెట్టి ఏభై రూపాయలు కట్టమన్నారు. ఈ పని కూడా రవి చేయలేదంటే మీరు నమ్మరు. ఈ పని రాజా చేశాడు. అసలే డబ్బు లేక బాధపడుతున్న రవి 'యీ పుస్తకంలో కాయితాలెవరైనా చింపారా' అని రాజా నడిగాడు. దాంతో రాజాకు కోపమొచ్చింది. ఇతన్ని ఎలాగైనా అవమానపరచా లనుకున్నాడు. ఎవరికీ సంబోధించని ప్రేమలేఖ దొరికింది. సంబోధన ఒకరికి చేసి, యడ్రసు మరొకరిది వ్రాస్తే యీ లేఖ నలుగురిలోను పడి సంబోధించబడిన వ్యక్తి అల్లరిపాలు అవుతుందనిన్నీ, ఆ వ్యక్తి వెంటనే ప్రిన్సిపాలుకు రిపోర్టు చేస్తుందనిన్నీ, దాంతో రవిమీద ప్రిన్సిపాలుగారు యాక్షను తీసుకుంటారనిన్నీ ఊహించే యీపని చేశాడు. అక్షరాలా అంతే జరిగింది. దానివల్ల రవి జీవితం నాశనమైంది......"

"మరి యీ సంగతి ప్రిన్సిపాలుగారి కెందుకు చెప్పలేదు?" అంది కన్నీళ్ళతో దీనంగా.

"మీ సమక్షంలోనేకదా రవి ప్రిన్సిపాలుగారి కాళ్ళమీదపడ్డాడు. నిజం చెప్పడాని కవకాశమిమ్మని ప్రాధేయపడ్డాడు. కాని ఆ రాతిగుండె కరగలేదు. స్త్రీలే నిజం చెప్తారని అనుకున్నారు. ఆనా డవకాశమిస్తే యీనాడింతవరకూ వచ్చేదేకాదు. ఇదీ జరిగిన కథ."

ఆమె కన్నీళ్ళు తుడుచుకోవడం చూసాను. తిరిగి ప్రారంభించాను.

"అనూరాధగారూ! కాలు జారిన తర్వాత చేసేదేమీలేదు. కాని కాలు జారిందని తెలుసుకుని తిరిగి జారిపోకుండా తగిన జాగ్రత్త తీసుకోవాలి. జరిగిందానికి మనమేం చెయ్యలేం. విధి వాడి కెదురుగా ఉంది. ఎప్పుడైనా మీకు రవి తలంపువస్తే మటుకు రెండు కన్నీటి బిందువుల్లు రాల్చండి. ఇదే నా ఆఖరి కోరిక. చొరవ తీసుకున్నందుకు మన్నిస్తారని అనుకుంటాను.

అది బీచ్ అని ఆలోచించకుండా "క్షమించండి రామంగారూ" అంటూ భోరున ఏడ్చేసింది అనూరాధ.

ఆమె హృదయం ఎంతో కోమలమైంది అనుకున్నాను. ఆమె తనలో తాను పశ్చాత్తాపపడడం ఆమె కళ్ళలో గ్రహించాను.

"సెలవ్! రామంగారూ!" అని కన్నీళ్ళు వత్తుకుంటూ భారంగా అడుగులు వేస్తూ వెళ్ళిపోయింది అనూరాధ.....

పరీక్షలు దగ్గరపడుతున్నాయి. మృత్యుముఖంలోకి పోతున్నట్లుగా ఉంది నాకు. బాహ్య ప్రపంచంతో సంబంధం లేకుండా కష్టపడి చదువుతున్నాం. పరీక్షలైపోయాయి. మిత్రుడు రవిని కలుసుకోడానికి కూడా వీల్లేకుండా నాన్నగారి టెలిగ్రాం చూసుకొని వెంటనే వెళ్ళిపోయాను. రవి దగ్గర నుండి అప్పుడప్పుడు ఉత్తరాలు వస్తూండేవి. కాని కొన్నాళ్ళ తర్వాత వచ్చిన ఒక శుభలేఖ నన్నాశ్చర్యచకితుణ్ణి చేసింది. రవికీ, అనురాధకీ వివాహం. ఉత్తర, దక్షిణ ధ్రువాలు కలిసాయనుకున్నాను. ఏ అనూరాధ ముందైతే అవమానింపబడ్డాడో ఆ అనూరాధనే తనదిగా చేసుకుంటున్నాడు రవి. ★

లేదు. పరాయివారి సొమ్ము నాకెందుకు. అతడే గనుక నాకు ఇంత సొమ్మును అప్పిచ్చినట్లో తప్పక నావద్ద పత్రం వ్రాయించుకొనే వాడు."

"నీవు అతనివద్ద అప్పు పుచ్చుకొన్నట్టు పత్రంగాని, ఋజువుగాని ఏమీ లేదన్నమాట?"

"అతడు ఈ పత్రంమీద వ్రాసినదంతా అబద్ధమని దీనివల్లనే ఋజువగుచున్నది నాకు హాని చేయగోరే అతడిట్టి అపనింద నామీద వేశాడు." అన్నాడా వర్తకుడు. "బీర్బల్" ఆలోచిస్తూ, అతన్ని పంపివేశాడు.

మరునాటి దినము "బీర్బల్" రెండు నేతిడబ్బాలను తెప్పించి అందులో ఒకడబ్బాను మొదటి వర్తకునకు పంపి దానిలోని నేతిని అమ్మిపెట్టవలసినదని గోరెను. అదే విధంగా రెండవ వర్తకునకుగూడా మరియొక నేతిడబ్బాపంపి, దానిని అమ్మి డబ్బు తనకు పంపించమని చెప్పెను.

ఆ వర్తకులిరువురు ఆనేతి డబ్బాలను తమ దుకాణములకు తీసుకొనిపోయి ఆనేతిని వెచ్చబెట్టి పరి

# నేతివర్తకుడు

(31-వ పేజ తరువాయి)

శుభ్రము చేయుటకు ఒక కుండలో పోసిరి. అట్లు చేయుచుండగా వారికి నేతిడబ్బాల అడుగుభాగమున ఒక బంగారు నాణెము కనిపించినది. మొదటి వర్తకుడు తక్షణమే ఆ నాణెము తీసుకొనిపోయి "బీర్బల్"కు ఇచ్చివేసెను. "బీర్బల్" అతనికి ధన్యవాదములు తెలిపి పంపివేసెను. ఆ వర్తకుడు నిజాయితీ పరుడని "బీర్బల్" గట్టిగా నిర్ధారణ చేసుకొనెను. రెండవ వర్తకుడు తనకు దొరికిన బంగారు నాణెము తానే తీసుకొని దాచివేయ దలచుకొనెను. అతడు తనకొడుకును పిలిచి "ఈ నేతిడబ్బా అడుగున నాకు ఈ బంగారునాణెము దొరికినది. దీనిని భద్రపరచి నేనడిగినప్పుడు తిరిగి నాకు ఇమ్ము" అని ఆ బంగారు నాణెమును తనకొడుకు చేతికిచ్చెను.

నేతిని అమ్మగా వచ్చిన డబ్బును ఇచ్చివేయుటకై ఇరువురు వర్తకులు "బీర్బల్" ఒద్దకు వెళ్ళారు. "బీర్బల్" మొదటి వర్తకునకు కృతజ్ఞత తెలిపి అతనిని పంపివేసెను.

రెండవ వర్తకునితో "ఈడబ్బాలో నేను రెండుశేర్ల నేతిని పోసి ఇచ్చితిని. కాని నీవు నాకు ఒక్కశేరు నేతి వెల మాత్రమే ఇచ్చితివి." అన్నాడు.

అందులకా వర్తకుడు "లేదు. ఆ డబ్బాలో ఒక్కశేరు నెయ్యి మాత్రమే ఉన్నది. నేనా నేతిని వెచ్చజేసినప్పుడు చూచినాను. ఆసమయంలో నా కొడుకుగూడా అచ్చటనే ఉన్నాడు" అని జవాబిచ్చెను.

"అయితే నేనే పొరబడి యుండవచ్చు. దయచేసి కొద్దిసేపు ఆగు" అని "బీర్బల్" లోనికిపోయి తన నౌఖరును పిలచి ఆ వర్తకుని చిరునామా అతనికిచ్చి "అతని కొడుకుతో అతని తండ్రి తనకు నేతి డబ్బాలో దొరికిన బంగారు నాణెము తీసుకొని రమ్మనమన్నాడని చెప్పు" అని చెప్పెను.

కొంతసేపటికి ఆ నౌఖరు ఆవర్తకుని కొడుకుతో తిరిగి వచ్చెను. ఆ వర్తకుడు తన కొడుకు అక్కడకు రావడం చూచి చాల ఆశ్చర్య పడ్డాడు.

"ఆ బంగారు నాణెం తీసుకొని వచ్చావా?" అని "బీర్బల్" వచ్చీ రావడంతో అతనిని ప్రశ్నించాడు.

అతడు తీసుకొనివచ్చినానని చెప్పి ఆ బంగారు నాణెమును తనజేబులో నుండి బయటకు తీసెను.

"ఆఁ! ఒక్కటేనా? ఆ నేతి డబ్బాలో రెండుబంగారు నాణెములు ఉన్నవని మీ నాన్న నీకు చెప్పలేదా?" అని బీర్బల్ ఆశ్చర్యం నటిస్తూ ప్రశ్నించాడు.

"నాన్నా! అందులో రెండు బంగారు నాణెములున్నవని నాతో ఎందుకు చెప్పలేదు. నాకు ఒక్క నాణెమే ఎందుకిచ్చావు?" అని అతడు తండ్రినడిగాడు.



చిత్రకారుడు : కలువకొలను సదానంద (పాకాల)

ఈ మాటకు ఆ వర్తకుడు చలించాడు. తాను పట్టుబడిపోయానని గ్రహించెను. అయినా అతడు తన నేరం కప్పిపుచ్చటానికి తనకొడుకుతో, "ఓరి తెలివితక్కువదద్దమ్మా! ఎవ్వరైనా బంగారు నాణెము తీసుకొనివచ్చి నేతిడబ్బాలో పెడతారా?" అన్నాడు.

అతనికొడుకు తన తండ్రి ప్రవర్తనకు చాల ఆశ్చర్యపడి ఇట్లనెను: "అదేమిటినాన్నా! ఆరోజున నీవు నేతిని వెచ్చబెట్టదలిచి ఆ నేతి డబ్బా నుండి ఒక బంగారు నాణెమును తీసి దానిని భద్రపరచమని నా చేతికిచ్చావు. అప్పుడే మరచిపోయావా"

"నీకు ఇదేమన్నా కలగాని వచ్చిందా ఏమిటి? అసలు సంగతి నాకిప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఆ బంగారు నాణెమును మన కొట్టువద్దకు వచ్చిన ఒక ఆసామి భద్రపరచమని నాచేతికిచ్చాడు." అన్నాడా వర్తకుడు.

"అది కలకాదు. వాస్తవమే. నేను నిన్ను పరిక్షించటానికే ఆ బంగారు నాణెమును అందు పెట్టాను." అన్నాడు "బీర్బల్." "అయితే జరిగిన విషయం ఏమిటో నేను మరచిపోయిఉంటాను. పరాయివారి సొమ్ము నాకెందుకు" అని తనకొడుకుతో, "అబ్బాయ్! ఆ బంగారు నాణెమును వారికిచ్చివేయి." అన్నాడు. "బీర్బల్" ఆ నాణెము తీసుకొని వర్తకునితో, "సరే నా నాణెమును తిరిగి నాకు ఇచ్చివేశావు. మరి నీ స్నేహితుని వద్ద అప్పుగా తీసుకొన్న వెయ్యిరూపాయల మాటయేటి?" అన్నాడు. ఆ మొదటి వర్తకుని పేరు విన్నతోడనే అతనికొడుకు ఆశ్చర్యముగా తన తండ్రితో, "ఇంకనూ నీవు అప్పుగా తీసుకొన్న ఆ వెయ్యిరూపాయలు నీ స్నేహితునకు తిరిగి ఇచ్చివేయలేదా?" అన్నాడు.

ఆ వర్తకుని మొగం మాడిపోయింది. అతనికొడుకు వేపుకోపంగా చూస్తూ, "నువ్వు నోరుమూసుకో" అని గద్దించాడు.

"బీర్బల్" జరిగిన సంగతంతా చెప్పమని ఆ వర్తకుని కొడుకును అడిగాడు. అతడు తన తండ్రి ఏవిధముగా మొదటి వర్తకుని వద్ద వేయిరూపాయలు అప్పుతీసుకొన్నాడో చెప్పి తన తండ్రితో తిరిగి ఆ డబ్బు అతని స్నేహితునకు ఇచ్చివేయమని చెప్పాడు.

"బీర్బల్" ఆ వర్తకునితో, "దీనిని బట్టిచూస్తే నీకొడుకు నీకన్నా వెయ్యిరెట్లు నిజాయతీగలవాడని తెలుస్తున్నది. అతనివద్ద ఒక గుణపాఠం నేర్చుకో. ఇప్పటికైనా నిజంచెప్పు," అని గంభీరంగా అన్నాడు.

"ఆ వర్తకుడు ఇక దాచిన ప్రయోజనంలేదని ఉన్నదంతా ఉన్నట్టు చెప్పేశాడు. తిరిగి ఆ డబ్బు తన స్నేహితునకు ఇచ్చిస్తాడనని చెప్పాడు. ఈ విధంగా "బీర్బల్" ఎవరు నిజాయితీపరులో, ఎవరు ద్రోహులో కనిపెట్టటంలో ప్రసిద్ధికెక్కాడు. ★

# మా పాపాయి

అచ్చి రఘురామరెడ్డి

ఎర్రని అర్కుడు తూర్పున వుదయించగ
ఎర్రని పద్మం ముదముగ వికసించుకదా!
నల్లని మేఘములు మెల్లమెల్లగ రాగ
నల్లని నెమిలి అల్ల నల్లగ నాడుకదా!
తెల్లని విరులు ఘుమఘుమ గుబాళించగ
తెల్లని మందహాసం తేటి చేయుకదా!
దబదబ ఆకసము నుండి వానకురవగ
గబగబ రైతులు పాట పాడుదురుకదా!
నవ వసంతకాలం రాగ
నవరాగాలు కోయిల తీయుకదా!
ఇంపైన నాగస్వరం వినిపింపగ
వెంటనే నాగులు వెలుపలకు వచ్చుకదా!
చల్లని నెలరాజు వెన్నెల గురిపింపగ
అల్లరి చేయుచు పిల్లలు ఆడుదురు కదా!
హోరున గాలులు వీవగ
జోరుగ వృక్షకోటి నాట్యం చేయు కదా!
మా పాపాయి ముద్దు పలుకులు ఒత్తి పలుకగ
మాలో హాసరేఖలు వుదయించు కదా!!"

త్నించాడేకాని, మనస్సులో రేగుతున్న ఆలోచనలతో పాటు పుటలు మళ్ళిపోతున్నాయి. అంతే.

"పోలయ్యలో ఇంత సంస్కారం, దాతృత్వం ఎలావచ్చాయి... ప్రతి మానవుడిలో ఇటువంటి సంస్కారం, దాతృత్వం ఏర్పడితే సమాజం ఎంత బాగుపడుతుంది......ఇటువంటి పోలయ్యను ఎంతమంది నరసింహప్పలు, చలమయ్యలు డబ్బుతో లొంగదీసుకోగలుగుతారు?........పోలయ్యను కన్నతల్లి ఎంత ధన్యాత్మురాలు!" అన్న ఆలోచనలు రాజారావులో మసకరిల్లాయి. ఇంతలో "బాబుగారూ!" అంటూ పోలాయి అక్కడకు వచ్చాడు.

కూర్చో పోలయ్యా—నీకోసమే చూస్తున్నా" తనుకూడా చాపమీద కూర్చుంటూ అన్నాడు రాజారావు.

నిన్నటి పాఠం నాకు సరిగా అర్థం కాలేదు బాబుగారూ" అన్నాడు పోలాయి.

"దానికేం మళ్ళీ చెబుతాలే! కాని ముందు ఆ కోపమేమిటో చెబుదూ"

"ఇన్నాళ్ళనుంచీ చెప్పడాని కెప్పుడూ సందర్భం రాలేదు. నిజంగా ఆరోజు తలచుకుంటే ఒళ్ళు జలదరిస్తుంది.....సరిగ్గా అయిదేళ్ళ క్రితం—ఇదే రోజు బాబూ? మా జగ్గడిని రజాకార్లు చంపేశారు. మీరు పత్రికల్లో చదివారో లేదో అప్పటి రజాకార్ల దురంతాలు. ఆ రోజు......"

...... ....

ఊళ్లో రైతులంతా పొలాలమీదకు వెళ్ళారు. ఇండ్లల్లో ముసలివాళ్ళు, పిల్లలూ ఉన్నారు. చేతిలో బాగా డబ్బున్నవాళ్ళు రజాకార్ల భయానికి ఊరు విడిచి వెళ్ళిపోనేపోయారు. అందువల్ల కొన్ని ఇండ్లకు తాళాలు తగిలించి ఉన్నాయి. మధ్యాహ్నం వేళకు ఓ పదిమంది రజాకార్లువచ్చి ఊరిమీద పడ్డారు. తాళాలువేసివున్న ఇళ్ళను పగులగొట్టి, పనికివచ్చే వస్తువు లన్నీ స్వాధీనం చేసుకున్నారు. పనికిరానివి విరగగొట్టారు. ఆ తరువాత మిగిలిన ఇండ్లమీద విరుచుకు పడ్డారు.

వాళ్ళు సాయుధులు!

ఒకరు, ఇద్దరు, ముగ్గురు ఎనిమిదిమంది యువతులను పోగు చేశారు. పశువుల కాళ్ళు బందాలు వేసినట్టు వాళ్ళ కాళ్ళకు బందాలువేసి నడిపిస్తున్నారు గుడి వైపుకు.

ఈ సంగతి ఎలా తెలిసిందో తెలిసింది—పొలంలో ఉన్న పోలాయికి.

మెరికల్లాంటి యువకుల్ని అయిదారుగురిని వెంటతీసికొని బయలుదేరాడు.

అందులో జగ్గడు కూడా ఉన్నాడు.

వీళ్ళనుచూసి మరికొందరు కూడా కఱ్ఱలు తీసుకొని బయలుదేరారు.

రజాకార్లు ఆడవాళ్ళను ఎఱ్ఱటిఎండలో నడిపించుకుంటూ ఆలయం దగ్గరకు చేరారు. అంతకు ముందే అర్చకుడు తాళాలు బిగించి 'బ్రతుకుజీవుడా' అని పారిపోయాడు. తాళాలు పగలగొట్టి లోపలకు ప్రవేశించి ముఖద్వారంలోపల బంధించారు.

బంధించి తీసుకు వెళ్ళిన యువతులను నంది చుట్టూ నిలబెట్టి బందాలు తొలగించారు.

"ఏయ్ అమ్మాయిలూ, ఇక్కడ మిమ్మల్ని ఆదరించేవాళ్ళు లేరు. మీరు అరచినా బయట

౮

(7 వ పేజీ తరువాయి)

ఎవరికీ వినిపించదు. మేము చెప్పినట్టువింటే బతికిపోతారు" అన్నాడు నాయకుడు.

ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారా యువతులు. వాళ్ళ చూపులే వాళ్ళ కప్పుడు అండ.

"మీ పల్లెపడుచులు బతకమ్మ ఆట బాగా ఆడతారంటగా....మీ ఆట మాకు చూపి పూరా ఆనందం కలిగించండి" అని మరొకడు అందుకున్నాడు.

నిస్సహాయులైన ఆ స్త్రీల ముఖాలలోని భయోత్పాతం, అవమానభారమంతా బయటపడే అవకాశం లేక కళ్ళవెంట తొంగి చూస్తున్నందున కుదిరిన కళ్ళ ఎరుపు ఆ రజాకార్ హృదయాలకు మదిరాపానం లాగా అయ్యాయి.

"ఓయి పరమశివా! నీ ఎదుటనేనా మాకీ పరాభవం!" అని ఆ స్త్రీలు లోలోపలే విలపించారు. వాళ్ళ హృదయాలు గిజ గిజ కొట్టుకున్నాయి.




"ఏదో ఒక మహత్తర దుష్టశక్తి మీ ప్రక్కమండి మిమ్మల్ని పీడిస్తోంది. అందుకే మీ రిలా చిక్కిపోతున్నారు."

శ్వేతపన్నగం బుసకొట్టి తోకపై నిలచినట్టు, వాళ్ళల్లోంచి ఒక స్త్రీ తెగించి మొండి ధైర్యంతో కొంచెం ముందుకు వచ్చింది.

"మీకూ పెళ్ళాలున్నారు. అక్కలూ, చెల్లెళ్ళున్నారు. వాళ్ళను మా మొగాళ్ళు ఇట్లా చేస్తే ఊరుకుంటారా మీరు?" అంది.

"మాకే నీతి సెబుతున్నాయే బేవకూఫ్" అంటూ ఒకడు ఆమె మీదకు ఉరికాడు. పమిట పట్టుకు గుంజుతున్నాడు. ఆమె పెనుగులాడుతున్నది. వాడినిచూసి మిగతా వాళ్ళు ఆ అబలమీద కురికారు. ఆడవాళ్ళు గట్టిగా అరుస్తూ, గర్భ గుడిచుట్టూ పరుగెత్తుతున్నారు. వాళ్ళవెంట ఆ ముష్కరులు పరుగెత్తుతున్నారు. ముఠా నాయకుడు మధ్యలో నిలబడి మొదట ఎదిరించిన స్త్రీని బలాత్కరిస్తూ మధ్య మధ్య పగలబడి నవ్వుతున్నాడు. ఈ హడావిడిలో పోలాయిముఠా లోపలకు ఎప్పుడు వచ్చిందీ ఎలా వచ్చిందీ కూడా వాళ్ళు గమనించలేదు.

మండపం దగ్గర పెట్టిఉన్న రజాకార్ల ఆయుధాలపై మొదట పోలాయి దృష్టి పడింది. వాటిని తనవాళ్ళచేత గుడిలోని బావిలో పడవేయించాడు పోలాయి.

ముఠానాయకుడు బలాత్కరిస్తున్న స్త్రీయే పోలాయిని చూచి "పోలయన్నా" అని కేక వేసింది. ఆ దృశ్యాన్ని చూచి పోలాయి శివమెత్తిపోయాడు. ఒక్క పరుగులో పోలాయివెళ్ళి ముఠా నాయకుణ్ణి బాణాకర్రతో మోకాళ్ళమీద మోదాడు. "అరె—అల్లా" అంటూనే వాడు జేబులోంచి రివాల్వర్ తీశాడు. ఈ లోపల పోలాయి ముఠాలోని జగ్గడు మొదలైన వాళ్ళు మిగతా వాళ్ళ మీదకు దూకారు.

రజాకార్ల ముఠా నాయకుడు రివాల్వరు పైకి తీసేప్పటికి పోలాయి బాణా కర్రతో ఏమీ పాలుపోక అట్లాగే నిలబడిపోయాడు. ఇది కనిపెట్టిన ఆ స్త్రీ వెనక్కు వెళ్ళినట్టు వెళ్ళి ధైర్యంతో నాయకుడి చేతిమీద బలంగా కొట్టేప్పటికి రివాల్వరు క్రింద పడింది. వెంటనే పోలాయి దాన్ని అందుకున్నాడు. కాని అది ఎట్లా ఉపయోగించాలో పోలాయికి తెలియదు. అందువల్ల దాన్ని కాస్త దూరంలో ఉన్న బావిలోకి విసిరేశాడు. ముఠానాయకుడు ఎగిరి పోలాయి చేతిలోని బాణాకర్ర దూరంగా పడేట్టు తన్నాడు. ఇద్దరూ కలియబడ్డారు. గుద్దుకున్నారు. తన్నుకున్నారు.

చివరకు నిరాయుధులైన రజాకార్లు వీళ్ళ ముందు ఏమీ చేయలేక పారిపోదామని ప్రయత్నిస్తున్న స్థితి వచ్చింది. ఆడవాళ్ళు గుడికి వెనక మార్గం దగ్గరకు పరుగెత్తారు. ఇంతలో ప్రక్క గ్రామంలో దోచుకొని వస్తున్న మరో రజాకార్ల ముఠా అక్కడకు జీపు కారులో వచ్చి దిగింది.

వాళ్ళంతా సాయుధులు!

వాళ్ళను చూసేప్పటికి పోలాయి ముఠాలోని వారి గుండెలు జారిపోయాయి. మారణహోమం తప్పదనుకున్నారు. పోలాయి జగ్గడికి ఏదో కళ్ళతో సైగ చేసి ఆడవాళ్ళు వెళ్ళిన దిక్కుకు పరుగెత్తి వాళ్ళను తొందరపెట్టి వెనక దారివెంట బయటకు తీసుకువెళ్ళి నరసింహప్పదొరవారి బంగళాకు దగ్గర తోవన తీసుకుపోయాడు. దొరవారు బంగళాముందు అప్పుడే కారులోంచి దిగారు.

"ఊరిమీద రజాకార్లు పడ్డారు దొరవారూ! ఆడవాళ్ళ మానప్రాణాలు దక్కడంలేదు. తొందరగా కౌలులు మావతో తలుపులు తెరిపించండి" అన్నాడు పోలాయి.

ఆ కబురు నరసింహప్ప దొరవారిని కదలించింది. వెంటనే తలుపులు తెరిపించాడు. ఆ రోజు ఊళ్ళోని ఆడవాళ్ళు చాలామంది నరసింహప్ప ఇంటిలో తల దాచుకొని మానప్రాణాలు దక్కించుకున్నారు. ఊళ్లోఉన్న కారపు కుండలన్నీ నరసింహప్ప ఇంటిలో చేర్పించాడు పోలాయి. రజాకార్లువస్తే కళ్ళల్లో కారం చల్లాలని ఆడవాళ్ళు, రాళ్ళవర్షం కురిపించాలని మొగవాళ్ళు సిద్ధంగా ఉన్నారు.

గుడిలో జగ్గడు తన ముఠాతో శక్తి ఉన్నంత వరకు ఎదిరించాడు. కాని సాయుధులైన పిశాచాల శక్తిముందు వాళ్ళు ఎంతోసేపు నిలవలేకపోయారు. పారిపోతున్న వారిని రజాకార్లు వెంబడించారు. ఆ సమయంలో ఎటు పరుగెత్తుతున్నారో వాళ్ళకే

తెలియదు. జగ్గడి ముఠాలోనివారు చెల్లాచెదరై పోయారు. ముఠా నాయకుడు జగ్గడిని వెంబడించాడు. ఒక రజాకారు గురి చూసి ఒక బరిసెను పారిపోతున్న జగ్గడివీపుకు విసిరాడు. అది వెళ్ళి సరిగ్గా వెన్నులో గుచ్చుకుంది. ఆ క్షణంలోనే ముఠా నాయకుడు రివాల్వర్ పేల్చాడు. దానితో జగ్గడు కుప్పలా కూలి ప్రాణం విడిచాడు. జగ్గడు బలియై పోయిన చోటనే సమాధి చేయించారు గ్రామస్థులు.

కొందరు రజాకార్లు నరసింహప్పదొర, చలమయ్య దొరల బంగళాలమీద విరుచుకుపడ్డారు. అంతకుముందే దొరలు తమ కుటుంబాలను ఇతర ప్రాంతాలకు తరలించారు. చలమయ్య దొర ఇంటిలోని సామానులను దోచుకున్నారు.

నరసింహప్ప దొర బంగ్లాలో జొరబడటానికి రజాకార్లకు ఓ పట్టాన శక్యంకాలేదు. ఆడవాళ్ళు చల్లుతున్న కారం కళ్ళలోపడి మార్గం కనుపించడంలేదు. మొగవాళ్ళు విసురుతున్న రాళ్ళు వాళ్ళను హైరానం చేస్తున్నాయి. కొంతమంది రజాకార్లు లోపలకు తుపాకులు కాల్చారు. కొందరు వేరే మార్గంగుండా లోపలకు జొరబడ్డారు. అది పోలాయి పసికట్టి కొంతమంది యువకులను అటు మళ్ళించాడు. దొరవారి కేమీ హాని కలగకుండా చూడటానికి తను ఇంకొకడిని తీసుకొని బయలుదేరాడు.

రజాకార్లు లోపలకు జొరబడేప్పటికి నరసింహప్ప హడలిపోయాడు. "ఇవ్వాళ చావు తప్ప" దని బెంబేలుపడ్డాడు. "ఇన్నాళ్ళనుంచీ లేనిది ఇవ్వాళ్ళే పట్నంనుంచి రావాలా నేను" అని విచారించాడు.

ఇంతలో హుటా హుటి ఒక రజాకారు నాయకుడు నరసింహప్ప గదిలోకి పెనుగాలిలా చొచ్చుకు వచ్చి పిస్తోలు చూపించి "తియ్యి— డబ్బెక్కడుందో......" అని గర్జించాడు.

నరసింహప్ప వణికిపోయాడు.

"ఇం....ట్లో....డబ్బేం......లేదు" మాటలు తడబడ్డాయి నరసింహప్పకు.

ఇంతలో పోలాయి ఉప్పెనలావచ్చి బాణాకర్రతో పిస్తోలు పట్టుకున్న చేతిమీద బలంగా కొట్టాడు. వాడు పోలాయిమీద కలియపడ్డాడు. క్రింద పడిన పిస్తోలును నరసింహప్ప అందుకున్నాడు.

ఆ నాయకుణ్ణి వెల్లకిలా క్రింద పడేసి రొమ్ముల మీద కూర్చున్నాడు పోలాయి. 'శక్తీ శక్తీ' మని వాడితల గచ్చుమీద కొడుతూంటే అరుస్తున్నాడు వాడు. ఇంతలో మరికొందరు రజాకార్లు అక్కడకు చేరి పోలాయిమీద లంఘించారు. క్రిందపడిన వాడిని వదిలేసి పోలాయి వాళ్ళను ఎదుర్కొన్నాడు. బాణాకర్ర అందుకొని గిరగిర తిప్పుతూ వాళ్ళను చెదరగొడుతున్నాడు. పోలాయి ధైర్యానికీ, చాకచక్యానికీ నరసింహప్ప ముగ్ధుడైపోయాడు. ఒకడు పోలాయిని దొంగవాటుగా బరిసెతో పొడవబోయాడు. నరసింహప్ప అది కనిపెట్టి "ఖబర్దార్" అంటూ పిస్తోలు చూపించాడు. ఆ క్షణంలోనే పోలాయి ముఠాలోని కొందరు కర్రలతో అక్కడకు దూకేప్పటికి రజాకార్లు నేర్పుగా వాళ్ళను ఎదుర్కొన్నట్టే ఎదుర్కొని ఒక్కొక్కడే వచ్చిన దారి పట్టారు. అంతకుముందే కొందరు రజాకార్లు కళ్ళల్లో కారం, రాళ్ళ వర్షంతో కారెక్కి పారిపోయారు. పోలాయి బారినుండి తప్పించుకు బైటపడ్డవాళ్ళు మరో జీపులో తుర్రుమన్నారు.

"నీ ఋణం ఎలా తీర్చుకోను పోలాయ్!" అంటూ నరసింహప్ప పోలాయిని కౌగలించుకున్నాడు.

"నేనేం చేశాను దొరా!" అన్నాడు వినయంగా పోలాయి.

* * *

"అదీ కథ బాబుగారూ! ఆరోజు జగ్గడిని నావెంట తీసుకుపోకున్నట్లయితే ఆ జానకమ్మ పసుపుకుంకుమ చల్లగా ఉండేదిగా. జగ్గడు చనిపోయేప్పటికి వాడి కొడుక్కి ఎనిమిదేళ్ళు పాపం. జగ్గడు పోయిన తరువాతనే రెండో కొడుకు మశూచికంపోసి చచ్చిపోయాడు. ప్రతి సంవత్సరం జగ్గడు చచ్చిపోయిన రోజు సాయంత్రానికల్లా ఎక్కడున్నా సరే జానకమ్మవచ్చి వాడి సమాధిమీద పూలుచల్లి దీపం వెలిగించిపోతుంది బాబూ! జగ్గడు పోయినప్పటినుంచి ప్రతి ఏడూ జానకమ్మకు నాకు చేతనైంది ఇస్తున్నా" అని ఆగాడు పోలాయి.

"పోలయ్యా! నిజంగా నీలో దేవుడున్నాడు" అన్నాడు రాజారావు.

"నన్ను పొగడ్తున్నారా బాబూ! చిన్నవాళ్ళను పెద్దవాళ్ళు పొగడకూడదని మీరేకాదు బాబూ ఒకసారి అన్నారు."

"దేవుడు నీకు మేలు చేస్తాడు పోలయ్యా. నీవు వృద్ధిలోకి వస్తావు"

"అదంతా మీ చలవ బాబూ!......పొద్దుపోయింది. ఇంక పడుకోండి.......పాఠం రేపు చెబుదురుగాని లెండి" అంటూ పోలాయి తన పక్క పరుచుకున్నాడు.

(సశేషం)

---

హిందీకి మాత్రమే వుంది అనేవాదన ఒకటి. దీని సంగతి భవిష్యత్తుకు వదలాలి. ప్రస్తుతానికి ఇంగ్లీషును కాదనరాదనే ప్రతివాదన రెండవది. ఈవాద ప్రతివాదన చివరకు ఉత్తరాది—దక్షిణాది భేదాలను తెచ్చింది. స్వరాష్ట్ర భాషాభిమానాన్ని సంకుచితత్వంకింద తేల్చింది. భాషా రాష్ట్రోద్యమాన్ని విచ్ఛిన్నశక్తిగా వర్ణించింది. అల్లర్లు, ద్వేషాలు పెంచింది. అయినా చివరకు భాషా రాష్ట్రాల నిర్మాణానికి అంగీకరించక తప్పలేదు. ఉత్తర భారతంలో నేటికీ ఇందుకు సంబంధించిన కల్లోలాలు సాగుతూనే వున్నాయి.

మూడవది. గతంలో కుల, మతాభిమానం దేశాన్ని నాశనం చేసింది. ఇకముందు కూడా చేస్తుంది. కనుక దేశాభివృద్ధికిగాను వీనికి అతీతంగా వుండాలని ప్రచారం. కాని ఆచరణలో, ఉద్యోగాలలో, భూముల పంపిణిలో, పదవులు పొందడంలో రిజర్వేషనులు, కుల మతవర్గ ప్రాతినిధ్యాలు తప్పడంలేదు. కులం, మతం ఆసరాలు రాజకీయ జీవితానికి అవసరమనే స్థితి చెల్లుతున్నది.

నాల్గవది. ఆర్థిక రీత్యా వెనకబడిన తనమనే దానిని ప్రాంతాల వారీగాను, వర్గాలవారీగాను పరిగణించి, దానిని తొలగించడానికి ప్రయత్నించాలనేది పంచవర్ష ప్రణాళిక అమలుకు ప్రధాన సూత్రం. కాని ప్రాజెక్టుల నిర్మాణంలో, పరిశ్రమలు నెలకొల్పడంలో, ఉద్యోగాలు యివ్వడంలో, విద్యావకాశాలకల్పనలో ఆర్థిక రీత్యాకాక, కులం, మతం, రాజకీయ బలాలు ప్రధానంగా వుంటున్నాయి. పూర్వం ముస్లింలను, ఆంగ్లో — ఇండియనులను,

(23-వ పేజీ తరువాయి)

పార్శీలను, శిక్కులను చూచి ఈర్ష్యపడితే ఇప్పుడు హరిజనులను, గిరిజనులను చూచి అసూయపడవలసిన స్థితి సవర్ణులందరికీ కలిగింది.

అయిదవది: వర్గదృష్టిని, వర్గ ద్వేషాన్ని కమ్యూనిస్టులు పెంచుతున్నారని ఒక వైపున విమర్శలు, కాని సంస్థానాలు జమీందారీలు రద్దులోను, భూస్వామ్య కౌలుదారీ శాసనాలలోను వర్గదృష్టిని, వర్గద్వేషాన్ని తప్పనిసరి చేస్తున్నారు.

ఇలా ఈ అయిదు రకాల ధోరణులు ఈనాడు జాతి పరిపూర్ణస్థితిని అందుకొనడానికి అవరోధం కలిగిస్తున్నవి. దేశంలో విచ్ఛిన్నశక్తులుగా పేర్కొంటున్న ధోరణులన్నీ వీనిలోనే వున్నాయి. అయితే ఇవి ఎలా ఏర్పడ్డాయి అని ప్రశ్నిస్తే అధికార పక్షంగా కాంగ్రెస్‌పార్టీ గత పన్నెండేళ్ళగా రాజకీయ దండాన్ని ప్రయోగించిన పద్ధతులవల్లనే వీని సృష్టి జరిగిందని చెప్పక తప్పదు.

మత ప్రాతిపదికపై దేశవిభజనకు అంగీకరించిన కాంగ్రెసుపార్టీ, మతాల రీత్యా అల్ప సంఖ్యాక వర్గాలుగా వున్నవారిని ఆకర్షించలేకపోయింది. భాషల రీత్యా రాష్ట్రాల పునర్నిర్మాణానికి సమ్మతించిన కాంగ్రెసు పార్టీ భాషలరీత్యా అల్ప సంఖ్యాకవర్గాల రక్షణ ఏర్పాట్లు చేయలేకపోయింది. కుల మత వర్గ దృష్టి తగదని చెప్పే కాంగ్రెసుపార్టీ రాజకీయ ప్రాతినిధ్యంలో, ఉద్యోగాల కేటాయింపులో విద్యావకాశాల కల్పనలో ఆర్థికవనరులు చూపడంలో కులం, మతం, వర్గం ప్రాతిపదికగా ప్రభుత్వ విధానాలను రూపొందించి అమలు జరుపుతూ వున్నది. ముందుగా పార్టీ ప్రయోజనాలకోసం, ఆ తర్వాత పార్టీలో నాయకత్వానికి వచ్చిన స్వార్థం కోసం ఇలాంటి ద్వంద్వ స్థితిని—చెప్పేది ఒకటి, చేసేది మరొకటి— కాంగ్రెసు పార్టీ దేశంలో పెంచింది. ఇది అటు ప్రజలను, ఇటు పార్టీలోని సామాన్య సభ్యులను సంకట స్థితిలోవుంచి, మానసికమైన చికాకును కలిగిస్తున్నది. ఆలోచనల తీరును సంకుచితం చేస్తున్నది.

అయితే ఇక్కడే మనం మరొక సంగతి కూడా చెప్పుకోవాలి. దేశంలో గత పదమూడేళ్ళగా కాంగ్రెసుపార్టీ పాలన సాగింది. కనక ఈ పరిణామాలన్నింటికి ప్రధాన బాధ్యత దానిదిగానే పరిగణిస్తున్నాము. కాని నిజమాలోచిస్తే దేశంలోని పరిస్థితులు కూడా ఈ పరిణామాలను తప్పనిసరి చేస్తున్నాయి. మన సంస్కృతినిగురించి, నాగరికతను గురించి, పూర్వపు గొప్ప తనాన్ని గురించి మనమెంతగా కీర్తించుకున్నా, కుల, మత, వర్గ విభిన్న భావాలనేవి కట్టులో, బొట్టులో ఆహార విహారాల్లో జీవిత పద్ధతుల్లో తర తరాలుగా మనలో జీర్ణించి వున్నాయి. పౌరజీవితంలో సంగతి ఎలావున్నా, వ్యక్తిగతమైన ఆచారాలలోను, అభిప్రాయాలలోను గృహ జీవితపు హద్దులలోను కులానికి, మతానికి మనం సన్నిహితులమే కాని అతీతులంకాదు. అంతే కాదు. మన చుట్టూ సృష్టించుకొనే వాతావరణంలో కూడా వృత్తి, వ్యాపార ఉద్యోగాలలో కూడా






## జాతి పరిపూర్ణత...

ఎంతో కొంతగా వీని పలుకుబడి, ప్రభావం తప్పని సరిగా వుంటున్నది.

అయితే జాతీయోద్యమం ఘుమ్మరంగా సాగిన రోజుల్లో వీని ప్రభావం అంతగా కనిపించలేదు. వీనికి అతీతులుగా వ్యవహరించడం నాయకత్వ లక్షణం గావుండేది. కాని ఇప్పుడు, ప్రజాస్వామ్యం పుణ్యమా అని వీనికి అనుకూలురుగా వ్యవహరించడం రాజకీయమైన మనుగడకు అవసరమవుతున్నది. ఇందులో కాంగ్రెసు, కమ్యూనిస్టు, సోషలిస్టు అనే భేద మెంతమాత్రంలేదు. అన్ని పార్టీలవారు దీనికి సమానంగా దాసులే. ప్రజాస్వామ్యమనే దానికి సంఖ్యా వాచకంగా అర్థం చెప్పుకొని, హెచ్చు ఓట్లు సంపాదించడమనే ఆలోచనతో రాజకీయాలను నడుపుకుంటున్నందున దేశానికి వచ్చిన నష్ట మిది. వయోజన ఓటింగ్ హక్కు అనేదానివల్ల వచ్చిన ఫలిత మిది. ఇందుకు కేవలం కాంగ్రెసు పార్టీని మాత్రమే నిందించి, విమర్శించి లాభం లేదు.

ఉదాహరణకు. ఇది ఎన్నికల సమయం. వచ్చే అయిదేళ్ళు దేశపాలకులను ఎన్నుకొనడానికి అన్ని పార్టీలు సన్నాహాలు చేస్తున్నాయి. అభ్యర్థుల నిర్ణయానికి ఆయత్తమవుతున్నాయి. ఇందులో ప్రజాప్రతినిధికి కావలసిన ప్రాథమికమైన అర్హతలు, దక్షత, విజ్ఞత (ఇవి రాజ్యాంగంలో ఉదాహరించకపోవడం పెద్ద లోపం) విషయ పరిజ్ఞానం వగైరాలు గురించి ఎవ్వరూ ఆలోచించరు. ప్రజామన్నన అనేది సంకుచితమైన అర్థంలో ప్రధానంగా చూస్తారు. ఏ నియోజకవర్గంలో ఏ కులం, మతంవారు ఎంతమంది వారిలో ఎవ్వరిని నిలబెడితే సులభంగా హెచ్చు ఓట్లు, గెలుపు రాగలదనే యోచనే ప్రధానమైనదిగా వుంటున్నది. చివరకు ఆయా పార్టీల తరఫున స్థానికంగా పనిచేసే కార్యకర్తలు కూడా, ఆ సమయానికి సంఖ్యకు మోజు పడుతుంటారేకాని గుణానికి మాత్రం కాదు. నీతి, నిజాయితీకల పార్టీ కార్యకర్తను, అభిమానిని, నిలబెట్టి, ఓడిపోయినా పార్టీప్రతిష్ఠను నిలుపుకొనాలనే భావమే కనిపించదు. కనీసం నియోజకవర్గం స్థాయిలోనైనా "పార్టీ పరిపూర్ణస్థితి" ఏర్పడడానికి ఎంతమాత్రం అవకాశం కనిపించదు. కనకనే ఎన్నికలసమయంలో చీలికలు, తిరుగుబాట్లు, స్వతంత్రంగా పోటీలు అన్ని పార్టీలలోను సహజమైనాయి. కాంగ్రెసు పార్టీ పెద్దది కనక దానిలో ఇవి హెచ్చుగా కానవస్తున్నాయి.

అంటే ఇప్పటి మన ప్రజాస్వామ్యం క్రమక్రమంగా పార్టీదృష్టిని, సంస్థతత్వాన్ని తగ్గింపజేస్తున్నది. కులం, మతం, వర్గం ఆసరాగా వ్యక్తులను రంగంలో నిలుపుతున్నది. కనకనే కుల, మత, వర్గ శక్తులు, వీని ప్రయోజనాలు కాపాడే ప్రయత్నాలు సహజమైపోయాయి. అయితే ఒక భేదం వుంది. ఒకప్పుడు వ్యక్తికి, కుటుంబానికి, ఒక తెగకు, ఒక కులానికి, ఒక గ్రామానికి పరిమితమైన ఈ ప్రయత్నాలు ఇప్పుడు నియోజకవర్గానికి, జిల్లాకు మాత్రమేకాక, రాష్ట్రాల స్థాయిని అందుకున్నాయి. కనకనే ఎన్నికల అనంతరం గెలుపొందినవారి జాతకాలు తిరగవేయడంలో ఏ జిల్లాలో ఏ కులంవారు ఎందరువున్నారు, ప్రాంతాలవారీగా ఏకులంవారు ఎంతమంది అనే మదింపు, అందులోనుంచి నాయకుల కుదింపు, చివరకు విరిగిన మనస్సులతో, కలియని ఆలోచనలతో, పెరిగిన ద్వేషాలతో తప్పనిసరి అవకాశవాదాలతో మంత్రివర్గనిర్మాణాలు జరుగుతూ వున్నాయి. రాజకీయ దండాన్ని చేబడుతున్నాయి.

పార్టీస్థాయిలో అంటే సంపూర్ణమైన జాతీయవాదులుగా వ్యవహరిస్తున్న రోజుల్లో కాంగ్రెసువాదులు కుల, మత సభలకు, సమావేశాలకు దూరంగావుండేవారు. వానిపట్ల ఏవగింపు చూపేవారు. కాని ఈనాడు జాతిప్రతినిధులుగా ప్రభుత్వ పాలకులుగా వుండి, కుల మత సభలకు ఆ యా పదవుల హోదాలో వెడుతున్నారు. ఆ యా కులాలవారు, మతాలవారు ఏకంకావాలని ఉపన్యాసాలు చేస్తున్నారు. ఇది బహిరంగంగా కానవచ్చే చిత్రం. ఇక తెరవెనక వ్యవహారాలలో మంత్రి పదవులు ఇవ్వడంలో, విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవులు, న్యాయమూర్తుల నియామకాలు మొదలు మునసబు, కరణం, తలారీ, ఉపాధ్యాయుల ఉద్యోగాలువరకు కులం, మతం, ప్రధానమైన అర్హతగా స్వీకరిస్తున్నారు. సిఫారసు చేస్తున్నారు. పట్టుదలలు పోతున్నారు. కోర్టుల కెక్కుతున్నారు. చివరకు ఆ యా సంస్థలనుపదవులనుకూడా రచ్చకీడుస్తున్నారు.

ఇలా పార్టీస్థాయినుంచి మంత్రివర్గ స్థాయికి అపరిపక్వస్థితి, సంకుచితత్వం వ్యాపించినప్పుడు, వ్యాపిస్తూ వున్నప్పుడు జాతి పరిపూర్ణసిద్ధికిగాను శిక్షాస్మృతులను సవరించి ప్రయోజనమేమిటి? ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టాలను ఇంకా హెచ్చుగా ఎవ్వరిమీద వినియోగించాలి? కుల మత పాఠశాలలను రద్దుచేయడం దేనికి? పాఠ్య గ్రంథాలలో మార్పులవల్ల లాభమేమిటి? కనక జాతి పరిపూర్ణసిద్ధి అనేది ఇలా రాజకీయదండం ద్వారా సాధించడం ఆచరణ రీత్యా అసంభవం. పార్టీ స్థాయిలో అందుకొనలేని పరిపూర్ణత, ప్రభుత్వస్థాయిలోను, జాతిస్థాయిలోను సాధించడం అసాధ్యం. పైగా ఇందుకోసంచేసే ప్రతిప్రయత్నం, తీసుకునే ప్రతిచర్య భాషారాష్ట్రాల నిర్మాణంవలె కొత్త సమస్యలను, శక్తులను సృష్టించి చిక్కులను పెంచుతుందేకాని తగ్గించదు.

కనక ప్రభుత్వచర్యల ద్వారా ఇందిరా గాంధి సంఘం సూచించినట్లు, దుర్గాపూర్ సమావేశంలో అఖిల భారతసంఘం కోరుతున్నట్లు జాతి పరిపూర్ణతను సాధించడానికి ముందుగా—

ప్రజాస్వామ్యమనేదానికి సంఖ్యావాచకంగాకాక గుణవాచకంగా అర్థం చెప్పుకోవాలి.

పార్టీ స్థాయిలో జాతి పరిపూర్ణతను (స్వాతంత్ర్యోద్యమంలోవలె) సాధించాలి.

పార్టీలు, మతాలకు, వర్గాలకు, కుల నాయకులకుకాక, జాతి మొత్తానికి ప్రాతినిధ్యం వహిస్తున్నవనే నమ్మకం ప్రజలలో పెంపొందించాలి.

ఇవి జరిగినప్పుడుకాని జాతీయమైన పరిపూర్ణస్థితి అటు పార్టీలలో, ఇటు ప్రజలలో, ఆలోచనలలోను, కార్యాచరణలలోను నిజంగా రాదు. అప్పుడుగాని దేశంలో తలెత్తే విచ్ఛిన్న ధోరణులన్నింటి సమగ్ర పరిష్కారానికి తగిన ప్రాతిపదికలు ఏర్పడవు, ప్రజాస్వామ్యంలో కొత్తదనం కానరాదు.

# తెలిసిన పిలుపులు

(17-వ పేజీ తరువాయి)

అరగంట కంటే ఎక్కువ వుండను. అన్నీ చెప్పేసి వచ్చేస్తాను. ఈరోజు వెళ్ళాలి. ఏదీ తలెత్తి చూడు. ఊ ! ఇదుగో గడియారం - దగ్గర పెట్టుకో. ఇందులో ముల్లు 7 చూపేసరికి నేను నీ ప్రక్కన ఉండకపోతే నీ ఇష్టంవచ్చిన శిక్ష విధించు. ఏం—తలెత్తు మరి" తనచేతికున్న గడియారం తీసి మంజు చేతికి పెడ్తూ అన్నాడు శేఖరం.

"వద్దు. ఫర్వాలేదు. మీరు వెళ్ళండి" గడియారం చేతికి పెట్టనివ్వకుండా చేతులు వెనక్కి పెట్టుకుంటూ అంది మంజు.

శేఖరం బలవంతాన మంజుచేతికి గడియారం పెట్టి మళ్లీ అద్దంముందుకు వచ్చి టై కట్టుకోసాగాడు. "మందు తాగు. ఈరోజు జ్వరం రాకపోతే ఇహ రాదని చెప్పాడు డాక్టరు. నేను వస్తూ ఆ టాబిలెట్స్ తెస్తాను. మందు తాగటం మర్చిపోకు. సాధ్యమైతే ఇంకా ముందుగానే వచ్చేస్తాను. ఏం ?" మాటలు చెబ్తూనే వెళ్లిపోయాడు శేఖరం.

క్రమంగా అతని కారు వెళ్లిపోతున్నశబ్దం దూరమైపోవటంతో మంజు లేచి సరిగ్గా కూర్చుంది. 'గడియారం చూస్తుండు. ముల్లు 7 చూపించేసరికి నేను రాకపోతే చూడు' భర్త తనచేతికి పెట్టివెళ్లిన గడియారాన్ని ఆప్యాయంగా తడిమి చూసుకుంది. గడియారం చైన్‌లో శేఖర్‌చేతిస్పర్శ ఇంకా ఉన్నట్టుగానే ఉంది మంజుకి. ఏదయినా కాలికి తగిలిన ఈ దెబ్బ ఇది వరకు తెలియని ఓ కొత్త అనుభవాన్ని నేర్పింది. మంజుకి ఓవిధంగా ఆనందంగానే ఉంది.

పదిరోజులక్రితం శేఖర్ ఆఫీసు పనిమీద క్యాంప్ వెళ్ళాడు. ఎనిమిది రోజులు—ఏదో ఇన్‌స్పెక్షన్‌గొడవ ఉండటంవల్ల — బెంగాల్‌నుంచి నుంచి ఆఫీసర్ రావటంవల్ల మంజుని తప్పనిసరిగా ఇంటిదగ్గర వదిలేసి వెళ్లాల్సివచ్చింది. ఎనిమిదిరోజులూ ఎనిమిది యుగాల్లా గడిచాయి. ఎంతో కష్టంమీద శేఖరం తిరిగివచ్చే రోజు వచ్చింది. ఆరోజు సాయంత్రంగూడ చాలా ఆలస్యంగానే అయింది.

అప్పటికే స్నానం అదీ చేసేసి శేఖర్‌కి ఎంతో ఇష్టమైన జరీఅంచు తెల్లచీర, జాకెట్ వేసుకుని ఇప్పుడో, కాసేపట్లోనో విన్పించబోయే 'మంజూ' అనే పిలుపుకోసం ఒళ్లంతా చెవులు చేసుకుని ఇల్లంతా కలియదిరుగుతోంది. వంటయింట్లో వంటమనిషి సాయంత్రానికి కావాల్సిన యేర్పాట్లు చూస్తోంది. శేఖర్ రాగానే స్వయంగా తనచేతుల్తో కలిపిన కాఫీ ఇవ్వాలనే తొందరలో ఉన్న మంజు వంటింట్లో కాఫీ కలిపే ప్రయత్నంలో ఉంది. కాఫీ కలపటం పూర్తయింది. అది ఫ్లాస్కులో పోయబోతుండగా హాల్లోంచి 'మంజూ' అన్న పిలుపు విన్పించింది. అరె ! కారు హారన్ గూడ విన్పించలేదే—అనుకున్న సమయానికి అరగంట ముందుగానే—ఆ పిలుపు విన్పించటం మంజు తన చెవుల్ని తనే నమ్మలేక హాల్లోకి పరుగెత్తింది. ఆ పరుగెత్తటంలో చాపి అంగ వెయ్యటంలో అది కత్తిపీటమీద పడింది. పదునుగల కత్తిపీట దొరికిన అవకాశాన్ని దుర్వినియోగపరుచుకునే మూర్ఖురాల్ని కాదు అన్నట్లు మంజు పాదాన్ని కసిక్కిన కొరికింది. 'అబ్బా !' అంటూ ఒకసారి వంగి పాదాన్ని విదిలించుకుని ఆ కాలితోనే కత్తిపీటని ప్రక్కకు నెట్టి మంజు సుడిగాలిలా హాల్లోకి వచ్చింది. అప్పటికే శేఖర్ బూటు లేస్ విప్పి కాళ్లతో గోడవారగా తోస్తున్నాడు.

"ఇంత తొందరగా వచ్చేశారేం. అబ్బ ! ఈరోజు అసలు సాయంత్రమే కాలేదు. మీ రొచ్చేశారు. ఎంత బాగుంది. ఈ వారంరోజులు ఒక్క నిమిషం గూడ తోచలేదు. శేఖర్ చేతుల్లో వాలిపోయిన మంజుకి తన కాలు తెగటం కాని, అది రక్తం గుమ్మరిస్తున్నట్లు గాని తెలియదు.

"ఆగు. ఉండుమరి—నన్ను మేజోళ్ళు విప్పనీ" తన మెడచుట్టూ చేతులు వేసిన మంజు చేతులు

---

ఆఫీసరు : నేను ఇప్పుడు
ఎక్కడవున్నాను.
గుమస్తా : కుర్చీలో సార్ !
ఆఫీసర్ : అది కాదయ్యా!
నా టూర్ ప్రోగ్రాం ప్రకారం చూచి చెప్పు.
గుమస్తా: రాజమండ్రిలో వున్నారండి.
ఆఫీసర్ : ఈ కాగితాలమీద
నీవే "బై ఆర్డర్"లో సంతకము పెట్టి పంపు.

—కొల్లా వెంకటేశ్వరరావు
(పెదకూరపాడు)

---

విడదీస్తూ అన్నాడు శేఖరం. అసలు విషయం వంటింట్లోంచి చేత్తో గరిట పట్టుకుని వంటమనిషి కళ్ళు పెద్దవి చేసుకుని తొంగి చూస్తోంది.

"యేమిటిది. నువ్వు నడుస్తుంటే యీ ముద్ర లేమిటి ?" క్షణంసేపు వంటమనిషి చూస్తోందన్న సంకోచంతో నేలమీద వాలిన శేఖరం చూపులు తెల్లబోయినాయి. అప్పుడు గాని మంజుకి గుర్తు రాలేదు. కాలుకి దెబ్బ తగిలిందని.

"అరె—యేదీ కాలు—యింత రక్తం రావటం యేమిటి ?" శేఖరం చప్పున మోకాళ్లమీద వంగి కూర్చొని మంజు పాదాల్ని చేతుల్లోకి తీసుకున్నాడు.

గులాబీరేకుల తాలూకూ నాజూకుతనాన్ని నింపుకున్న పాదంలో రెండంగుళాలు లోతుగా గాయం అయింది. ఇంకా రక్తం వస్తూనే ఉంది. ఆ రక్తంలో ఎరుపుకి శేఖరం కళ్ళు క్షణంసేపు చెదిరినాయి.

"అవును. వస్తుంటే కత్తిపీట ఉంది. దాని మీద కాలు వేశాను. కొంచెం దెబ్బ తగిలింది." మంజుకి అప్పటికి గాని గాయంవల్ల కలిగే బాధ గుర్తుకు రాలేదు.

"నీ మొహం—అన్నీ ఖంగారే. అంత తొందరే—వచ్చినవాడ్ని ఏమైపోతాను. కాస్త నిదానంగా రాకూడదూ—అంత వళ్లు తెలియకుండా యెలా పరుగెత్తావు ? అసలు వంటయింట్లో నీకేం పని వచ్చింది. క్రింద కత్తిపీట ఎవరు పెట్టారు ?" భార్య నడుంచుట్టూ చెయివేసి గోడవారగా ఉన్న కుర్చీలో కూర్చోపెట్టాడు. మంజు నడిచిన ప్రతి అడుగు రక్తంతో తడిసి నేలమీద ముద్ర పడింది.

"అయ్యయ్యో. యెంత రక్తమో !" శేఖరం చప్పున వంగి పాంట్ జేబులోంచి జేబురుమాలు తీసి పాదానికి నొక్కిపట్టాడు. ఇంట్లో అడుగు పెడ్తూనే కోపంగా కేకలు వేస్తున్న శేఖరం కంఠస్వరం విని నౌకర్లు, వంటమనిషి హాల్లోకి పరుగెత్తుకొచ్చారు.

"అబ్బా ! నొప్పేస్తోంది." కుర్చీలో వెనక్కి వాలి మంజు చేతుల్తో కళ్ళు మూసుకుంది. కాని బాధతో కాదు. శేఖరం ఆదుర్దా నిండిన స్వరం యిచ్చే అనుభూతితో ! పాదాన్ని సున్నితంగా యెత్తి రెండు చేతుల్తో పట్టుకున్నప్పటి స్పర్శానందంతో.

బట్టలు కూడా మార్చుకోకుండా—మంజుని అలాగే కారులో కూర్చోపెట్టుకుని డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్లాడు శేఖరం. గాయం కొంచం లోతుగా తెగినా ఫర్వాలేదని, నయమైపోతుందని చెప్పి డాక్టరు కట్టు కట్టాడు. మంజుకి ఏమీ బాధనిపించలేదు. కట్టు కట్టిన కాలుతో హుషారుగానే నడిచివచ్చి కారులో కూర్చుంది.

"మరీ అంత వళ్లు తెలియకుండా ఉండటం మంచిదికాదు మంజూ ! చూడు. ఎంత గాయం అయిందో—చాల రక్తం పోయింది." ఆ రాత్రి పడుకోబోయేముందు మంజు కాలి కట్టుని చేతితో తాకి చూస్తూ అన్నాడు శేఖరం.

"తగిల్తే తగిలింది. నాకు బావుంది. నాకోసం మీ రెప్పుడూ యిలా ఆదుర్దా పడలేదు. ఇందాక రక్తం కారుతుంటే మీరు వంగి నా పాదాల్ని పరిశీలిస్తుంటే అప్పుడు మీ కళ్లలో భావం చూస్తుంటే నా కెంతో హాయిగా ఉందీ ! నాకు ప్రతిరోజూ ప్రతి నిముషం అలాంటి అనుభూతి మీ కళ్లలోంచి అందితే ఎంత బాగుంటుంది. కొద్దిగా అలిసినా ఉత్సాహంగా కళ్లల్లో మెరుపులు కురిపిస్తూ అంది మంజు. శేఖర్‌కి అర్థంకాలేదు. కాని తనకోసం పరుగెత్తుకు రావటంలో మంజుకి అంత పెద్ద దెబ్బ తగిలింది అని గుర్తొచ్చేసరికి అతని మనసు మంజుపట్ల జాలితో—అదేదో సున్నితమైన భావంతో నిండిపోతోంది.

ఆ మర్నాడుగూడ ఏమంత బాధనిపించలేదు. శేఖరం వద్దని కేకలు చేస్తున్నా విన్పించుకోకుండా మంజు యింట్లో మామూలుగానే తిరి

గింది. కానీ మూడో రోజుకి పాదం బాగా వాచి పోయి మంజుని మంచంమీదనుంచి కాలు క్రిందకి పెట్టనివ్వలేదు. చాలా బాధగా గూడ అన్పించింది. ఆరోజు డాక్టర్ తనే యింటికి వచ్చాడు. ఆ సాయంత్రం జ్వరం కూడా వచ్చింది. దానికి తోడు సెప్టిక్ అయింది. ఆపరేషన్ చెయ్యాలన్నాడు డాక్టర్.

"వద్దు. వద్దు. పాదంలో సగం తీసేస్తాడేమో—లేకపోతే ఒకటి, రెండు వేళ్లు కత్తిరించేస్తాడేమో—వద్దు నాకు, ఆపరేషన్ వద్దు. అదే తగ్గిపోతుంది. నన్ను మీరంతా కలిసి కుంటిదాన్ని చెయ్యొద్దు." గోలపెట్టేసింది మంజు.

"ఏమిటది — మరీ చిన్నపిల్లలా! వేళ్లెందుకు కత్తిరిస్తాడు నీ మొహం. కాస్తంతని కొండంత చెయ్యకు అనవసరంగా" విసుక్కున్నాడు శేఖరం.

"ఇప్పుడైతే యీ కాస్త ఆపరేషన్‌తో సరిపోతుంది. ఇది వద్దని మానేస్తే సరె. మీ యిష్టం. కొన్నాళ్ళ పోయింతర్వాత పూర్తి కాలంతా తీసెయ్యాలి. అది మీకు యిష్టమే నంటే నాదేం అభ్యంతరం లేదు. మెడిసిన్ బాగ్ చంకన పెట్టుకుని డాక్టర్ వెళ్లిపోవటానికి లేచాడు.

"పూర్తి కాలంతా తీసెయ్యటమా ?—ఓమూల కాస్త వంకర భరించలేని తను ఓకాలు పూర్తిగా లేకుండా ఉండటమా ! భయంతో మంజులో ప్రతినరం వణికింది. చివరికి చాలా సేపయిం తర్వాత శేఖర్ వళ్లో తలదాచుకుని నెమ్మదిగా 'ఆపరేషన్ చెయ్యమనండి—కాని వేళ్ళు కత్తిరించవద్దనండి. ఒకసారి మా పిన్నికి యిలాగే సెప్టిక్ అయితే కుడిపాదం మూడు వేళ్ళు కత్తిరించేశారు. నే నా వికృతాన్ని భరించలేను' అంది.

"భయంలేదని చెబుతుంటే వినవేం మంజూ ! వేళ్లెందుకు తీసేస్తాడు. పోనీ ఒకవేళ తీసెయ్యాల్సి వస్తే—నావి తీయించి వాటి స్థానంలో పెట్టిస్తాను. సరేనా ? కొంచం మోటుగా వుంటాయేమో ! మరి అదైనా భరించగలవా ?" నవ్వుతూ అన్నాడు శేఖరం, బుజ్జగిస్తున్నట్లు.

అసలు మంజు స్వభావమే అంత. పొరపాటుగా యెక్కడైనా రోడ్డుమీద అక్కడా ఏ కుంటివాళ్లన్నా, గుడ్డివాళ్లన్నా కన్పిస్తే భయంతో చప్పున మొహం తిప్పుకుంటుంది. ఓరోజు — శేఖరానికి బాగా గుర్తుంది. ఆరోజు ఓ ఫ్రెండ్ యింటికి భోజనానికి వెళ్లి తిరిగివస్తూ పెట్రోల్ కోసం ఓ బంక్ దగ్గర కారు ఆపితే అక్కడ కన్పించిన ఓ ముష్టిదాన్ని చూసి మంజు రెండు రోజులు ఒకటే బాధపడింది.

అలాంటి ముష్టిదాని చేతిలో నెత్తురుగుడ్డులా ఉన్న ఓ పసికందు. ఆ పిల్లాడ్ని చూపించి 'అయ్యా—దానం—బాబూ. పిల్లాడు అంటోంది. అసహ్యంతో, భయంతో మొహం తిప్పేసుకుంది మంజు. ఇవేం గమనించని శేఖరం జేబులోంచి పర్సు తీసి చేతికి వచ్చిన నాణేన్ని తీసి ముష్టిదాని వైపు విసిరేశాడు. పెట్రోల్ నింపుకున్న కారు ముందుకు కదిలింది. అంతవరకు నవ్వుతూ, తుళ్ళుతూ ఖబుర్లు చెప్తున్న మంజు హఠాత్తుగా మూగవోయినట్లు కూర్చోవటం చూసి

# తెలిసీ తెలియని విలువలు

శేఖరం కారణం అడిగాడు. మంజు అడిగింది. 'మరి—ఈ సృష్టి కంతటికి కారణం భగవంతుడు అంటారే—దేవుడే యీ సృష్టికి కారణం అయితే ప్రపంచంలో అసలింత వికృతం ఉంటుందా ? మనం యిలా ఆరోగ్యంగా హాయిగా ఉంటాం. వాళ్లెందుకు అలా ఉంటారు మరి. కానీ—కానీ—భగవాన్ నువ్విది సృష్టించినా సృష్టించకపోయినా అసలు నువ్వేనాడివి ఉంటే నీ కే మాత్రం కరుణ, జాలి అనేవి ఉంటే అవి వాళ్లకి పూర్తిగా యిచ్చేసి వాళ్లకు నవ్వు చేసిన అన్యాయంలో సగం అయినా తీర్చు.'

దానిమీద శేఖరం వ్యాఖ్యానం చేయ్యలేదు. వాదించలేదు. విని వూరుకున్నాడు. కాని తన నంతగా కదిలించని కొన్ని విషయాలు మంజుని అలా కుదిపి కుదిపి మనశ్శాంతిని తినెయ్యటం—వాటికోసం మంజు బాధపడటం అతనికి చిత్రంగానే ఉండేది.

అదంతా గుర్తొచ్చిన శేఖరం ఆపరేషన్ అయింతర్వాత మంజు తల నిమురుతూ 'ఫర్వాలేదు. ఒక వారం రోజులు పూర్తి విశ్రాంతి తీసుకుంటే మామూలుగా అయిపోతావు' అని ధైర్యం చెప్పాడు.



మంజు అసలు మంచంమీద నుంచి క్రిందికి కాలు దింపనే దింపకూడదు అన్నాడు డాక్టరు. అంతకంటే నరకం వేరే లేదు. అయినా భరించక తప్పలేదు. శేఖరం క్యాలెండరు తెచ్చి మంజు కెదురుగా పెట్టాడు.

ఎలాగైతేనేం శేఖరం సపర్యలతో, వంట మనిషి మాటలతో ఆరు రోజులు యిట్టే గడిచి పోయినాయి. మంజు కోసం శేఖరం అన్ని పనులూ మానుకున్నాడు. కారు గారేజ్ నుంచి తీసి ఆరు రోజులైంది. మంజు పెళ్లయిం తర్వాత శేఖరం యింత స్థిమితంగా తన ప్రక్కన కూర్చోవటం యిదే మొదటిసారి. క్రమేపీ సాయంత్రం పూట జ్వరం రావటం గూడ తగ్గిపోయింది. గాయం కూడ మూడొంతులు తగ్గిపోయింది. ఒక వంతు వచ్చి ఉండగానే లేచి కొంచంగా యెక్కువ శ్రమ లేకుండా అటూ యిటూ అడుగులు వెయ్యమన్నాడు డాక్టర్. శేఖర్ తనే స్వయంగా మంజు చేతిని తన మెడచుట్టూ వేయించుకుని ఎడంచెయ్యి భార్య నడుంచుట్టు వేసి గదిలో గుమ్మం దగ్గర నుంచి గోడ వరకు, గోడ నుంచి కిటికీ దగ్గరకూ నడిపిస్తున్నాడు. అతని నిదానానికి, ఓపికకి — శ్రద్ధకి మంజు ముగ్ధురాలై చూడసాగింది. వేళపట్టున గుర్తు పెట్టుకుని మందు కలిపి యివ్వటం, సాయంత్రంపూట జ్వరం వచ్చిందీ లేదో అని థర్మామీటర్‌తో చూడటం, మధ్యాహ్నంపూట యేమీ తోచటం

లేదంటే యేదైనా పుస్తకం చదివి విన్పించటం, మంజుకి జీవితాంతం యేదయినా జబ్బుచేసి అలా ఎప్పుడూ శేఖరం దగ్గరగా ఉంటే బాగుండు ననిపిస్తోంది. తన కాలు తగ్గిపోతే — మళ్లీ మామూలు జీవితం, అతని స్నేహితులు, సభలు, సమావేశాలు, విందులు వినోదాలు—అప్పుడు గూడ తమ ప్రక్కన ఉంటుంది. కాలుకి దెబ్బ తగలనంతవరకూ మంజుకి అదీ అందంగానే కన్పించింది. కానీ కాలికి తగిలిన యీ గాయం మంజుకి తెలియని ఓ విలువైన సుఖాన్ని—శేఖరంలో తనంతకుముందు చూడని లోతుల్ని చూపింది. ఇప్పుడైతే తమిద్దరే ! పేకాటకీ, క్రికెట్‌కీ లాక్కుపోయే రాక్షసులు లేరు.

ఓరోజు సాయంత్రం తనకి మందు కలిపి యిస్తున్న భర్తని తదేకంగా చూస్తున్న మంజు "మీరు డాక్టరై—నేను పేషెంటునై యెక్కడో ఓ మారుమూల — చాలా అందంగా ఉన్న పరిసరాల మధ్య—యెత్తుగా ఓ కొండమీద చిన్న డాబాలో ప్రతిరోజు సాయంత్రం నే నిలా వెనక్కు జారగిలబడి కూర్చుంటే — మీరలా టేబిల్‌దగ్గర నిలబడి మందు కలుపుతుంటే ఎంత బాగుంటుందికదూ !' అంది. మందు కలుపుతున్న శేఖరం ఆగి మెడ తిప్పి భుజం మీదుగా భార్యని చూసాడు. మంజు నిజంగా ఎక్కడో కొండమీద డాబాలో కూర్చున్నట్లే ఉంది.

"ఎందుకలా చూస్తారు. ఏం అలా ఉంటే బాగుండదా ?"

"బాగానే ఉంటుంది. కాని, పులులూ, సింహాలూ వస్తాయని భయం. ఎందుకైనా మంచిది. రేపట్నుంచి ఓ గన్ తెచ్చుకుని షూటింగ్ నేర్చుకుంటాను. ఇదుగో మందు తీసుకో ! కాని మంజూ ! నువ్వు కథా రచయిత్రివి ఎందుకు కాలేదో నాకు తల బద్దలు కొట్టుకున్నా అర్థం గాదు. ఇంత ఊహాలోకం ఉన్నవాళ్లు తప్పని సరిగా కథలు రాయాలి లేకపోతే – మాబోటి వాళ్లకు ప్రమాదం."

"అంటే ?" అంది మంజు మందుగ్లాసు తీసుకోకుండా శేఖరం కళ్లల్లోకి చూస్తూ.

"కాదా మరి. చాలామంది ఊహించటంలో తృప్తిపడి ఊరుకుంటారు. నువ్వు ఊహించింది ప్రతిదీ స్వానుభవంలో కావాలంటావు" శేఖరంతో పాటు తను గూడ నవ్వేసింది మంజు. ఆ క్షణం ఎంత బావుంది !

చాలాసేపట్నుంచి శూన్యంలోకి చూస్తున్న మంజు కళ్ళు క్రిందికి వాలి చేతికున్న గడియారం చూపాయి. ముల్లు బద్ధకంగా బరువుగా, నిర్లక్ష్యంగా తిరుగుతోంది. 7 కావటానికి మరో పది నిముషా లుంది. ఎందుకో చెప్పినట్లుగా సరిగ్గా 7 గం. కి శేఖరం వస్తాడంటే మనసు నమ్మలేకుండా ఉంది. తనచేత వెళ్ళ అన్పించుకునేందుకే అతనంత నమ్రతగా, నమ్మకంగా పల్కింది. మంజు మనసులో కలిగిన అనుమానం నిజమేనని గడియారం బుజువు చేసింది. 7 గం. దాటింది. చకచకా పదిహేను నిమిషాలు గడిచాయి. కాని శేఖరం రాలేదు. రాలేదని అతన్ని

అని లాభంలేదు. అసలు తప్పు తనది. వెళ్లండి— వెళ్లండి అంది. ఇంకొంచెంసేపు అలాగే మూతి ముడుచుకుని, కళ్లు క్రిందకు వాల్చుకుని కూర్చుంటే అత నసలు వెళ్లేవాడు గాదు. వెళ్లిం తర్వాత రాలేకపోవటం అతని తప్పు కాదు. కాని యెలా ? ఎన్నాళ్లిలా గుప్పెట్లో పట్టుకుంటుంది. అతని ఆదరణకోసం తను బాధపడుతున్నట్టు ఎన్నాళ్లు నటించగలుగుతుంది. ఒకళ్లు కావాలని గుప్పెట్లో పట్టుకోవాలని ప్రయత్నించి ఉంచుకునేదా ఆ బంధం ? ఎంత సున్నితమైంది. కాని తనేం చేస్తుంది ? తనేం చెయ్యగల్దు ! అసలు కాలుకి దెబ్బ తగలకుండా ఉంటే బాగుండేదేమో! తన కప్పుడు యీ లోతులు తెలిసేవికావు. నిట్టూర్పుతో మంజు వెనక్కు వాలింది. మందు వేసుకోలేదు. ఈ వారం రోజుల్లో ఒక్కరోజు తన చేత్తో తను మందు వేసుకోలేదు. టేబిల్‌మీద తొంగిచూస్తున్న మందుగ్లాసు వైపు దృష్టి నిగిడ్చి అలాగే ఉండిపోయింది మంజు.

ముందరి హాల్లో ఉన్న గడియారం 8 గం. 9 గం. గూడ కొట్టింది. శేఖరం పత్తాలేదు. ఎంత వద్దనుకున్నా మంజు మనసు బాధపడకుండా ఉండలేకపోయింది. ఇప్పుడు ఉన్నపళంగా జ్వరం వచ్చేస్తే—శేఖరం రాగానే—మసలిపోతున్న తన ఒళ్లు పట్టిచూస్తే — అరె — యిదేమిటి యింతకుముందు బాగానే ఉన్నావుగా అని ఖంగారు పడ్తే చాలా బాగుంటుంది. కాని అలా జరగలేదు. ఆలోచించి ఆలోచించి నీరసం తలనొప్పి ముట్టుకు వచ్చాయి. కాని అవి పైకి కన్పించవు.

గడియారం 9 గంటలు కొట్టిన పది నిముషాలకి బైట కారు హారన్ విన్పించింది. అంత వరకూ ఆలోచిస్తూ గోడకి చేరగిలబడి కూర్చున్న మంజు చేతికున్న గడియారం తీసేసి దూరంగా పెట్టి పడుకుని కళ్లు మూసుకుంది.

"మంజూ !" అనే పిలుపు కోసం చెవులు శ్రద్ధగా వింటున్నాయి. కాని శేఖరం పిలవలేదు. "మంజూ నిద్రబోయిందా. మందు వేసుకుందా" అని మటుకు హాల్లో శంభుని అడగటం విన్పించింది. 'ఆ !' రెండింటికీ కలిపి ఒక్క అక్షరంలో సమాధానం యిచ్చాడు శంభు. అమ్మగారు మందు వేసుకోవటంలో అశ్రద్ధ చెయ్యరు. అది ప్రత్యేకం అడగక్కర్లేదు. ఇహ పోతే, గదిలో లైటు తీసేసి చాలాసేపయింది. శబ్దంగూడ లేదు. అలా నిశ్శబ్దంగా కూర్చోవటం మంజు స్వభావానికి విరుద్ధం. అందుకే నిద్రబోయిందని చెప్పాడు.

నిద్రపోయిన మంజుని లేపి తను ఆలస్యంగా వచ్చానని గుర్తు చెయ్యటం యిష్టంలేని శేఖరం వెంట తెచ్చిన నాటకాల్లో క్లబ్ వార్షికోత్సవానికి వేస్తున్నదాన్ని పరిశీలించటంలో నిమగ్నుడైపోయాడు.

మర్నాడు శేఖరం నిద్రలేచేసరికి మంజు లేచి మామూలుగా తిరుగుతోంది. 'మళ్లా తిరుగుతున్నావు. కాస్త నాలుగు రోజులు విశ్రాంతి తీసుకోగూడదూ. కాలు పచ్చి యింకా పొంతం పోలేదు.' రాత్రి తను ఆలస్యంగా రావటం మంజుకి కోపం వచ్చిందని సులువుగానే గ్రహించిన శేఖరం తనే స్వయంగా కల్పించుకుని అన్నాడు.

"ఏం ఫర్వాలేదు. కాలుని గురించి దిగులు పడవలసింది నేను. బాగానే తగ్గిపోయింది. తగ్గక పోయినా ఫర్వాలేదు. మీ రింక మీ మీటింగ్సుకి వాటికి మానుకోవాల్సిన అవసరమేం లేదు." మంజు ఎత్తిపొడుపుకి శేఖరానికి కోపం వచ్చింది. అంతేమరి. ఆడవాళ్ల తత్త్వమే అంతేనేమో. నిన్నటిదాకా తాను చేసిందంతా ఒక్కరాత్రిలో మర్చిపోయింది. శేఖరం గూడా ముభావంగానే ఉండిపోయాడు. కనీసం ఆలస్యం అయింది అని గూడ చెప్పగూడదూ. రాత్రి తను అంతసేపు ఎదురుచూస్తే—అసలు తనకు కాలు నయం కాకపోతే యింకా ఎంత సంతోషించేవాడో. శేఖరంమీద కోపంతో మంజు ఇంట్లో నౌకర్లందరికీ ఒక్కసారి శెలవు యిచ్చేసింది. ఎన్నాళ్లనుంచో అడుగుతోంది వంటమనిషి—ఒక్క నాలుగు రోజులు బెజవాడ వెళ్లి మా చెల్లెల్ని చూసివస్తానని. సెలవు యివ్వటమేకాదు, రైలు ఛార్జీలు కూడయిచ్చి మరీ నాలుగురోజులున్నా ఫర్వాలేదు. నా కాలు నయం అయ్యిందిగా అని చెప్పి పంపించింది. శంభు పెద్దవాడైపోయాడు. రాత్రిపూట దగ్గు అదీ విపరీతంగా వస్తోందట. నాలుగు రోజులు కదలకుండా మందు తీసుకోమని ఆజ్ఞలు జారీ చేసింది.



ఇహపోతే రాజు. రాజుకి శెలవు తీసుకోమనే ఎవరూ చెప్పక్కర్లేదు, ఎవరూ పిలవకపోతే అతని తీసుకుంటాడు.

'అందరినీ ఒక్కసారి ఎందుకు పంపావు ? ఇంట్లో పనులన్నీ ఎవరు చేస్తారు. నీ కాలు యింకా పచ్చి మాననేలేదు. అయినా నాతో మాట మాత్రం గూడ చెప్పక్కర్లేదా ? ఇంట్లో నేనంత అనామకుడిగా ఉన్నానా ?' ప్రతి చిన్న పనికి తనే కుంటు కుంటు తిరుగుతున్న భార్యని చూసి బాధపడ్తూ కోపంతో అన్నాడు శేఖరం. మంజు ఎప్పుడూ అంతే ! శేఖరంమీద కోపం వస్తే తనమీద సాధించుకుంటుంది.

"నేను కాపరానికి వచ్చింతర్వాత మీతో చెప్పకుండా స్వతంత్రంగా చేసిన పని యిదొక్కటేగా. ఎన్నిసార్లు 'నీ యిష్టం—నీ యిష్టం వచ్చినట్టు చేసుకో మంజూ' అని మీరు అనలేదు ? కానీ నే నెప్పుడూ నా యిష్టానుసారంగా వెళ్లనే వెళ్లలేదు. ప్రతిదానికీ మిమ్మల్ని అడుగుతూనే వచ్చాను. ఈ ఒక్క చిన్న విషయం అడగపోయినా ఫర్వాలేదు అనుకున్నాను. నాకేం తెలుసు. 'నీ యిష్టం—నీ యిష్టం' అనే మీ మాటలకి విలువ లేదని, అవి తాత్కాలికంగా నాలిక చివరినుంచి వచ్చాయని. పెళ్లయిం తర్వాత నేను చేసిన మొదటి తప్పు ఇది. ఫర్వాలేదు. మీరు క్షమించవచ్చు."

బాగా దగ్గరగా వచ్చి, తగ్గు స్థాయిలో ఖచ్చితంగా కోపంగా అంటున్న మంజు వంక రెప్ప వాల్చకుండా చూడసాగాడు శేఖరం.

నిన్న మొన్నటి వరకు పసిపాపలా, దేవకన్యలా ఉన్న మంజుకి యీరోజు ఏమైంది ? తనెందుకు అంటున్నాడు. మంజు మంచికోరి కాదు. కాస్త గూడ అర్థం చేసుకోదే ? ఈసారి శేఖరానికి నిజంగానే కోపం వచ్చింది. అక్కడినుంచి కదిలి వెళ్లిపోతూ 'సరే. నీయిష్టం. నీయిష్టం వచ్చినట్టు తిరుగు. కానీ యీసారి కాలునొప్పి అంటే మటుకు' శేఖరం ఏదో చెప్పబోయాడు.

'అనను. అనను. అంటే ఒట్టు—సరేనా ? కాలు నొప్పేస్తే కాదు — నా రెండుకాళ్లు తీసేసినా, రెండు చేతులు నరికేసినా, కళ్లు రెండూ గుంటలుపడి కన్పించకపోయినా బాధ అనిగాని, అబ్బా అనిగాని అనను సరేనా ?' శేఖరం వంక చూస్తుండగానే మంజు కళ్లు నీళ్లతో నిండిపోయినాయి.

'మంజూ' శేఖరం చప్పున దగ్గరకు రాబోయాడు. కానీ అతను వచ్చేలోపలే అక్కడ్నించి పారిపోయింది మంజు మొహం రెండు చేతుల్లో కప్పుకుని.

ఆరోజు భోజనం చెయ్యకుండానే వెళ్లిపోయాడు శేఖరం. మంజు యేదన్నా భరిస్తుంది కాని శేఖరం వేళకు భోజనం చెయ్యకపోతే ఊరుకోలేదు. అతను బైట ఏదీ తినడు. అందరిలా అతను హొటల్ తిళ్లకి అలవాటుపడ్డవాడు కాదు. ఉదయం యిచ్చిన కాఫీ గూడా తాగలేదు. 12 గంటలకు క్యారియర్‌లో భోజనం సర్ది రాజుతో ఆఫీసుకి పంపింది. క్యారియర్‌తోపాటు 'నామీద కోపం యీ భోజనంమీద చూపించకండి. మీరు పూర్తిగా భోంచేసిందీ లేనిదీ రాజు పరీక్షగా చూస్తూనే ఉంటాడు. త్వరగా వచ్చెయ్యండి" అని రాసి పంపింది.

క్యారియర్ తీసుకుని రాజు వెళ్లిపోయాడు. "అవును. నేనే సర్దుకోవాలి. శేఖరం మగవాడు. అతనికి బోలెడన్ని పనులుంటాయి. ఎప్పుడూ నా కొంగు పట్టుకుని కూర్చోమంటే ఎలా సాగుతుంది. అతను నిర్వర్తించవలసిన కర్తవ్యాలలో నాపట్ల చూపే ఆదరాభిమానాలు ఒక భాగం మాత్రమే. నాకు అతను ఒక్కడే లోకం కావచ్చు. కానీ అతనికి నే నొక్కదాన్నే లోకం ఎలా అవుతాను ? అది నేనే అర్థం చేసుకోవాలి" అనుకుంది.

భోజనం అదీ పూర్తిచేసుకుని మంజు వచ్చి హాల్లో కూర్చుంది. కళ్లు గడియారాన్ని గమనిస్తున్నాయి. చెవులు చప్పుడు కాబోయే పాదాల శబ్దానికి ఎదురు చూస్తున్నాయి. చేతులు మటుకు పరధ్యానంగా దిండు కవరుమీద రంగు దారాలతో పూలు కుడ్తున్నాయి. మనసు మరో చోట ఆలోచిస్తోంది. ఈసరికి రాజు వెడ్తాడు. క్యారియర్ టేబిల్‌మీద పెట్టి తనిచ్చిన ఉత్తరం యిస్తాడు. అది చదువుకున్న శేఖర్ వచ్చి కోపంగానే భోజనం ముందు కూర్చుంటాడు. కూర్చోబోతుండగా మరోసారి తన మాటలు జ్ఞాపకం వస్తాయి. శేఖర్ తల తిప్పిచూస్తాడు. ప్రక్కన ఏదో సర్దుతున్న నెపంతో రాజు నిలబడి ఉంటాడు. రాజుని గమనించిన అతను నవ్వుకుంటూ శ్రద్ధగా

భోంచెయ్యొచ్చు. లేకపోతే లెక్కేమిటని నిర్లక్ష్యంగానూ భోంచెయ్యొచ్చు.

బైట సైకిల్‌బెల్ వినపడటంతో మంజు ఉలిక్కిపడి తలెత్తింది. రాజు క్యారియర్ తీసుకుని తిరిగి వచ్చాడు.

"ఏమన్నారు అయ్యగారు ?" గబుక్కున అడిగేసింది.

సమాధానంగా రాజు నవ్వుతూ ఏం చెప్ప లేదు. పోనీ జేబులోంచి ఏ కాగితమూ తీసి యివ్వనూ లేదు. నిదానంగా దగ్గరకు వచ్చి 'ఆఫీసులో లేరమ్మా. వచ్చి ఒక పది నిముషాలు ఉండి వెళ్ళిపోయారని చెప్పారు. క్యారియర్ తెచ్చేశాను' అన్నాడు.

మంజు చేతులు అంతవరకు కుడుతున్న దిండు గలీబుని నిర్లక్ష్యంగా పక్కకు విసిరేసాయి. అంత వరకు ఆసక్తితో గడియారం వంక చూస్తున్న కళ్ళు కోపంతో ఎరుపెక్కాయి. పెదవులు మటుకు లోపల కలిగిన కోపాన్ని దాచుకుని 'సరే, నువ్వెళ్ళి లోపల పని చూసుకో' అన్నాయి.

రాజు లోపలికి వెళ్ళిపోయాడు. మంజు లేచి వచ్చి గదిలో మంచంమీద పడుకుంది. ఎక్కడకు వెళ్ళినట్లు ? ఇంకెక్కడికి ? క్లబ్ వార్షికోత్సవం దగ్గరకు వస్తోందిగా—ఆ రాజాదగ్గరకు వెళ్ళి ఉంటారు. వెళ్ళేవారు భోంచేసి వెళ్ళగూడదూ ? తనిక్కడ అనవసరంగా ఖంగారు పడుతూంటే యింకేం—ఆ రాజాదగ్గర భోంచేసి హాయిగా నవ్వుతూ సిగరెట్ కాల్చుకుంటూ ఖబుర్లు చెబుతుండవచ్చు. మంజు ఒకసారి తన పాదంవైపు చూసుకుంది. దెబ్బ తగలటం వోవిధంగా మంచి గానే అయింది. తనకి కొన్ని లోతులుతోపాటు మరికొన్ని అర్థాలు కూడా తెలిశాయి. పోనీ చెప్పగూడదూ యిలా వెడుతున్నానని. తను కాదంటుందా ? పోయిన కోపం రెట్టింపు బలంతో వచ్చి మళ్లీ తిష్ట వేసింది. ఆరోజు కాదు. ఆరు రోజులు. ఆరు నెలల వరకూ శేఖర్‌తో ఆప్యాయంగా మాట్లాడకూడదు. అతను కేవలం భార్యగా చూస్తుంటే తనేనా చూడలేంది. తనూ చూడగలదు. ఈ క్షణంతో అతను కేవలం భర్త! భర్తగా యివ్వవలసిన గౌరవం మాత్రమే యిస్తుంది. అపైన పిసరంత ఆప్యాయత గూడ చూపించగూడదు. అంతే. మంజు మనసులో గట్టిగా ఒట్టువేసుకుంది.

హాల్లో గడియారం మూడు కొడుతుండగా వాకిట్లో కారు హారన్ విన్పించింది. ఆ కారు హారన్ శేఖర్‌దని తెలిసిన మంజు మంచంమీద నుంచి లేవలేదు. హాల్లో ఏదో పనిచేస్తున్న రాజు గేటు తీయటం కోసం పరుగెత్తిన శబ్దం విన్పిస్తోంది. లోపలికి కారు వచ్చిన శబ్దం కూడ విన్పిస్తోంది. వింటూ పడుకుంది మంజు ఏమాత్రం చలనం లేకుండా !

రాజు పరుగెత్తుకుంటూ లోపలికి వచ్చాడు. 'అమ్మగారూ. శేఖరం బాబుకి కళ్ల కేమిటో కట్టు కట్టారు. వెంట డాక్టర్ యోగానందంగా

రున్నారు.' రాజా మాటలు పూర్తిగా వినకుండానే మంజా లేచి హాల్లోకి పరుగెత్తుకొచ్చింది. అప్పటికే శేఖరం లోపలికి వచ్చాడు. అతని కళ్ళు రెండు తెల్లటి బాండేజితో ఉన్నాయి. చెయి పట్టుకుని నడిపిస్తున్న డాక్టర్ యోగానంద్ గోడవారగా ఉన్న కుర్చీ చూపిస్తున్నాడు. ప్రక్కన రాజా గూడా ఉన్నాడు.

'ఏమిటది. ఏమైంది ?'హాల్లో గుమ్మందాటి రాబోయి, ఆగిపోతూ అంది మంజు. ఆరోజు తన పాదం తెగినప్పుడు సరీగ్గా ఏ కుర్చీలో కూర్చుందో అదే కుర్చీలో కూర్చున్నాడు, శేఖరం.

మంజు పిలుపుకి రాజా తల తిప్పి చూసాడు. డాక్టర్ యోగానంద్ మంజు వైపుగా వస్తూ 'ఈరోజు లేచినవేళ చాలా మంచిదమ్మా. చాలా పెద్ద అపాయం. వెంట్రుకవాసిలో తప్పిపోయింది. ఈరోజు శేఖరం కన్ను పూర్తిగా పోవాల్సింది. కేవలం నీ అదృష్టం' అన్నాడు.

'ఏమైంది ?' అస్పష్టంగా యింకా అలాగే విలబడిపోయి అడుగుతోంది మంజు.

''క్లబ్ వార్షికోత్సవం రేపని మీకు తెలుసు గదా ! స్టేజీ ఏర్పాట్లు చూస్తున్నాం. రేపు మేం వెయ్యబోయే నాటకానికి ప్రత్యేకంగా తెరలూ అవీ ఏర్పాటు చేస్తున్నాం ఆ తెరల ఏర్పాటుకి ఇనవ తీగె ప్రక్కన అమర్చి క్రింద గుంజుతున్నాం. అది సరీగ్గా ఉందో లేదో చూడబోతే శేఖరానికి పొరబాటుగ వచ్చి కంటికి తగిలింది. పైన వైర్‌ని ఫిట్ చేస్తున్న అతను శేఖరాన్ని చూడకుండా గుంజాడు. అది మొహంమీదనుంచి రాచుకు వెళ్ళటంలో చేరుకుపోయింది.

రాజా ముందుకువచ్చి చెప్పాడు.

''భయంలేదమ్మా ! అంతపెద్ద ప్రమాదం లేదు. కానీ కళ్ళకి ఏమాత్రం అలసట కలగగూడదు. అందుకే యివతలి కన్నుకి గూడ కట్టు కట్టింది. ఈరోజు, రేపు యింట్లోంచి కదలకుండా చూసే భారం నీది. రేపు క్లబ్ వార్షికోత్సవం గూడాను. ఏదైనా యింట్లోంచి కదలగూడదు. శేఖరం నీకే చెబుతోంది.'' డాక్టర్ యోగానంద్ మంజుకి ధైర్యం చెబుతున్నట్టు, హెచ్చరిస్తున్నట్టు రెండు విధాలుగా అన్నాడు.

రేపే క్లబ్ వార్షికోత్సవం. ఆరోజుకోసం శేఖరం ఎన్ని ఏర్పాటు చేస్తున్నాడో మంజుకి తెలుసు. కానీ రేపటిరోజున కళ్ళు తెరవటానికే వీలులేదు. వస్తుంది—వస్తుంది అనుకుని ఎదురుచూసిన క్షణం వచ్చినప్పుడు ఎందుకూ కొరగాకుండా పోతే ! శేఖరం మొహంలో ఎలాటి మార్పు లేదు. చాలా రోజుల్నుంచి అలా కూర్చోవటానికి అలవాటుపడ్డవాడిలా కూర్చున్నాడు.

''ఫర్వాలేదులే. నేను అన్నీ చూసుకుంటాను. నువ్వూరికే బాధపడకు.' అన్నాడు రాజా వెళ్ళబోయేముందు.

''నువ్వు చూసుకోగలవనే ధైర్యం నాకుంది.నేను ఆ స్టైవ్‌కి మటుకు వస్తాను.నాకుదిగులేంలేదు.''

దెబ్బ తగిలిందని అతను ఖంగారు పడటం లేదు. మంజుని పిల్చి దగ్గరగా తీసుకోలేదు. నిశ్చలంగా కూర్చుని రేపు జరుపబోయే వాటికి ఏవేవి తను చేశాడో—ఇంకా మిగిలినవి రాజా ఏవేవి చెయ్యాలో నిదానంగా తాపీగా చెప్తున్నాడు. అన్నీ వింటూ బొమ్మలా అక్కడే విలబడిపోయింది మంజా. క్షణంసేపు శేఖరానికి ఏ దెబ్బ తగలలేదు. అంతా నటనేమో అన్పించింది. మరుక్షణంలో అతని ఆత్మవిశ్వాసానికి అన్నీ పట్టించుకున్నట్టుండి మళ్ళీ అవసరం అయితే దేనికీ లొంగకుండా అతీతంగా ఉండే స్థిరమైన అతని వ్యక్తిత్వానికి ముగ్ధురాలయి అలాగే నిల్చుండిపోయింది.

కొద్దిసేపయిం తర్వాత యోగానంద్, రాజా వెళ్ళిపోయారు. వెళ్ళిపోబోయే ముందు, రేపు సాయంత్రం ఒక్క పావుగంట పాటు శేఖరం స్పీచ్ యివ్వవలసిన స్టైవ్‌కి కట్టువిప్పి మళ్ళీ వెంటనే కట్టేసేటట్టు ఒప్పుకున్నాడు యోగానంద్. ఒప్పుకున్నాక గాని వెళ్ళనివ్వలేదు శేఖరం.

వాళ్ళిద్దర్నీ గుమ్మందాకా సాగనంపి వెనక్కి తిరిగివచ్చింది మంజు.

''మంజూ. ఇలారా'' వెనక్కు తిరిగి వస్తున్న పాదాలచప్పుడు గమనిస్తూ అన్నాడు శేఖరం.

''గుంజొచ్చానా యిప్పటికైనా ?' అతనికి కొద్ది దూరంలోకి వచ్చి ఆగిపోతూ అంది మంజు.

''ముందిలారా ! రాజువావ్వ్వరూ యిక్కడ లేరుగదూ !'' శూన్యంలోకి చెయిజాపుస్తూ మంజా మాట వినవచ్చిన వైపుగా అన్నాడు శేఖరం. మంజా చప్పున వచ్చి శేఖరం చేయి అందుకుని అందులో మొహం దాచుకుంది.

---

రైలు ప్రయాణంలో కొడుకు అల్లరిచేస్తుంటే, తల్లి "రెండు తగల నివ్వమన్నావా! కూర్చుంటావా?" అని అంది. "కొట్టు, ఎలా కొడుతావో చూస్తాను. టికెట్టు కలెక్టరువస్తే, నా అసలు వయస్సు చెప్తాను. అని అన్నాడు కొడుకు.

ఆర్. కొండయ్య (కావలి)

---

''ఏమిటది. చ. చ. ఏడుస్తున్నావా ? ఈమాత్రానికే ? ప్రమాదం లేదుగా డా. యోగానంద్ అన్న మాటలు విన్నావా ? కేవలం నీ అదృష్టం అన్నాడు. ఏదీ నీకాలు ఎలాఉంది ? ఈరోజు నేనసలు చూడనే లేదు. 'శేఖరం వంగి తడుముతూ మంజు పాదం కోసం వెతకసాగాడు.

''నా పాదానికేం—ముందు మీరిది చెప్పండి. ఒకవేళ నిజంగానే కన్నుకి దెబ్బ తగిలినా, దురదృష్టవశాత్తు ఏ ప్రమాదం జరిగినా మీరింత నిశ్చలంగా ఉండగలరా'' శేఖరం చేతిని తన రెండు చేతుల్లోకి తీసుకుంటూ అంది మంజు.

''ఎందుకుండను ? తప్పకుండా. ఇప్పుడు నాకు చాల హాయిగా ఉంది. నిశ్చింతగా కళ్ళు మూసుకుని నీ యెదుట కూర్చోవచ్చు. నువ్వనేది, ఎప్పుడూ కోరుకునేది అదేగా. నువ్వు కోరుకున్నట్లుగా యిహ నీ ముందే కూర్చుంటా. ఒక్కసారైనా విసుక్కోమరి. చెప్తాను నీ పని.' మంజు చేతితో ఆడుకుంటూ అన్నాడు శేఖరం.

''మీ రెప్పుడూ నాముందుండాలని కోరుకోవటం—మిమ్మల్ని ఏ కుంటివారో, గుడ్డివారో కమ్మనా ? నాకోసమేనా యీ దెబ్బ తగిలింది.'' శేఖరం చేతుల్లోంచి తన చెయి గుంజుకుంటూ అంది మంజు.

''అదుగో మళ్ళీ కోపం వస్తోంది నీకు. నానుంచి నువ్వు దూరంగా పారిపోతే నేను నీవెంట రాలేనుగా. కోపం పోయిం తర్వాత మళ్ళీ నువ్వే రావాలి !'' మంజు మళ్ళీ దగ్గరగా వచ్చి చెయి యిచ్చింది. ఆ చేతిని తీసుకుని మంజుని దగ్గరకు లాక్కుంటూ అన్నాడు శేఖరం.

'చూడు మంజూ ! ప్రతిదాన్నీ నిమిత్తమాత్రంగా తీసుకోవాలి. నిజంగా బాధపడవలసిన పరిస్థితిల్లో అది మనం ఆపుకున్నా ఆగదు. కానీ—ఏదో జరగబోతోంది, కాబోతోంది అని బాధపడటం దుర్బలత్వం. జరిగిందానికి విచారించటం యోగ్యునిలక్షణం. ఎప్పుడో ఏదో జరగబోతుందీ అని ముందే బాధపడటం, అది పిరికివాళ్ళ లక్షణం. తెలిసిందా ! కంటికి దెబ్బ తగిలింది. కొంచం బాధగానే ఉంది. కానీ దాన్ని యింతగా చిత్రించుకుని మనశ్శాంతి పాడుచేసుకోవటంవల్ల కలిగిన ప్రయోజనం ఏమిటి చెప్పు ?''

''మరి నా కాలుకి తగిలిన దెబ్బ కూడ చిన్నదే—నాకంత బాధ ఎందుకన్పించాలి ? దాదాపు లోకమే శూన్యమైనట్టు, జీవితమే స్తంభించి పోయినట్టు అన్పించటం దుర్బలత్వమేనా ? అయితే నేను పిరికిదాన్నన్నమాట—మరి—''

''లేదు. నీది పిరికితనం కాదు. అదీ అందమైన భావం. కాలు ఏమైపోయినా నీకు దిగులు లేదు. కాని దానివల్ల నేను దూరమైపోతానేమోనని నీ భయం—అవునా ? ఆ భయం నాకు లేదు. నీలా నాకు నీమీద అనుమానాలు లేవు. ఒకవేళ దెబ్బ కొంచెం పైగా తగిలి నిజంగా కన్ను పోయినా నేను విచారపడేవాడ్ని కాదు. నాకు తెలుసు. నా కన్ను పోతే నువ్వు నా కన్నువవుతావని. చెప్పు. కాదా ? నేను ఉదయంనుంచి ఏం తినలేదన్న సంగతి నువ్వు మర్చిపోయావులా వుందే ? ఆకలౌతోంది. నీ చేతులో తినిపిస్తే తింటాను. ఏదీ—నన్ను మన గదిలోకి తీసుకెళ్ళు. రేపు క్లబ్‌కి కూడా నువ్వే తీసుకెళ్ళాలి. చూడు మరి నువ్వు సరదాకి నేర్చుకున్న కారు డ్రైవింగ్ ఎలా ఉపయోగపడోతుందో ! ఎక్కడ ఆలోచిస్తున్నావు ? ఒక్క దానికీ సమాధానం చెప్పవే.''

''అహ. లేదు లేదు. పదండి గదిలోకి తీసుకెడ్తాను.'' అంది మంజు కుర్చీలోంచి లేచిన శేఖరానికి చెయి ఆసరాయిస్తూ.

''ఏమిటది ?''

''మీరు చెప్పిందే ! అన్నింట్లో తిరుగుతూ మళ్ళీ అన్నింటికీ అతీతంగా ఉండటం.''

''అంతేగాని—మీలో నాకేం అనుమానం లేదు. అనవన్నమాట. అదేమో నువ్వు తెలుసుకున్న సత్యం అనుకున్నాను'' అన్నాడు శేఖరం ముందుకు వెయ్యబోతున్న అడుగు ఆపివేస్తూ.

''లేదు. లేదు. మీలో నాకెప్పుడూ అనుమానం లేదు. ఎందుకో ఒక్కొక్కసారి అలా అంటాను గాని. అదిగూడ మీకు తెలిసే ఉంటుంది. పదండి'' అంది మంజు కళ్ళు తుడుచుకుని శేఖరం చెయి పట్టుకుని ముందడుగు వేస్తూ.

మంజు మనసులో మారుమూల ఎవరో అంటున్నారు. ఇప్పుడు కాదు కొన్ని కోట్ల యుగాలు గడిచినా అంతేనేమో! స్త్రీ పురుషుల్లో ఉండేయీ అతి నాజూకైన భావాలకి మార్పు లేదేమో!అని. ★



'ఏక్ థారాజా—ఏక్ థీరాణీ' చిత్రంలో నర్గిస్.



భరణీవారి 'బాటసారి' లో నాగేశ్వరరావు

చిత్ర సమీక్ష :

# బ్రతుకు బాటల ప్రతిబింబం "బాటసారి"

బ్రతుకుబాటల్లో మన కెదురయ్యే విభిన్న మనస్తత్వాల ప్రతిబింబం, భరణీవారి సరికొత్త చిత్రం బాటసారి. అందరి మనస్సుల్లోను ఏవో తలపులు ఉంటాయి. కాని వానికి రూపులు దిద్దుకొనడం, అనుభవించడం, సుఖించడం అందరికీ సాధ్య పడదు. అలా సాధ్యపడని మూగ జీవితాల కథ—బాటసారి చిత్రానికి ఇతివృత్తం.

అతని పేరు సురేంద్రనాథ్. సుఖజీవితానికి అవకాశాలు ఉన్న వ్యక్తి. కాని ఆ అవకాశాలను వినియోగించుకొనలేని అమాయకుడు. ఆమె పేరు మాధవి. శీలవతి. గుణవతి. కాని బాల వితంతువు. బాధలకోసమే బ్రతుకుతున్న దవి పించే ఆడబడుచు. వీ రిద్దరి మధ్య పెరిగిన అనుబంధాలను మాటల్లో "బడదీది" గా చిత్రీకరించాడు శరత్‌బాబు. దీనిని దృశ్యరూపంగా ప్రేక్షకులకు అందించారు భరణీ పిక్చర్సువారు.

(దర్శకుడు—రామకృష్ణ. రచన : సముద్రాల సీనియర్, సంగీతం : వేణు, ఛాయాగ్రహణం : వెంకట్, నటీనటులు : జానకి, సూర్యకాంతం, దేవిక, ఛాయాదేవి, బేబి శశికళ, లింగమూర్తి, రమణమూర్తి, రామన్న పంతులు, బి. ఆర్. పంతులు, వంగర.)

నటీనటులకోసం పాత్రలను ప్రత్యేకంగా సృష్టించిన కథ కాదిది. నటీనటుల నటనా పటిమను పరీక్షకు పెట్టగల పాత్రలతో కూడిన కథ యిది. అందువల్లనే బాటసారి చిత్రీకరణ—సాహసంతో కూడిన ఒక ప్రయోగం. ఈ చిత్రం లోని ప్రధానపాత్రల నిర్వహణ నటజీవితానికి తలమానికం. అందువల్లనే భరణీ పిక్చర్సువారిని, నాయికపాత్ర నిర్వహించిన శ్రీమతి భానుమతిని, నాయకపాత్రకు ప్రతిరూపమైన శ్రీ అక్కినేని నాగేశ్వరరావును కళాప్రియు లందరూ అభినందించక తప్పదు.

దేవదాసు తర్వాత, తిరిగి అంతటి ఉన్నత దశను, తన నటనా పటిమతో నిరూపించు కున్నారు శ్రీ నాగేశ్వరరావు. పరధ్యానానికి పేరు గాంచిన కథానాయకుడుగా, వేషంలో, ప్రవర్తనలో, క్లుప్త సంభాషణలలో ఆయన ఈ చిత్రంలో అర్థభాగం వరకు మనను నవ్విస్తారు. కథలో ప్రత్యేకమైన హాస్యపాత్ర లేని లోటును తీరుస్తారు. కాని చివరి అర్థభాగంలో విషాదాంత నాయకుడుగా ప్రేక్షకులను విచారంలో ముంచి వేలుస్తాడు. ఇంతటి వైవిధ్యాన్ని ఆయన చూపడానికి, ప్రేక్షకుల మన్నన పొందడానికి అవకాశ మిచ్చిన పాత్ర—సురేన్.

ఇక కథానాయికగా శ్రీమతి భానుమతి, శీలవంతులు అంత తేలికగా ఏ అనుబంధాలలోను ఎలా చిక్కుకోరో, చిక్కుకున్నప్పుడు ఎలా సంక్షోభ పడగలరో ప్రతిభావంతంగా చూపారు. ఆడబడుచుల శోకాన్ని, మానసిక సంక్షోభాన్ని ఆమె చూపిన తీరు సాటిలేనిది.

అయితే భానుమతీ — నాగేశ్వరరావులు ఉన్న చిత్రం అంటే, ఆటలు, పాటలు, చిద్విలాసాలు, నృత్యాలు వగైరాలు ఉంటాయనే భావంతో ఈ చిత్రానికి వెళ్లే ప్రేక్షకుడు తప్పక నిరాశ చెందుతాడు. కథలో ఆనందం కనిపించదు. వేణు



నవ్యకళావారి 'స్త్రీ హృదయం' లో పద్మిని

సంగీతం, సముద్రాలవారి రచన, రామకృష్ణ డైరెక్షన్ కూడా అవసరమైన మెరుగులు దిద్దదు. భానుమతి పాడిన పాటలు కూడా అసందర్భా అనిపిస్తాయి. కొన్ని సందర్భాలలో చూస్తున్నది నాటకమా — సినిమా అనే అనుమానం కలుగుతుంది. అయినా చివరికి మిగిలేది భరణీవారు కొత్త చిత్రం తీశారనే సంతోషం. నాగేశ్వరరావు భానుమతి నటనలో కొత్త బాటలు చూపారనే ఆనందం మాత్రమే. ★

# వార్తాభరణం

నవ్యకళామందిర్ వారి తర్జుమా చిత్రం 'స్త్రీ హృదయం' పని పూర్తిఅయి త్వరలో విడుదల కాబోతుంది.

పద్మినీ, జెమినీగణేశన్, తంగవేలు, టి. ఆర్. రామచంద్రన్ ప్రభృతులు నటించిన ఈ చిత్రానికి దర్శకుడు శ్రీధర్ (పెళ్ళికానుక), ఛాయ : విన్సెంట్.

ఉన్నతకుటుంబాల జీవనవిధానాన్ని (మంచి చెడ్డలను) ప్రతిబింబింపచేసే ఈ చిత్రాన్ని జులై 28 న విడుదలచేయాలని సన్నాహాలు చేస్తున్నారు.

* * *

యం. యస్. యం. వారి "కొరడా వీరుడు" తర్జుమా (డబ్బింగ్) పూర్తిఅయింది. త్వరలో విశాలాంధ్రలో దండయాత్రకు బయల్దేర్తాడట.

ఈ వీరోచిత జానపద కథ ఆధారంగా చిత్రించిన ఈ చిత్రానికి తెలుగులో మాటలు అనిసెట్టి, పాటలు ములుకుట్ల, వేణుగోపాల్; సంగీతం జె. పురుషోత్తం. నిర్మాత : ములుకుట్ల సుబ్రహ్మణ్యం.

కావాల్సినన్ని కత్తియుద్ధాలు, పుష్కలమైన హాస్యం వగైరాలు ఈ చిత్రానికి ప్రత్యేకాకర్షణట.

* * *

రూపక్ మూవీస్ జానపద చిత్రం 'జగదేకసుందరి' అన్ని హంగులు సింగారించుకొని త్వరలో విడుదల కాబోతోంది.

వీనులవిందైన సంగీతం, మనోజ్ఞమైన నృత్యాలు వున్నాయని తెలుస్తోంది.

అనంతకుమార్, నళినీచోంకర్, స్వరూప, బి. యం. వ్యాస్ అమీర్‌బాయ్ ప్రభృతులు నటించిన ఈ చిత్రానికి తెలుగు మాటలు : మహారథి, పాటలు వీటూరి, వరప్రసాదరావు; సంగీతం : టి. వి. రాజు.

నూత్న గాయకుడు, సుశీల సోదరుడు శ్రీ రామచంద్రరావును పరిచయం చేస్తున్న ఈ చిత్రానికి నిర్మాతలు : పి. వి. సుబ్బారాయుడు (ఫ్లడ్‌లైట్స్ సంస్థ అధినేత) యం. వి. కె. పాణి, యస్ విశ్వేశ్వరరావు.

ఈ మాసాంతానికి చిత్రాన్ని విడుదల చేయాలని నిర్మాతలు ప్రయత్నిస్తున్నారు. ★

భరణీవారి 'బాటసారి' లో జానకి, సూర్యకాంతం.

ఈంచే లక్షణం ఏదో ఉంటూనే వుంటుంది.

నత్తివారు తమవిషయంలో అవలంబించే మంచి వైఖరినే గమనించి, తమరిని వెక్కిరించి కాంచేవారిని దయనీయులైన మహాపాపులుగా, ఒచ్చే జన్మలలో వారి కర్మకు వారు ఫలితం అనుభవిస్తారు అనే మంచివైఖరి అవలంబించాలి కాని వారి హింసకు గురియై ఇంకా క్రుంగిపోగూడదు. ఇతరులలో మంచినిమాత్రమే గుర్తించి, చెడును గమనించక పోవడం, గమనించినా గణించకపోవడం అందరికీ అవసరమే. కాని నత్తివారికి ఇది మరీ అవసరం.

ఈ పైవిధానాలన్నీ, పెద్దవారిలో నత్తి యేర్పడినా ఉపకరిస్తవి. కాని పెద్దవారు ఆత్మ విశ్వాసం కోలుపోయినప్పుడు దానిని మళ్ళీ కలిగించడానికి చాలా నేర్పా కృషి కావాలి. "విజయం సాధించే విజయం ఇంకేదీ సాధించలేదు" అని ఇంగ్లీషులో ఒక ప్రసిద్ధ వాక్యం వున్నది. నత్తివారిలో విశ్వాసం కలిగించడానికి ఉత్తమమైన పద్ధతి అతను నత్తితో అనే ఒక మాటను నత్తిలేకుండా అనిపించడం. ఆదిలో ఈపని చేయించగలగాలి. అది అసాధ్యంకాదు. ఎన్నో ఉపన్యాసాలివ్వడంకన్నా నత్తితో అనే మాటను నత్తిలేకుండా అనగలిగిననాడు నత్తివారికి ఎక్కడలేని ఉత్సాహమూ, ఆశా పుట్టుకు వస్తవి.

# మనముా-మనదేహస్థితి

(14 వ పేజీ తరువాయి)

ఆత్మవిశ్వాసం కలిగించాక, బాగా ఊపిరి పీల్చి ఏ మాటలు అనదలచుకున్నామో ఆలోచించి ఆ మాటలను నెమ్మదిగా క్రమంగా అనడానికి ఉద్యమించాలి. మొదట్లో అనలేకపోయినా పదే పదే అంటుంటే అనగలము. పెద్దవారు వంటరిగా అద్దం ముందు నుంచుని ఈ పరిశ్రమ చేయవచ్చును.

ఒకమాట అంటున్నప్పుడు ఎక్కువ నత్తివస్తే ఆ భావమునే మరొక మాటతో వెల్లడించడానికి ప్రయత్నించాలి. "ప్రజలు కష్టపడుతున్నారు' అన్నప్పుడు "జనం కష్టపడుతున్నారు" అన వచ్చును.

నత్తివారు స్నేహపాత్రులతో స్నేహం చేస్తూ నలుగురితో తిరుగుతూవుండాలిగాని, మూల దాక్కొని మొఖం తప్పించుకు తిరగకూడదు. ఆత్మవిశ్వాసం నత్తి నివారణకు పునాది.

నత్తివారిలో విడ్డూరంగా ఉండేవి మాటలు మాత్రమేకాదు. వారి ముఖకవళికలు చేష్టలు కూడా అదొక మాదిరిగా వుంటవి. నత్తి నివారణలో వాటన్నింటినీ సవరించాలి. లేకపోతే నత్తి పోయినా అవివారిని వెక్కిరింతలకు గురి చేస్తవి. ఇవి పోగొట్టడానికి అద్దంముందు నుంచుని మాట్లాడింపజేసి అది పోగొట్టుకుంటానికి వాగ్గోగి ప్రయత్నించాలి. నత్తికి మందులు ఏమీలేవు. ఆత్మ విశ్వాసము ఉచ్చారణపరిజ్ఞానంతో కూడుకున్న కృషి— యీ రెండే నివారణ సాధనములు.

నత్తివిషయంలో తల్లి దండ్రులు గమనించవలసిన విషయములు కొన్ని వున్నవి.

మాటలాడడంలో తడబడడం, ఆలస్యం చేయడం నత్తికాదు. "మరీ......నువ్వెక్కడుంటున్నావు అనడంలో, రీ మీద దీర్ఘం నత్తికాదు. మరొక వాగ్దోషం. పిల్లలలో ఒక మాట అనబోతూ అందులో మొదటి అక్షరమునో, మధ్య అక్షరమునో అనేక మారులు ఉచ్చరించడమో,ఉచ్చరించడానికి ఉద్యమించిన తరవాత గాని ఉచ్చరించలేకపోవడమో నత్తి. ఇది గమనించంగానే,పిల్లల దృష్టిలోకి ఆ లోపం తేగూడదు. పైన వివరించిన విధానములద్వారా చేతనైతే సవరించాలి. లేదా అందుకు సమర్థులైన యితరులచేత సవరింపజేయాలి.

నత్తి నివారణకు అవసరమయిన సూత్రములను మాత్రమే సూచించాను. వాటి ననుసరించి, పరిస్థితులను పరిశీలించి, చికిత్సకు పథకం వేసుకుని కృషి చేయాలి. ★

---

రూబెన్ దీపంక్రింద వుంచి "మేస్టారూ! ఇందాక మీరు వీధితలుపు వెయ్యటం మరిచి పోయారు, కదూ?" అని అడిగాడు. కాళిదాసు గుర్తుకు తెచ్చుకున్నాడు. తానింతకుముందు వీధిలోకి వెళ్ళి వచ్చేటప్పుడు ప్రహరీ తలుపు మళ్ళీ వెయ్యటం మర్చిపోయిన విషయం జ్ఞప్తికి వచ్చింది. రూబెన్ అనుమానంగా "చదువుకుంటూవుండగా నాకు వీధి తలుపు తెరిచిన చప్పుడు వినిపించిందండి. మురళితో అన్నాను కూడా. వాడేమో చెవుల నిండా దుప్పటి కప్పుకునివుండి 'ఏమీ వుండదులే పొమ్మ'న్నాడు కాళిదాసు స్తబ్ధుడై నుంచుని వున్నాడు.

మురళి యీ లోపల రూబెన్ చేతిలోవున్న దీపం తీసుకుని "మేస్టారూ! ఎవరు వచ్చినా యీ వైపు కోట గోడలావున్న ప్రహరీ దాటిపోలేరు. అందువల్ల ఆ వచ్చిన వారెవరో వీధి గుమ్మంలో నుంచి వచ్చి, పని పూర్తి చేసుకుని మళ్ళీ వచ్చిన దారినే వెళ్ళివుండాలి" అంటూ వరండాలోనుంచి క్రిందికి దిగి గుబురుగావున్న మందార చెట్ల మధ్యగా వెళ్ళాడు.

సన్నజాజి పందిరి క్రింద మురళి చేతిలోవున్న దీపపు వెలుగు కనిపిస్తున్నది. వరండాలోనుంచి కనిపిస్తున్న ఆకాశభాగంలో కృత్తికా నక్షత్రరాశి కాంతులను వెదజల్లుతున్నది. కాళిదాసూ రూబెనూ నిశ్శబ్దంగా నిలబడి, యింకా హాయిగా పడుకుని నిద్ర పోతున్న ఆ పసివాడివంక చూస్తున్నారు.

"మేస్టారూ!' అని చెట్ల మధ్యనుంచి మురళి కేక వేశాడు. మరుక్షణంలో గాలిలా పరుగెత్తుకు వచ్చి "ఇది మందార చెట్ల మధ్య నేలమీదపడి వున్నదండి" అన్నాడు.

అదొక వెండి కాలిపట్టా. దానివల్ల ఏమీ ప్రయోజనంలేదు. అది ఒక మూగ సాక్షి. తానిన్ని యేళ్ళుగా ఏ స్త్రీ పాదానికొక అలంకారంగా వుండేదో చెప్పగల శక్తి దానికిలేదు. కాళిదాసు దాన్నటూ యిటూ

# ధృవతార

(9-వ పేజీ తరువాయి)

నెమ్మదిగా వెలుగు వ్యాపిస్తున్నది. ఇన్ని గంటలుగా తమదే రాజ్యంగా యీ ప్రపంచాన్ని అజ్ఞానం వలె ఆవరించుకుని అధికారం చెలాయించిన చీకట్లు వెలుగు ప్రసరించేసరికి ఓడిపోయి అంతర్థానమై పోయాయి. ఆ వరండాలోవున్న దీపం వెలవెల పోతున్నది. మహా సంపన్నుడైన ఒక అజ్ఞాత కోటీశ్వరుడు సరదాగా ఒక తివాచీమీద వెదజల్లివుంచిన ముత్యాలూ రత్నాలూవలె మెరిసిన నక్షత్రాలు మాయమైపోయాయి. రకరకాల పక్షులు రొద చేస్తూ, ఆకాశంలో ఎగిరిపోతున్నాయి.

అప్పటికి ఆ పసివాడికి మెలకువ వచ్చినట్టున్నది. బుల్లి కాళ్ళూ చేతులూ ఆడిస్తూ, సన్నని గొంతుకతో యేడవటం ప్రారంభించాడు. అంత వరకూ నిశ్శబ్దంగా కూర్చునివున్న కాళిదాసూ, యిద్దరు విద్యార్థులూ ఉలిక్కిపడ్డారు. మురళి గబగబావెళ్ళి ఆ పక్కనే మోకాళ్ళమీద కూర్చుని ఆ పసిగుడ్డు ఏడుస్తూవుంటే వింతగా చూస్తున్నాడు. వాడొక్క క్షణం ఆగి "మేస్టరూ! వాడి నోరు లక్కపిడతలా ఎంత బావుందో చూశారా?" అని అడిగాడు.

కాళిదాసులేచి రూబెన్‌తో "నువ్వు వెంటనేవెళ్ళి పార్థసారధిగార్ని పిలుచుకురా" అన్నాడు. రూబెన్ "అలాగేనండి" అంటూ పరిగెత్తుకుపోయాడు. మురళి పసివాడి పొట్టమీద చేత్తో నెమ్మదిగా తడుతూ, "మా బాబుకదూ! ఊరుకోరా నాయనా" అంటున్నాడు. చిత్రంగా మరుక్షణంలో ఆ పసివాడు ఏడుపు మానేశాడు. కాళిదాసు నెమ్మదిగా నడిచి ముందు వైపు వరండాలోకి వచ్చాడు. అతని చేతిలో వెండి కాలిపట్టా వుంది.

అది ఆ వీధిలో చివరి యిల్లు. చుట్టూ ఎత్తయిన ప్రహరీవుంది. ఆవరణలో రకరకాల ఈశాన్య మూలలో ఒక పున్నాగచెట్టూ, దానికి కొంచెం దూరంలోనే తెరిచి వుంచిన గొడుగులా పెరిగిన ఒక పొన్నచెట్టూ వున్నాయి. పున్నాగచెట్టు క్రింద లెక్క లేనన్ని పూలు రాలి వున్నాయి. పొన్న చెట్టున కాయలు గుత్తులు గుత్తులుగా కాచి వున్నాయి.

ఇంతలో పార్థసారధి రానే వచ్చాడు. ఆయన ఇంగ్లీషు టీచరు. చాలా అనుభవంకల వ్యక్తి. నలభై యేళ్ళవాడు. ఆయన వస్తూనే "ఏమిటయ్యా! కాళీ! మీ శిష్యుడు ఉద్దండపిండంలా వున్నాడే. 'నుంచున్నపళంగా మిమ్మల్ని రమ్మన్నా'రంటాడు గాని, సంగతేమిటో చెప్పడు. నుంచున్న పళంగానే వచ్చేశాను. ఏమిటి సంగతి?" అని అడిగాడు.

కాళిదాసు జవాబు చెప్పబోతూ వుండగా 'బాబుగారూ! అంటూ పని మనిషివచ్చి గుమ్మంలో నుంచుంది. ఆమెతో "నువ్వు కాస్సేపలా ఉండు" అని చెప్పి కాళిదాసు పంచలోకి దారి తీస్తూ, పార్థసారధి నుద్దేశించి, "ఇదేమిటో చాలా చిత్రంగా వుంది. తెల్లవారు జామునే లేచి ఆ పిల్లలిద్దర్నీ చదువుకునేందుకులేపి నేను మళ్ళీ వెళ్ళి పడుకున్నాను. వాళ్ళు మేలుకునివుండి చదువుకుంటూనే వున్నారు. నా కింకా మళ్ళీ నిద్ర బాగా పట్టనేలేదు. అయినా ఏ అలికిడీ లేకుండా ఎవరీ దుర్మార్గం చేశారో అర్థం కావటంలేదు. ఇదుగో యిలా వచ్చి చూడండి" అన్నాడు. మురళి యింకా అక్కడే కూర్చుని వున్నాడు. పసివాడు మళ్ళీ నిద్ర పోతున్నాడు.

పార్థసారధి ఆశ్చర్యపోయాడు. ఒక్క క్షణం ఏమీ మాట్లాడలేక శిలా విగ్రహంలా నుంచున్నాడు. తర్వాత ముక్కుమీద వేలు వేసుకుని "అన్నన్నా ఎంత అన్యాయపు రోజులొచ్చాయి! పిదప కాలం, పిదప బుద్ధులూనూ ! ఏ తల్లికి పుట్టిందో యీపాడుబుద్ధి. నవ మాసాలూమోసి, కని యిలా చేసుకున్న మూర్ఖురాలెవరో! ఛీ ఛీ! మనుషులకూ,

ఆయన మళ్ళీ ఆలోచనలో పడిపోయాడు.

కాళిదాసు చేతిలోవున్న వెండి కాలి గొలుసు వంక చూస్తూ నుంచున్నాడు. వరండాలో రెండు మూడు పిచ్చికలు అటూ యిటూ ఎగురుతూ రొద చేస్తున్నాయి. మందార చెట్లకు చక్రాలవలె పెద్ద పెద్ద పూలు పూచి వున్నాయి. అందరూ నిశ్శబ్దంగా నిలబడివున్నారు.

పార్థసారధి మళ్ళా నెమ్మదిగా 'ఎంత అమాయకంగా నిద్రపోతున్నాడో. అంటే మళ్ళీ చాలా సేపటి వరకూ లేవకుండా కడుపునిండా పాలిచ్చి యిలా వదిలివెళ్ళిపోయిందన్నమాట ఆ దుర్మార్గురాలు" అన్నాడు. ఆయన నెమ్మదిగా వెనుదిరిగి నడవటం ప్రారంభించాడు. కాళిదాసు ఆయన వెంటనే నడుస్తూ, "మీరేమీ చెప్పకుండానే వెళ్ళిపోతున్నారా?" అన్నాడు.

"అబ్బే. వెళ్ళటంలేదు. అలా లోపలికి వెళ్ళి మాట్లాడుకుందాం." అన్నాడాయన.

కర్మసాక్షి ఉదయించాడు. నులివెచ్చని బంగారు సూర్యకిరణాలు కిటికీలోనుంచి లోపలికి ప్రసరిస్తున్నాయి. కాళిదాసూ, పార్థసారధీ ముందు గదిలో కూర్చున్నారు. బల్లమీద వున్న గడియారం ఆరు గంటలు చూపిస్తున్నది. ఒక కుర్రవాడు సైకిల్ మీద వచ్చి దినపత్రికను గదిలో పడేసి వెళ్ళిపోయాడు.

పార్థసారధి కాస్సేపాగి "కాళీ! నువ్వు ప్రాజ్ఞుడివి. బుద్ధిమంతుడివి. నీకు చెప్పవలసినవాణ్ణి కాకపోయినా, కాస్త వయస్సులో పెద్దవాణ్ణి కాబట్టి నే నా అధికారం పుచ్చుకుంటున్నాను. ఇది కేవలం యాదృచ్ఛికంగా జరిగినదని నేను నమ్మలేకపోతున్నాను. చాలా కాలంగా నిన్నూ, నీ యింటినీ పరిశీలించనిదే యింత తేలికగా ఎవరూ యీ పని చేసిపోలేరు. ఇప్పు డీ వెండి గొలుసు చేతులో పెట్టుకుని నువ్వు వాకబు చేస్తూ బయలుదేరనూలేవు. దానివల్ల ఏవిషయమూ తేలదు. ఆ తల్లి ఎవరో అంతరాత్మ నోరు మూసి యింతటి పవిత్ర బంధాన్ని తెంచుకుని నీమీద వదిలిపోయింది. నువ్వీ బాధ్యతను పవిత్ర హృదయంతో స్వీకరించటం మంచిదని నా అభిప్రాయం" అన్నాడు.

కాళిదాసు విభ్రాంతుడైనాడు. "మీరలా సెలవిస్తున్నారేమిటి? నేనింతవరకూ ఏ అనాధాశ్రమం వారికో అప్పగిస్తే వదిలిపోతుందనుకుంటూ వున్నానే! అయినా యీ నెత్తురు గుడ్డును పెంచటం సామాన్యమైన విషయమా మేష్టారూ! నాకూ వృద్ధురాలైన తల్లి తప్పితే మరెవరూ లేరుకదా! ఆవిడకయినా నా స్థితి ఎంత గుండెకోతగావుందో మీకు తెలుసుగా! ఇక్కడ వున్నన్నినాళ్ళూ "నేనెంతోకాలం బ్రతకబోనురా. మళ్ళీ మరో సంబంధం చూసి చేసుకోమని ఒకటే సాధిస్తూ వుండేది. నాకే యిష్టం లేక ఆమెను సమాధానం చెప్పకుండా తప్పించుకు తిరిగేవాణ్ణి. ఆమె నన్నొంటరిగా వదిలిపెడితేగాని, నా కష్ట సుఖాలు నాకు తెలిసిరావని యిలా నన్ను వదిలి మా అక్కగారి దగ్గరికి వెళ్ళిపోయింది. మళ్ళీ ఎప్పుడు వస్తుందో చెప్పలేను. ఇంతలో యిలా అయింది. నా కేమిటో అంతా అయోమయంగా వుంది" అన్నాడు.

పార్థసారధి తలవూపి "అనాధాశ్రమంలో పారేస్తే వదిలిపోతుందనుకున్నావా? నాకు నమ్మకం కుదరటంలేదు కాళీ. ఎవరో బుద్ధిపూర్వకంగానే నీ కీ బాధ్యత అప్పగించివుంటారు. తర్వాత నీ యిష్టం. అయినా అనాధాశ్రమంలో పిల్లలను పెట్టే బాధలు నీకు తెలియనివికావు. వాడక్కడ పెరిగి పెద్దవాడై ఏ దొంగగానో, రౌడీగానో తయారవుతాడు. అంతే" అన్నాడు.

కాళిదాసు నిశ్శబ్దంగా కూర్చున్నాడు. మురళి పరిగెత్తుకుంటూవచ్చి "మేష్టారూ! పిల్లవాడు లేచి ఏడుపు మొదలెట్టి అప్పలమ్మ ఎత్తుకోగానే ఏడుపు మానేశాడండి" అన్నాడు. పార్థసారధి అతన్ని "పని మనిషికి మీరేం చెప్పారు?" అని అడిగాడు. మురళి "అంతా చెప్పేశామండి. విని 'అయ్యో' దానికి చేతులెట్లా వచ్చినయ్యో! అది తల్లికాదు. రాక్షసి' అన్నదండి" అన్నాడు.

పార్థసారధిలేచి "నేనింతకన్నా ఏం చెప్పను? అయినా ఒకసారి ఆలోచించి చూడు. ఉచితమని తోచినట్లు నడుచుకో. నే నింక వెళ్ళివస్తాను" అన్నాడు.

కాళిదాసేమీ మాట్లాడలేదు. నిశ్శబ్దంగా లేచివచ్చి ఆయనను సాగనంపి వెనక వైపు వంచలోకి వెళ్ళాడు. పనిమనిషి పిల్లవాణ్ణి ఎత్తుకుని అక్కడే నిలబడి వుంది. ఆమెకు నలభై యేళ్ళుంటాయి. జుట్టు అక్కడక్కడ నెరిసింది. ఆమె కాళిదాసును చూసి "అట్లావుండారేం బాబుగారూ! భగవంతుడిచ్చాడనుకోండి. పిల్లల్నికంటే తీరిపోదు బాబూ! పెంచే అదురుష్టంలేని బతుకెందుకు?" అన్నది

కాళిదాసు కాస్సేపాగి "అది సరే. ఇంకా కళ్ళయినా తెరవని యీ పసిగుడ్డును పెంచటం సామాన్యమైన విషయమా అప్పలమ్మా! ఆయన కూడా అదే చెప్పారు. అయినా యింట్లో ఆడ దిక్కయినా లేదుకదా? ఏం చెయ్యను నే నిప్పుడు?" అన్నాడు. అందరూ మళ్ళీ ముందువైపు వంచలోకి వచ్చారు.

రెండు మూడు కాకులు పొన్నచెట్టుమీదవాలి 'కాకా' అని అరుస్తున్నాయి. 'హరిలో రంగా హరి' అంటూ ఒక సాతాని జియ్యరు కాళ్ళ గజ్జెలు గల

# ధ్రువతార

గలలాడుతూవుండగా భిక్షాటనకు బయలుదేరాడు. నాలుగైదుపిట్టలు క్రమశిక్షణతో గూళ్ళను విడిచి ఆహారాన్వేషణలో బయలుదేరిపోతున్నాయి. పొడుగాటి ముక్కుగల ఒక చిన్నపక్షి పున్నాగచెట్టు కొమ్మమీద కూర్చుని రాగాలు తీస్తున్నది. ఆ యింటికి ఉత్తరాన కొద్దిదూరంలోఉన్న బొమ్మ జెముడు పొదలో ఒక అందమైన పువ్వు పూచింది.

అప్పలమ్మ కొద్ది సేపాగి "మీ కాదిగు లక్కర్లేదు లెండి. మా అమ్మాయి బాలింతరాలు. పోయిన నెలలో నేను నాలుగైదు రోజులు పనిలోకి రాలేదు, బాబుగారూ! అప్పుడు మా అమ్మాయికి పురుటి రోజులు. ఆడపిల్ల పుట్టింది. మా అల్లుడు పొంగిపోయినాడండి. మొదటిసారిగా ఆడపిల్ల పుడితే అదురుష్టమని ఒకటే మురిసిపోయినాడు. నేనన్నీ సరిజేసుకుంటాలెండి బాబూ! ఏ పాలుపట్టి పెంచినా బతికి బట్టకడతాడు. మీరేమీ బెంగెట్టుకోమాకండి బాబుగారూ! భగమంతుడిచ్చిన బిడ్డ......ఆ తల్లికి లేని అదృరుష్టం మనకుందనుకోవాలిగాని ......' అన్నది. కాళిదాసు కళ్ళు ఆర్ద్రములైనాయి. మురళీ రూబెనూ పుస్తకాలు సర్దుకుని "మేం వెళ్తాం మేష్టారూ" అని చెప్పి వెళ్ళిపోయారు.

కాళిదాసు లోపలికివెళ్ళి ఎటూ తేల్చుకోలేనివాడిలా ఒక్క నిముషంసేపు కుర్చీలో కూర్చుండిపోయాడు. తర్వాత ఒక నిర్ణయానికివచ్చి టర్కీ టవల్ భుజంమీద వేసుకుని పంచలోకివచ్చి "అలాగే చేద్దాం. నువ్వింక యీ పూటకు వెళ్ళిపో అప్పలమ్మా! నేను మధ్యాహ్నం మూడు గంటలకే యింటికి వచ్చేస్తాను. అప్పటికి రా" అన్నాడు.

ఆమె సంతోషంతో "అట్టాగేబాబూ" అంటూ పిల్లవాణ్ణి భుజంమీద పడుకోబెట్టుకుని గుడ్డసరిగా కప్పి నెమ్మదిగా నడిచి వెళ్ళిపోయింది.

క్రమంగా ఎండ వేడిమి హెచ్చుతున్నది. కాళిదాసు నూతిదగ్గర స్నానంచేసి యింట్లోకి వెళ్ళాడు. అతని ఆలోచనలకు దరీ తెన్నూ కనిపించటంలేదు. తెల్లవారినప్పటినుంచీ అంతా చిత్రంగా కథలోవలె జరిగిపోయింది. తలుచుకుంటేనే ఆశ్చర్యంగా వుంది. ఆ తల్లి అంతటి మధురమైన అనుబంధాన్ని ఎలా త్రెంచుకోగలిగిందో! పార్థసారథి అన్నట్టు అది అంతరాత్మ నోరుమూయడమే.

వాకిట్లోనుంచి పాలవాడికేక వినిపించింది. కాళిదాసు పాలు పోయించుకుని, వంట యింట్లోకి వెళ్ళి కుంపట్లో బొగ్గులువేసి నిప్పంటించి కాఫీకి నీళ్ళు పడేసి కాస్సేపు విసిరి మళ్ళీ ముందు గదిలోకి వచ్చాడు.

నేలమీద పడివున్న దిన పత్రికను చేతిలోకి తీసుకుని కుర్చీలో కూర్చున్నాడు. అతని కెదురుగా గోడమీద రెండు పెద్ద ఫోటోలున్నాయి. అందులో మొదటిదాన్లో కాళిదాసు తల్లీ తండ్రీ వున్నారు. కాళిదాసు తండ్రిపేరు రామానుజరావు. ఆయన జీవితం గంగా స్రవంతి వంటిది. ఆయనకు పిత్రార్జితమైన భూమిమీద వచ్చే ఫలసాయం చాలా తక్కువగా వుండేది. చిన్నతనంలోనే తల్లీ, తండ్రీ పోగా, అన్నగారి పోషణలో పెరిగి ఫిఫ్తుఫారందాకా చదివాడు. ఆయన అన్నగారు ఆస్తినంతటినీ జూదా

చదువుకు కూడా ఏమీ మిగల్చకుండా కన్నుమూశాడు. రామానుజరావు అప్పటినుంచి స్వశక్తితో కష్టపడి వృద్ధిలోకి వచ్చాడు. ఆయన చనిపోయేనాటికి యిరవై ఎకరాల బంగారంపండే మాగాణి భూమికి యజమాని. కోటగోడవంటి బలమైన ప్రహరీతో చక్కని యిల్లు కట్టించాడు. ఇదంతా ఆయన స్వార్జితం. ఆయన చనిపోతూ వ్రాసిన విల్లు ఆ రోజులలో బంధు జనులలో పెద్ద అలజడి రేపింది. ఆయన తన స్వార్జితమైన యిరవై ఎకరాల క్షేత్రంలో వచ్చే ఆదాయాన్ని ఒక అయుర్వేద ధర్మాసుపత్రికి వ్రాసియిచ్చాడు. తన కుమారుడికందులో ఏ విధమైన హక్కు లేకుండా చేశాడు. కాగా, యింటిని మాత్రం కుమారుడికీ, భార్యకూ అప్పగించాడు. బంధువు లందరూ యీ నిర్ణయాల పట్ల తీవ్రమైన ఆందోళన వ్యక్తం చేశారు. 'అది మార్చనిదే వీలు లేద'ని చాలామంది చివరికొద్ది గంటలలోనూ ఆయనను వత్తిడి చేశారు. కాని అప్పటికి బి. ఏ. ప్యాసై వున్న కాళిదాసు వారందరినీ వ్యతిరేకించి ఆయనతో "మీరు చేసిన నిర్ణయం చాలా ఉత్తమంగా ఉంది. నేను అందుకు మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నాను. ఈవిషయమై మీరేమీ బెంగ పెట్టుకోవద్దు. నా రెక్కలమీద మీకున్న నమ్మకం నా కెందుకులేకపోవాలి? చిన్నప్పటినుంచి ఏ కొరతా లేకుండా పెంచారు. చదువు చెప్పించారు. ఇప్పుడు మీరు కష్టపడి సంపాయించిన యీ ఆస్తిమీద వచ్చే ఆదాయాన్ని తింటూ సోమరిగా కాలం గడపటం నాకూ యిష్టంలేదు. మీలాగే నేనూ కష్టపడి వృద్ధిలోకి రావాలని ఆశీర్వదించండి. నా కంతే చాలు" అన్నాడు. ఆ మాటలువిన్న రామానుజరావు గారి కళ్ళలో నీళ్ళు నిండాయి. ఆయన కుమారుణ్ణి నిశ్శబ్దంగా మనస్సులో ఆశీర్వదించి ఆనాటి సాయంకాలమే కన్నుమూశాడు.

ఆ ఫోటోలో ఆయన ప్రక్కనే కాళిదాసుతల్లి నిలబడివుంది. ఆమె నుదుట వెడల్పయిన కుంకుమ బొట్టువుంది. వెడల్పయిన సరిగంచు పట్టుచీర కట్టుకునివుంది. కాళిదాసు తల్లిని స్మరించుకున్నాడు. ఆమె యిప్పటి స్థితి శోచనీయంగావుంది. ఆమె శరీరమంతా ముడుతలుపడి జరాభారంతో క్రుంగిపోయింది. ఆమె తల పూర్తిగా నెరిసి ముగ్గుబుట్టలా తయారైంది. ఆమె కన్నులు గాజుబిళ్ళలవలె కాంతి విహీనములై వున్నాయి. సాయంకాలంపూట పంచలో కూర్చుని చేటమీదికి వంగి చూస్తూ బియ్యంలో రాళ్ళు ఏరుతూవుండే తల్లి రూపం గుర్తుకు రాగానే కాళిదాసు కళ్ళు చెమ్మగిలినయ్.

ఆలోచనలో పడిన కాళిదాసు నీళ్ళు పొంగిన శబ్దం విని లేచి త్వరత్వరగా వంట యింట్లోకి వెళ్ళాడు. నీళ్ళు మరుగుతూ వున్నాయి. అతడు నీళ్ళలో పాడివేసి దింపి పాలగిన్నె కుంపటిమీదవుంచి అక్కడే కూర్చున్నాడు.

క్రమంగా పొద్దెక్కుతున్నది. దాహంతో బాధపడుతున్న కాకి వకటి నూతి గిలకమీద కూర్చుని అరుస్తున్నది. ఎవరో బిచ్చగాడు పాట పాడుకుంటూవచ్చి, 'కళ్ళులేని కబోదిని బాబయ్యా. కనికరించండి' అని అరుస్తున్నాడు. కాళిదాసులేచి

కాస్త బియ్యపు గింజలు వాడి కొలతో వేసి లోప లికి వచ్చేసరికి పాలు పొంగుతున్నాయి. అతడు త్వర త్వరగా పాల గిన్నె దింపి కాఫీ కలపటం ప్రారంభిం చాడు. కొద్దిగా పాలు కుంపట్లో పడ్డాయి కాబోలు వాసన వస్తున్నది.

కాళిదాసు కాఫీ త్రాగి ఒక గిన్నెలో బియ్యం

# ధ్రువతార

కడిగిపోసి కుంపటిమీద వుంచాడు. కాస్సేపు విసు రుతూ కూర్చుని తర్వాత ముందు గదిలోకివచ్చి పత్రిక తీసుకుని చూడటం ప్రారంభించాడు.

పంచలో ఎవరో వచ్చిన సవ్వడి అయింది. తలెత్తి చూసేసరికి పుస్తకాల సంచి భుజానికి తగిలించుకుని మురళి నిలబడి వున్నాడు. కాళిదాసు గడియారంవంక చూశాడు. తొమ్మిదిన్నర అయింది. అతడు దినపత్రిక మూసివేస్తూ "ఏమోయ్ అప్పుడే బడికి బయలుదేరావా?" అని అడి గాడు. మురళి 'అవునండీ' అంటూ అటూ యిటూ

చూసి నెమ్మదిగా "అయితే మేష్టారూ! పిల్లివా డెక్కడా కనిపించడేమండీ?" అని అడిగాడు. కాళిదాసు నవ్వుతూ "అప్పలమ్మ కు పెంచుకోమని యిచ్చేశాను" అన్నాడు. మురళి బాధగా "నిజమేనా మేష్టారూ?" అన్నాడు. అతన్ని చూస్తూవుంటే కాళిదాసుకు నవ్వు ముంచుకుని వస్తున్నది. అతడు నవ్వు ఆపుకుని "లేదులే. అప్పలమ్మ పాలు పట్టి తీసుకువస్తానని వెళ్ళింది. సాయంకాలానికి యిక్కడికి తీసుకువస్తుందిలే. ఆమె కూడా తోడుగా యిక్కడే పడుకుంటుంది" అని చెప్పాడు. మురళి మొహం వికసించింది. వాడు కాస్సేపాగి నెమ్మదిగా "అంతా విని మా అమ్మ నిర్ఘాంతపోయింది మేష్టారూ! అప్పలమ్మ అన్నట్టుగానే 'అది తల్లి కాదు. రాక్షసి అయివుంటుంద'ని అన్నదండి" అని చెప్పాడు. కాళిదాసు "ఓరి పిడుగా! మీ అమ్మగారితో చెప్పేశావా?" అన్నాడు. తనికిప్పుడొక కొత్త సమస్య ఎదురైంది. ఈ విషయం అందరికీ తెలుస్తుంది. అందరూ దీన్నిగురించే మాట్లాడుతారు. పార్థసారథి యీ విషయాన్ని అందరితోనూ చెప్పకుండా వుండడు. ఇవాళ స్కూల్లో తనమీద యీ దాడి తప్పదు కాబోలు.

మురళి, 'నేను బడికి పోతున్నానండీ' అంటూ వెళ్ళిపోయాడు. కాళిదాసు చాలా సేపు అలాగే నిశ్శబ్దంగా కూర్చున్నాడు. దిన పత్రిక నేలమీద పడివుండి గాలికి రెప రెప కొట్టుకొంటున్నది. ఒక గడ్డిపరకకోసం పిచికలు రెండు వాదులాడుకుంటున్నాయి. మరో పిచిక తీర్పు యిచ్చేందుకు కాబోలు హడావిడిగా ఎగిరివచ్చి బల్లమీదనుంచున్నది. ఒక ఆరేళ్ళపిల్లవచ్చి పున్నాగ చెట్టుక్రిందరాలివున్న పూలను ఏరి వడిలో పోసుకుంటున్నది.

కాళిదాసులేచి అన్నం గిన్నెదింపి ఆలోచించాడు. ఇక యీ పూట ఆధరువులు చేసుకునే వీలులేదు. అప్పుడే పది కావస్తున్నది. కాబట్టి క్రితం రోజు చేసుకున్న పచ్చడి మెతుకులతో తిండి కానిచ్చి బడికి వెళ్ళటం మంచిది.

మరో పావుగంటలో త్వరత్వరగా భోజనం ముగించి కాళిదాసువంట యింటి తలుపువేసి ముందు గదిలోకి వచ్చి స్కూలుకుపొయ్యే ప్రయత్నంలో మునిగిపోయాడు. అతడు తలుపు తాళం వేసి వీధిలోకి వచ్చేసరికి చేతిలో గొడుగుతో రామశాస్త్రి ఎదురుగా వస్తున్నాడు. ఆయన ఆ వూళ్ళో వున్న ఆయుర్వేద ధర్మవైద్యశాలలో పని చేస్తున్నాడు. యాభై యేళ్ళవాడు. సన్నగా వుంటాడు. కళ్ళకు చత్వారంజోడు పెట్టుకునివుంటాడు.

ఆయన కాళిదాసును చూసి ఆగి "నమస్కారం బాబుగారూ!" అన్నాడు. కాళిదాసు ప్రతి నమస్కారంచేసి "ఇలా దోవతప్పి వచ్చినట్టున్నారే శాస్త్రిగారు" అన్నాడు. ఆయన నవ్వి "అబ్బే! మీ కోసమే బయలుదేరాను. ఈనెల యిరవై రెండో తేదీన మన వైద్యశాల వార్షికోత్సవం. మా మేనేజరుగారు మిమ్మల్ని నిరంజనశర్మగారి దగ్గరికివెళ్ళి మాట్లాడి రమ్మన్నారు. మరిచిపోకుండా వెళ్ళి వస్తారా?" అన్నాడు.

కాళిదాసు నడుస్తూనే తల ఊపి "మరుపనేది మన నిఘంటువులోనే లేదు. తప్పకవెళ్ళి మాట్లాడి వస్తాను" అంటూ సాగిపోయాడు.

( సశేషం )

దేశభాషావారపత్రికలలో సర్క్యులేషన్ ప్రకారం
'ఆంధ్రసచిత్రవారపత్రిక' ఐదవస్థానం ఆక్రమిస్తున్నది.

# హరివంశం

(12-వ పేజీ తరువాయి)

లేదు. జడుడా! పెండ్లి చేసుకొనక ఏమి చేయుదువు అనెను. నేను అంటిని: "పెండ్లి చేసుకొని ఏమి చేయుదును" అని. నాకు నేనే బంధమును. మరి ఇంకో బంధము ఎందుకు అంటిని. ఆయన వూరుకొనలేదు. పెండ్లి చేసెను. నేను అవిముక్తమునకు వచ్చివేసితిని. నా మేనమామకూతురు గూడ వచ్చెను. నేను ఏమిచేయుదును! వెంటపడి వచ్చినదానిని వదిలివేయుదునా! సాందీపని కులపతి గదా, నన్ను శిష్యునిగా స్వీకరించి, నాల్గు మంత్రములు చెప్పినచో గంగరేవుననో, విశ్వనాధుని ఆయతముననో చేరి జీవించవచ్చు ననుకొంటిని. సాందీపని నాకు చదువు చెప్పలేదు. ఓరి! జడుడా! నా ఆశ్రమమున ఉండుమురా! అన్నాడు. ఈ కరుణ నామీద ఆయనకు ఎందుకు పుట్టినది! నేను "అయ్యా! సాందీపని! నేను జడుడను. విద్యయే బంధము అనుకొని గూడా నిన్ను ఆశ్రయించినాను. మరి నీవు నన్ను ఈకరుణచేతగూడ బంధించుచున్నావు" అన్నాను. మీ ఆశ్రమములో ఉండిపోయినాను. నా మేనమామ కూతురను మీరు చూచుచున్నారు గదా! అది నామాట వినదు. నేను కాపురము చేయను అన్నాను. చేనుకున్నవాడవు కాపురము చేయక ఏమి చేసెదవు అన్నది. నేను ఏమి చేయవలెను. ఈ బంధమును ఎట్లు వదిలించుకొనవలెను. కాపురము చేసితిని. బిడ్డలు కల్గినారు. పశువును త్రాళ్లతో కట్టినట్లు ఈ అందరు నన్ను భూమికి బంధించుచున్నారు. నేను ఆ బంధములు వదిలించుకొనగా ఆలోచించినాను. నాకును, వీరికిని ఏమి సంబంధము! నేను ఎవ్వడను! వీరు ఎవ్వరు. ఈ స్త్రీ ఏమి! ఈ పురుషు డేమి! ఈ సంతానమేమి! ఉపనిషత్తులేమో "మాతా పూర్వరూపం" అన్నవి. "పితా ఉత్తరరూపం" అన్నవి. ఇక్కడ నా భార్య మాతయా! అది పూర్వ రూపమేమిటి? లోకవద్ధతిని ఆ పూర్వరూపము నేను. అనగా తండ్రిని. నా భార్య అనగా మా మేనమామ కూతురు ఉత్తరరూపము. అది నాకన్న చిన్నది. మరియును ఇక్కడ ఎవరికి ఎవరు తండ్రి! ఎవరికి ఎవరు తల్లి! నాకు తండ్రి ఎవరు. తల్లి ఎవ్వరు. నేను అందరిని వదులుకున్నాను. ఈ భార్య నన్ను వదులుటలేదు. అందుచేత నేను దానిని భరించుట మానివేసినాను. అయినను ఆ బంధము నాకు వదులుటలేదు. క్రొత్త బంధములను తెచ్చిపెట్టుచున్నది. మరి ఇప్పుడు మీరును మరియొక బంధముతో నన్ను కట్టగా చూచుచున్నారు. నేను ఈ బిడ్డనికి విద్యాభ్యాసము చేయుట యేమి! ఆ బిడ్డడో సాందీపని బిడ్డడు. నేనో పరమ జడుడను. ఆబిడ్డ యెక్కడ? నేను ఎక్కడ!" అన్నాడు. దీక్షితాయణి వూరుకొనలేదు. తనచేత వానికి అక్షరములు నేర్పించినది. వాడు పుట్టినది మొదలు తనవద్దనే మాలిమి అయినాడు. కాదనుట యెట్లు! మరి వాడు ప్రభాసతీర్థమున ఉగ్రగ్రాహమువాతపడగా, సాందీపని భార్య అన్నది: "మహానంద! నీ ఒక్క బంధము

తొలగిపోయినది." ఆ దినమున తనకు దుఃఖమన్న ఏమియో తెలిసినది. ఆ దినము నుండియు తనకు కాశి కాశిగా లేదు. మరల సాందీపనిబిడ్డ తిరిగి వచ్చిన ఎట్లుండునో, కాశి తనకు అట్లు ఉండ వలెను. అది అటుల ఎట్లులుండును. సాందీపని బిడ్డ తిరిగి వచ్చినచో ఉండును. సాందీపని బిడ్డ ఎట్లు తిరిగి వచ్చును ? మహానందునకు అది తెలియలేదు. ఒక్కసారి మరణించినవాడు తిరిగి ఎట్లు వచ్చును ? ఇవి ఏమి ఆలోచనలు అను కొన్నాడు మహానందుడు. కాని కాశిమాత్రము అతనికి కాశిగా లేదు. కాశిలో తనకు దుఃఖము తప్ప, ఆనందలేశ మగుపించుటలేదు. కాని ఈ దిన మున హఠాత్తుగా అంతయు మారిపోయినది. కాశిక ఏమో కొత్తరూపము ధరించినట్లు ఉన్నది. ఇప్పుడు ఇది వసంతమా ! తాను చూచినది ఏదియు అట్లు లేదు. ఆరు ఋతువులును సమా హార స్థితిని చెంది కాశికను ఆవేశించినట్లు ఉన్నది. ఇది యేమి ఋతువు ! ఏదో క్రొత్తఋతువు వచ్చి కాశికలో నిల్చినది. కానిచో సాందీపని ఆశ్ర మములో మల్లెపొదలో మందారములు పూయుట యేమి ! మందారములలో పారిజాతములేమి ! పారిజాతములలో చూతమంజరులేమి! మరి ఈచల్లని గాలి ఎక్కడిది ! ఇంత అందముగ, ఇంత హాయి గ, ఈ గాలి ఎప్పుడు వీచినది ? గంగ తన శైత్య మును సమపాళముగచేసి ఈ గాలిలో నూరి పోసినదా ! లేక మలయపర్వతము కరిగి, రూపము లేనిదై, ఈ గాలిని ఆవేశించినదా ! గంధము పృధ్వికి లక్షణముగా చెప్పినారు ! మరి ఈ గాలిలో ఈ గుబాళింపు లేమి ! ఈ సువాసనాలహరి యేమి ! పంచ భూతములు ఒక్కడై, దేనిశక్తి దానిదిగాక అన్నిశక్తులును సరితూకములలో మేళనము చెంది, సాందీపని ఆశ్రమము చైత్యరథమును పోని సొబగును గుదిగూర్చికొన్నది. కాశి యెట్లులున్నది ? మహానందుడు కాశిని చూడగా బయలుదేరినాడు. గంగదరిని సాందీపని ఆశ్రమము ఉన్నది. ముందు మహానందుడు గంగను దర్శించినాడు. గంగ కన్యా దానమునకుగాను అలంకరింపబడిన వధూవలె ఉన్నది. భగీరథుడు తపస్సుచేసి సాధించినవేళ, సురధుని గుభిల్లున శివజటాకోటిలో పడినప్పుడు ఇంత అందముగా ఉన్నదా ? పద్మభవుని కమం డులు వారి మందాకినియై చిందినప్పుడు ఇంతటి అందమును పొందుపరచుకున్నదా ? అధోక్షజుని పాదకమలసందోహమందిరమునుండి సుందరమక రందమందాకినియై తుందిలముపొందినప్పుడు ఇంతటి హాయలు ఒలికినదా! ఒక్కతనకేకాదు, ఆ బ్రహ్మ ముహూర్తములో గంగలో వార్చుగా వచ్చిన ధరణీ సువర్వులకు అందరికిని అట్లులే ఉన్నది.

మరి కాశియో ? విచిత్రముగా నున్నది. అవి ముక్తము ఇంత అందముగా ఎప్పుడున్నది. జనము నగరము అలంకరింపబడిన తీరు చూచి ఆశ్చర్య పోవుచున్నారు. వీధులను ఎవరు ఇట్లు తీర్చిరి ? ఎవరు వీధులను ఇట్లు విశదములు చేసిరి ? ఈ కళ్ళాపుల ఎవరు చల్లిరి ? ఎవ్వరు వీధివీధిని, శృంగాటకము శృంగాటకమున, గృహాంగణము గృహాం గణమున ఈ రంగవల్లులు తీర్చిరి. ప్రతి గృహ ప్రాకార భిత్తికయు శైవ వైష్ణవ కథానకములచేత శిల్పీకరింపబడినది. సముద్రమథనము, శివుడు హాలాహలమును మ్రింగుట, విష్ణువు మోహి నియై పరమశివ దేవుని కికురించుట, త్రిపురాసుర ధర్షణము మొదలైన గాథలు కుడ్యశిల్పములుగా మలచబడినవి. ఒక్కరాత్రిలో ఇది యంతయు జరుగగా మహానందునికి వలెనే, సర్వ కాశీ ప్రజయు ఇదియంతయు పరమశివుని మాహాత్మ్యమనుకొని నారు. దేవతలు కాశిని ఎందులకో ఇట్టుల అలంక రించినా రనుకొన్నారు. మరి కాశికకు చేయబడిన ఈ దివ్యప్రసాధనము ఒక్కవిధముగా నున్నది. ముక్తిమంటపము అలంకరింపబడిన తీరు ఇంకొక విధముగా నున్నది. ముక్తిమండపము కైలా సము వోలె అలంకృతమైనది. నైజమైన సౌంద ర్యముచేత, నిసర్గమైన శైవశక్తిచేత, ప్రకృతి సిద్ధమైన అన్నపూర్ణామధురమందహాస దీధితుల చేత, పరమశివునిమేని తెల్లనికాంతిచేత, ప్రమ థుల వ్రతదీక్షచేత, సర్వ శైవధర్మ మహత్వము చేత పుంజీభావముచెందినదివోలె, నందిమూపు రము ఆకారము దాల్చినదివోలె, ముక్తి మంట పము వెల్గుచున్నది. అందరికిని ఇది కరము ఆశ్చ ర్యము కల్గించినది. అద్భుతమును ఒనగూర్చినది. కాని మహానందునకు ఈ అలంకారములన్నియు ఒక్కయెత్తు; సాందీపని ఆశ్రమ వినూత్న సౌందర్యము ఒకయెత్తుగా నున్నవి.

మహానందుడు కాశిలో అన్ని తీర్థములను దర్శించినాడు. అన్నితీర్థములు అనిదంపూర్వ మైన మహత్తును దేనినో వెలార్చుచున్నవి. కాని కాశిలో వైష్ణవతీర్థముల పద్ధతి వేరుగా నున్నది. పాదోదకతీర్థము, మణికర్ణికాతీర్థము, బిందు మాధవతీర్థము, మరియు కాశికలోనున్న ఇతర తీర్థములను దర్శించగా, తనలో తనకే మహా నందునకు ఆనందము కల్గినది. ఈ తీర్థములను తాను దినమును సేవించుచున్నాడు. దినమును దర్శించుచున్నాడు. కాని ఇట్టిదర్శనము ఎప్పు డును లేదు. ఇట్టి అనుభూతి మున్నెన్నడును కల్గలేదు. మరియు మణికర్ణిక ఘనమహిమ మును వెలిగ్రక్కుచున్నదివలె ఉన్నది. మహా నందునకు మనస్సులో అనిపించినది. ఈ మణి కర్ణిక ఉన్నదో అతనికి అనిపించినది: శ్రీమత్కాశీపుటభేదన లక్ష్మీ శ్రుతి మణికర్ణిక మణికర్ణిక; యావనతీవర చూడా మణికిని హారకమల దీర్ఘిక మణికర్ణిక; వేద పురాణాగమ విద్యాపణవిధీమాణిక్యము మణికర్ణిక; కాంచనగర్భ హిరణ్యకమండలు గండూషిత జల ధర మణికర్ణిక; పంచక్రోశ్యవిముక్తక్షేత్రాబ్జ మధూళీపూరము మణికర్ణిక; మందాకిన్యంభోవేణీ భర మధ్య నాభిచక్రము మణికర్ణిక; మణికర్ణిక, మణి మణికర్ణిక; మహానందునిలో మణికర్ణిక విచిత్ర మైన సమాధిస్థితిని సృష్టించుచున్నది. అతడు అక్కడ ధ్యానపరుడై నిలబడిపోయినాడు. అంతలో అతని శ్రవోరంధ్రములకు మరియు మణికర్ణికా ష్టకము వినవైనది. ★

ప్రభుత్వంలో చేరి, నెహ్రూ తర్వాత నెహ్రూ అంతటివా రనిపించుకొన్నారు. సంపూర్ణానంద్, సి. బి. గుప్తాల మధ్య ఎంతటి తీవ్రమైన సంఘర్షణ వచ్చినా, పంత్ తిరిగి యు. పి. నాయకత్వం చేపట్టాలని ఎవరైనా అనగలిగారా ? లేదు. అలా అనడం మొత్తం దేశానికి అపచారం చేసినట్లవు

## మనము—మన రాష్ట్రం

(13-వ పేజీ తరువాత)

తుందని తెలుసు. అదేవిధంగా బొంబాయినుంచి మొరార్జీ, ఎస్. కె. పాటిల్, మైసూరు నుంచి కె. సి. రెడ్డి, సౌరాష్ట్రనుంచి ధేబర్, ఆంధ్ర నుంచి బెజవాడ గోపాలరెడ్డి, ప్రభృతులు అఖిల భారతస్థాయికి వెళ్ళారు. అలా వెళ్ళినవారు తిరిగి స్వరాష్ట్రాలకువచ్చి నాయకత్వం చేపట్టిన సందర్భాలు (ఒరిస్సాలో మెహతాబ్) లేవని కాదు. ఉన్నా అటువంటిది అంత వాంఛనీయం కాదనే.

సమర్థులైన నాయకులు రాష్ట్రాలు వదలి వెడితే ముఠాతగవులు తప్పవు అనవచ్చు. నిజమే. యు. పి, బీహారు, మైసూరు, ఆంధ్ర ఇత్యాది రాష్ట్రాలే ఇందుకు ఉదాహరణ. అయితే, ముఠా తత్వంతో అటు సంస్థలోనూ, ఇటు శాసన విభాగంలోనూ పైకివచ్చిన పూర్వపువారే ఈ తగవులకు మూల కారకులు; ఈ బాపతువా రున్నంత కాలం ఏదో రకమైన కీచులాటలు ఉంటూనే ఉంటాయి. కాని ఇటువంటి తగాదాలు విసిగి వేసారి స్థాయికి వెళ్లినప్పుడే సమర్థులైన నాయకులు కొత్తగా ఉద్భవిస్తారు. ఇందుకు ఒరిస్సాయే ప్రత్యక్ష తార్కాణం. పాత నాయకత్వాన్ని కొట్టివేసి, నిన్నమొన్నటిదాకా ఎవరికీ తెలియని శ్రీ విజయానందుడు ఆ రాష్ట్రానికి నేడు ఏకైక నాయకుడైనాడు.

ఏమైనా "కార్యశూరుడు", "పరిపాలనా దక్షుడు" అయిన శ్రీ సంజీవరెడ్డి, రాష్ట్రానికి తిరిగి రావాలన్నా, రాదలచుకొన్నా అభ్యంతర మేమీ లేదు. కాని భారతదేశమంత విశాలదృష్టి ఏర్పడిన తరువాత, భారతసమస్యలను సంపూర్ణంగా ఆకళింపు చేసుకుని వాటి పరిష్కారంకోసం అహరహం కృషి చేస్తున్నవారిని తిరిగి రాష్ట్రానికి రమ్మనడం, వారి అనుభవం, కార్యశూరత, దేశానికి వినియోగపడకుండా చేయడమే. సంజీవరెడ్డి సమర్థుడని, ఆయనద్వారా కాంగ్రెసును పటిష్ఠం చేయవచ్చునన్న ఆశతో గదా నెహ్రూ అధ్యక్ష పదవికి ఆహ్వానించింది. శ్రీ రెడ్డికూడా తనపై మోపిన బాధ్యతలను ప్రశంసనీయంగా నిర్వహించి, ఢేబర్, ఇందిరాగాంధీల కన్నా నయమనిపించుకొన్నారు. అనేక రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలలో, ప్రదేశ్ కాంగ్రెస్ సంఘాలలో వచ్చిన తగాదాలు చాలామటుకు తీర్చేశారు. ఒరిస్సాలో మిశ్రమ ప్రభుత్వాన్ని రద్దుచేయించి మధ్యంతరపు ఎన్నికలలో కాంగ్రెసుకు అఖండవిజయం సమకూరేట్లు చేశారు. ఆంధ్రలో కూడా, ముఠాతగవులకు కారకుడు సంజీవరెడ్డేనని ఆరోపణలు వచ్చినా, ఇప్పు డవన్నీ చాలాభాగం సద్దుమణిగాయని, అంతా ఏకమైనామని అంటున్నారు గదా. మొత్తంమీద సంజీవరెడ్డి హయాంలో కాంగ్రెస్ సంస్థ, ఎంతో పటిష్ఠమైందనే అనాలి. కాబట్టి వీలుంటే ఇంకో 'టరం' కూడా వారు కాంగ్రెస్ అధ్యక్షపదవిని నిర్వహించి, జాతీయసంస్థకు పూర్వం ఉన్న గౌరవప్రతిష్ఠలు సంపాదించిపెడితే ఎంతో మేలు.

ఆంధ్రరాష్ట్రంలో నాయకులకు కొదువలేదు. యువకులు, సమర్థులు కూడా ఉన్నారు. అవకాశం, వెసులుబాటు లభిస్తే వారి సామర్థ్యం వెల్లడి అవుతుంది; పూర్వంనుంచి పెద్దనాయకులుగా చెలామణి అయినవారు తమ సలహా, సహకారాలు అందజేస్తూ యువనాయకత్వాన్ని ప్రోత్సహించడం అవసరం.



—కౌండిన్య.

| పట్టిక (2) వేతనాలు. | ఆదివారములు, సెలవుదినములు. | అదనపు ప్రతిగంట పనికి చెల్లించదగిన ధనం. |
|---|---|---|
| 50 పైన | | |
| 100 లోపు | | 0.65 |
| 100 పైన | | |
| 150 లోపు | | 1.10 |
| 150 పైన | | |
| 200 లోపు | | 1.55 |
| 200 పైన | | |
| 250 లోపు | | 2.10 |
| 250 పైన | | |
| 300 లోపు | | 2.55 |
| 300 పైన | | |
| 350 లోపు | | 3.00 |
| 350 పైన | | |
| 400 లోపు | | 3.45 |
| 400 పైన | | |
| 450 లోపు | | 3.90 |
| 450 పైన | | |
| 500 లోపు | | 4.35 |
| 500 పైన | | |
| 550 లోపు | | 4.85 |
| 550 పైన | | |
| 600 లోపు | | 5.30 |
| 600 పైన | | |
| 650 లోపు | | 5.75 |

బిల్లులు ఇందులో నమోదు చేయాలి.

ఈ రిజిస్టరు ఉన్నతాధికార్లు, ఆడిట్ కాలంలో

# న్యూఢిల్లీ లేఖ

(7-వ పేజీ తరువాయి)

ఆడిటరు తనిఖీ చేస్తారు. ఇంతేగాక అలవెన్సు దుర్విని యోగ మైనట్లు ఉన్నతాధికారి దృష్టికి వచ్చినప్పు డల్లా, ఈ రిజిస్టరును తనిఖీ చేయవచ్చు.

ఉన్నతాధికారి తను పరిశీలించేటప్పుడు, ఏ వ్యక్తి కైనా నెలకు 10 రోజులకు మించి అదనపు పని అల వెన్సు చెల్లించటం జరుగుతున్నదేమో కూడా తనిఖీ చెయ్యాలి.

ఈ ఉత్తర్వులో చెప్పబడని తరగతుల ఉద్యో గుల విషయం : ఈ ఉద్యోగులు అదనంగా పని చేసి నప్పుడు వీరికి చెల్లించాల్సిన ధనపథకం ఏమీ సిద్ధంగా లేదుగనుక ఆర్థికశాఖతో సంప్రదించి అలాంటి అదనపు పనిఅలవెన్సు పథకాన్ని ఏర్ప రచుకోవచ్చు. వాటికి ఈ క్రింది విషయాలు పాటిం చాలి. (1) ఉద్యోగుల సాధారణ పని కాలాన్ని నిర్ణ యించాలి. (2) ఉద్యోగులు చేసే పని స్వభావాన్ని ఒక ప్రత్యేక అదనపు పని అలవెన్సు పథకాన్ని ఏర్పరు స్తుంది. (3) ఉద్యోగులు ఉన్నతాధికార పర్యవేక్షణకు లోబడి, అదనంగా పనిచేసేందుకు ముందుగా అను మతి తీసుకొంటేనూ, (4) ఈ ఉత్తమ సూత్రా లను బలపరచేటట్లుగా పథకం ఉంటేను అదనపు పని అలవెన్సుపథకం ఏర్పాటు చేసుకోవచ్చు."

ఈ పథకం కాగితంమీద చూడటానికి మహ ముచ్చటగా ఉంది. అయితే కావల్సినన్ని ప్రతి బంధకాలు, ఈతి బాధలు ఏవో రానే వస్తున్నాయి. ఆఫీసులో పనిచేయాల్సిన కాలాన్నంతా బాతాఖానీ, కాఫీలు, సిగరెట్లు, వాలీబాల్ ఆటలు లాంటి వాటిల్లో ఖర్చుపెట్టేందుకు సాగం శక్తివంచన లేని ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నై. ఆఫీసులో పని, అసలు పనంటు ఏదైనా ఈలోపల మిగిలి పోతే, ఆ పనిని అదనపు కాలంలోనే ప్రారంభించటం, ఈ పని కాలాన్ని పొడిగించటానికి మానవుడి స్వాహ పోహలకు ఎంత వీలుంటుందో అంతవరకు పొడి గించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఈ పనివిధానం ఈ పద్ధతినే కొనసాగేటట్ల యితే శ్రీ మొరార్జీ దేశాయ్ అదనపు ఖర్చు గ్రాంటుకు సప్లిమెంటరీ డిమాండు తీసుకురావాల్సి ఉంటుంది. ఆరునెలల్లోగా ప్రతి ప్రభుత్వోద్యోగి జీతాన్ని రెండింతలుగా పెంచుతుంది.

కాంగ్రెసుకు ఓటు చేసేందుకుగాను ఇంకో పద్ధతికూడ ప్రవేశపెట్టటం జరిగింది. న్యూఢిల్లీని 'ఏ' తరగతి నగరంగా పరిగణించ బోతున్నారు. అందువల్ల ప్రతి ప్రభుత్వోద్యోగి జీతంలోను రు. 75 —ల పెరుగుదలలో, జీతం మొత్తంమీద 8% హెచ్చింపో (ఏది తక్కువ మొత్త మైతే అది) వెంటనే జరుగుతుంది. కేంద్ర ప్రభుత్వ కోశానికి ఇది పెద్ద ఖర్చు కల్గిస్తుంది.

'ఈ సదుపాయా లన్నిటి'కి తగ్గట్టుగా శక్తి సామర్థ్యాలు, పనులలో పెరుగుదల కన్పించివుంటే బాగానే ఉండేది. కాంగ్రెసువారి (వారి చెప్పు కుంటున్న) సంక్షేమ రాజ్యంలో ఈ సదుపాయాలన్నీ పోకడలు తప్పితే రాకడలు లేని బాటలు.

అధికార్లకు, ఖర్తరఫ్ అధికారాలు మళ్లీ ఇస్తే తప్ప, పరిపాలనా కార్యక్రమాలలో సామర్థ్యం, క్రమశిక్షణలలో పెంపుదల కన్పించదు. శిక్షించే అధి కారం లోపించినంతకాలం గట్టిపనంటూ జరగదు. ఈ విషయానికి నిదర్శనంగా, న్యూఢిల్లీలోని విదేశీ రాయబార కార్యాలయాలను చూడొ★



రోగిని చూడ్డానికి నేనే వస్తున్నా కదండీ!...

చిత్రకారుడు : శ్రీ "కృష్ణకాశ్యప" (కాకినాడ)

# గళ్లనుడి కట్టు-62



## అడ్డం

2. తెల్లటి (సుభ్రం చేస్తే!) ముంకమా ?
3. తే ! మణిహారాన్ని : తడి లేకపోతే ఎలా ?
6. కదురు సున్నా అయితే కాఠిన్యం తప్పదు.
7. అక్కడ బర్బర దేశంలో గిన్నె.
8. కంచె మేయకూడనిదా ?
9. శార్దూలం.
11. 4 నిలువు మధ్య ఎందు కనుకొంటే నాయొక్క
12. ఏడుపు !
14. కనుక, మారిస్తే కోపం రాగలదు జాగ్రత్త !
15. మొదటి అంకె నీవిధంగా వ్రాసినా ఒకవిధంగా తప్పులేదు !
17. మండూకధ్వని.
18. కందరములలో ఒక దినుసు.
20. బంధం.
21. కంటికి నచ్చినదేనా ? వాన దరువులలో చూడండి !
22. —మూత.
23. త్రాసుకు సంబంధించినది.
24. ఎడం కాకపోతే సరి.
26. అరికాలుమంట శత్రువును చూస్తే సరి !
27. పుల్ల.
29. వారి పరువు పుస్తకంలో వెదకండి, శత్రువు తథ్యం.
30. అంగద రాజ్యంలో ఆయుధం.
32. శనగలమధ్య ఆభరణం.
33. మాట !
35. పొకలుమధ్యమాత్రం తగలడిపోతే తెల్లగ ఉంటాయా ?
36. కంచుకము.
37. చిందరవందరయిపోయిన రాజుకిచ్చే ధనాన్ని మూసివేయుము.
38. తిరగబడినా అన్నీ దీనికోసమే నంటారు.
39. చర్మము.

## నిలువు

1. కత్తికి కావలసినది.
2. హరిద్ర.
4. ఎటునుంచి చూసినా కాలికి సంబంధించినదే!
5. చొక్కా వరముగా ఇస్తే ప్రవేశము దొరుకుతుంది.
8. దగ్గర.
10. ఈ యుగానికి, స్త్రీ—చిందరవందర అయిన తర్వాత.
11. —సంక్రాంతి.
13. —గేదె.
16. శునకం తోకలో బంగారం !
17. భేదము.
19. ఈరకం దారిలో ఒక చెట్టు కూడానా ?
20. రాముడు పువ్వుం దేనినిగా చెల్లించుకున్నాడో మీకు తెలిసిఉండాలి.
23. ఒక రకం ఈగ.
25. తలక్రిందులయిన సాము.
26. కాదు కాదా ?
28. అక్షరాలకు సంబంధించినవి చాలా ఉన్నాయి.
31. క్రిందనుంచి నీటి పొంగు.
32. అచ్చం అటువంటిదే !
34. కొబ్బరిచిప్పల నీవిధంగా పిలవటానికి వీలుంది.
35. వంటలో కాళ్లూ, చేతులమీద కదలము !



## 61-వ గళ్లనుడికట్టుకు జవాబు



---

ఒక భక్తురాలు బిచ్చగానితో:

"నాయనా! కుంటివాడవు కాబట్టి సరిపోయిందిగాని గుడ్డివాడవయితే ఇంకెంత బాధ పడుదువో."

బిచ్చగాడు:- "అవును తల్లీ! వెనకటికి నేను గుడ్డివాడుగా ఉన్నప్పుడు చాలామంది అర్ధణా వేసి అణా తీసికొనే వాళ్ళమ్మా."

ఎస్. శివసుబ్రహ్మణ్యం (బందరు)

---

## పొట్టి కథలు

### 'నీళ్లనేనండి'

మద్యనిషేధం మీాద ఉపన్యాస మిస్తూన్న రాజకీయ నాయకుడు:

"మాటవరుసకు ఇక్కడ నొక గిన్నెలో నీళ్ళు, మరొక గిన్నెలో సారాపెట్టి, ఒక గాడిదను తీసుకొచ్చామనుకోండి. అది దేన్ని తాగుతుంది?" అని ప్రశ్నించాడు, ప్రేక్షకుల మొహాలు చూస్తూ.

"నీళ్ళ నేనండీ," అని ప్రేక్షకుల్లోంచి జవాబు వచ్చింది.

విజయగర్వంతో రాజకీయవేత్త, "ఎందువల్లనో చెప్పగలరా" అని మళ్ళీ అడిగాడు.

"అది గాడిదగాబట్టి!"

గోలి కృష్ణమోహన్‌రావు (గుంటూరు)

### ఇంటిపన్ను

ఆదాయమంటూ లేని ఒక ఆసామీా నివసించడానికి ఇల్లు లేక ఊరిచివరనున్న ఒక పాడుపడిన (నీరులేని) నూతిలో తన వసతిని ఏర్పాటు చేసుకున్నాడు. రెండురోజులు గడచిన తరువాత ఆ నూతి గట్టుకు ఒక నెంబరు, నూతిలో మునిసిపాలిటీ వారిచే ఇవ్వబడిన ఒక కాగితం అతనికి కనిపించాయి. ఆ కాగితంలో ఇలావుంది.

"ఈ నూయి వసతిగా ఉపయోగింపబడుచున్నట్లు తెలియచేయబడింది. అందుచే దీనికి ఒక ఇంటి నెంబరు, ఏడదికి నూరు రూపాయల పన్ను వేయబడింది."

ఇది చదువుకున్న ఆసామీా మూడు గ్లాసుల నీరు త్రాగి మూర్ఛపోయేడు.

పి. సోమశేఖర్ (రూర్కెలా-2.)

*       *       *

ఆకాశంలో పోతూన్న విమానాన్ని చూపిస్తూ కొడుకు తండ్రితో.

నాన్నా! ఈవిమానం ఇట్లానే ఆకాశంలోకి పోతూంటే ఎంత కాలానికి స్వర్గం చేరుకుంటాను?

తండ్రి:- పెట్రోలు అయిపోగానే.

శేతి శివసుబ్రహ్మణ్యము (బందరు)




చిత్రకారుడు : చిత్తర్వు సూర్యనారాయణరావు (మచిలీపట్టణము)

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street, Madras-1. Chief Editor : S. Sambhu Prasad.

# మీరు
# ఉబ్బసం
# వల్ల బాధపడుతుంటే

ఎఫజోన్ బిళ్లలు మరల భారతదేశంలో దొరుకుచున్నవి. ఉబ్బసం, రొమ్ముపడిశెం, గుండెనంజు, గుండెలలో కఫం, హె జ్వరం, తత్సంబంధమైన వ్యాధుల వల్ల బాధపడు వారికి ఎఫజోన్ గుణకారి. ఎఫజోన్ సేవించుటకు సులభమైనది, సురక్షితమైనది, రూఢిగా గుణమిచ్చునది శీఘ్రనివారణ గలిగించునది.

ఎఫజోన్ సూత్రమందలి వైద్య శాస్త్రీయమైన ఔషధ పదార్థముల గుణములు దిగువ వివరింపబడినవి : —

1. ఎఫజోన్ శ్వాసనాళములయొక్క కండరముల ఈడుపును పోగొట్టె శక్తివంతమైన గుణము గలిగియున్నది.

2. ఎఫజోన్ శ్వాసనాళములు మరియు గొంతులో గల గట్టి శ్లేష్మమును పలుచన పరచును. అందువల్ల అది సులభంగా దగ్గు మూలకంగా తొలగింపబడగలదు.

3. ఎఫజోన్ ఊపిరితిత్తులందలి రక్తనాళములలో అధికకూడికయైన ఒత్తిడిని నివారించును

4. ఎఫజోన్ గుండెలలోని అత్యాయాసకారక ఒత్తిడిని తగ్గించిపనిచేసేశక్తినిహెచ్చించును

5. ఎఫజోన్ నరములను శమనపరచే గుణమును గలిగియున్నది. ఇందు మూలకంగా ముమ్మరమైన ఉబ్బసంయొక్క ముఖ్యగుణమైన దడతో గూడిన ఒగర్పును తొలగించును మరియు రొమ్ము పడిసెపు బాధైన ఎడతెగని దగ్గును తగ్గించును.

ఉబ్బసం వేగముగా తాకి విజృంభించును. కాని అది తాకిన స్వల్పమాత్రపు చిహ్నం కనిపించగానే ఒక ఎఫజోన్ బిళ్లను మ్రింగినయడల మీకు రూఢియైన శీఘ్రనివారణకలుగును.

ఎఫజోన్ యొక్క యోగ్యమైన ప్రశంసనీయ గుణములు, దానిని వాడినట్టి అనేక వ్యాధిపీడితుల వల్లను, దానిని నిర్ణయించిన అనేక మంది డాక్టర్ల వల్లను, ఋజువు పరచబడినవి ఎఫజోన్‌లో అలవాటు కాగల ఓషధులు లేవు. ఇది 15, 45, 100 మాత్రలుగల ప్యాకెట్‌లలో కెమిస్టులందరి వద్దను. మందుల షాపులన్నిటిలోను దొరుకుచున్నది.




# EPHAZONE

ఎఫజోన్ నిర్మాతలు మరియు పంపిణీ దారులు:

జె.ఎల్. మారిసన్, సన్ అండ్ జోన్స్,

ఇండియా లిమిటెడ్

బొంబాయి కలకత్తా మద్రాస్ ఢిల్లీ